మమత-సమత-మానవత
www.gurajada.org

# ప్రకాశిక

ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakashika.org

పునః ప్రారంభ సంచిక

సంపుటి 1 | సంచిక 1 అక్టోబర్ - డిసెంబర్, 2020



# ప్రకాశిక – ఒక పరిచయం

ఆధునిక కవితకు అడుగుజాడ అయిన మహాకవి శ్రీ గురజాడ వేంకట అప్పారావు గారు తలపెట్టిన పత్రిక **'ప్రకాశిక'**. ఆ పత్రికని పునరుద్ధరించి ఆయన స్మృతికి ఘన నివాళి ఇవ్వాలనే ఉద్దేశంతో **'ప్రకాశిక'** ప్రచురణకి గురజాడ ఫౌండేషన్ (అమెరికా) పూనుకుంది. యావత్ తెలుగు జాతికి అలనాటి భాష, సంస్కృతి, సంప్రదాయం, వ్యావహారికాలను, సమకాలీన సాహితీ ప్రక్రియలను మళ్లీ పరిచయం చేస్తూ, నేటి సమాజపు స్థితిగతులకు అద్దంపట్టే ఒక వేదికగా ప్రకాశిక రూపుదిద్దుకుంటోంది. దీనిని తెలుగు అంతర్జాల త్రైమాస పత్రికగా వెలువరిస్తున్నాం.

గురజాడ కలం నుండి జాలువారిన అక్షర మాలికలు ఎన్నో గురజాడ వేంకట అప్పారావు గారికి 'మహాకవి శ్రీ గురజాడ అప్పారావు'గా గుర్తింపు తెచ్చిన ఆయన రచనలు ఆణిముత్యాలు, సరస సరాగాలు, ముత్యాల సరాలు. పరిసరాలని పరిశీలిస్తూ, ప్రభావితమవుతూ, మంచి అన్నది పెంచమంటూ, భాష భావ వ్యక్తీకరణకు సాధనమే కానీ పదడాంబిక ప్రదర్శనకు సూచిక కాదని నమ్మి, తెలుగు భాషని తేటగా, తీయగా, సరళంగా, సరసంగా పండిత పామరులకు చేరువ చేయడంలో ఆయన సలిపిన కృషి అజరామరం, చిరస్మరణీయం.

సాంఘిక దురాచారాలని వ్యావహారిక భాషలో ఎత్తి చూపి, వ్యంగ్యాయుధంతో వాటిని కూకటివేళ్లతో సహా పెకిలించిన అరుదైన భాషావేత్త, సంఘ సంస్కర్త, మహాకవి, గురజాడ వేంకట అప్పారావుగారు. అక్షరాయుధంతో మరెన్నో సాధించాలనుకున్నారో ఏమో, **'ప్రకాశిక'** పత్రికను ఆయన స్థాపించారు. అయితే, ఆ పత్రిక ఎంతోకాలం సాగిన దాఖలాలు లేవు. తొలి రాత ప్రతి దొంగించబడిందని ఆయన వంశీకుల ఆవేదన. ప్రకాశిక పత్రిక పరహస్తగతమైనా, అందులోని భావతరంగాలు శతాబ్దానికి పైగా ఎన్నో తరాలను ఉత్తేజపరుస్తునే ఉన్నాయి.

ఆ మహాకవి కాలంలో ఉన్న దురాచారాలు, మూఢ నమ్మకాలు ఈ కాలంలో కూడా ఆధునిక పరిజ్ఞానంతోపాటు, ఏదో ఒక రూపంలో

విరివిగా, విస్తృతంగా కొనసాగుతున్నాయి. మనుషులలోని భయాలనీ, ఆందోళనలనీ ఆసరాగా తీసుకుని, అరకొర జ్ఞానంతో, శాస్త్రాలకి వక్రభాష్యాలతో అమాయకులని మోసంచేసే నవయుగ గిరీశాలు కోకొల్లలుగా, ఖండాంతరాలుగా వ్యాపించి ఉన్నారు. సమాజంలో, ముఖ్యంగా యువతలో హేతుబద్ధ ఆలోచనలు పెంచే ప్రయత్నం ప్రకాశిక ద్వారా చేద్దాం. గురజాడ వ్యక్తిత్వస్ఫూర్తితో, ఆయన ఆలోచనలకు అనుగుణంగా, భాషోద్దీపన, సమాజ శ్రేయస్సులను కాంక్షిస్తూ **'ప్రకాశిక'**ని నడపాలని గురజాడ ఫౌండేషన్ (అమెరికా) సంకల్పం.

సమాజాన్నితట్టి, కుదిపి, ఆలోచింపచేసే రచనలూ, వెన్నుతట్టి దారిచూపే దార్శనికుల వ్యాసాలు, మస్తిష్కానికి పదునుపట్టే శీర్షికలతో **'ప్రకాశిక'** అందంగా ముస్తాబయి మీ ముందుకు వస్తుంది. ముఖ్యంగా, తెలుగు మాండలిక శోభతో వ్రాసిన రచనలని ప్రోత్సహిస్తాం. హాస్యం, వ్యంగ్యం, వెటకారం తెలియని, నచ్చనివాడు తెలుగువాడు కాదేమో అనిపిస్తుంది. కన్యాశుల్కం ఒక ప్రభావిత నాటకంగా నిలిచిందంటే, హాస్యం, వ్యంగ్యం, వెటకారాలని అనుపానంగా పెట్టి నిష్ఠూరాన్ని నిబ్బరంగా చెప్పడంవల్లే కదా! హాస్య, వ్యంగ్యభరిత, రచనలు పంపిస్తే కళ్ళకద్దుకొని తీసుకుంటాం.

తెలుగు సాహిత్యంలో లబ్ధప్రతిష్టులైన వారితో ఏర్పాటయిన సంపాదక మండలి, ప్రకాశికని అత్యున్నతమైన ప్రమాణాలతో, ఆధునిక భావజాలంతో మంచి సామాజిక, సాహితీ పత్రికగా మలిచేందుకు మార్గనిర్దేశనం చేస్తుంది. కథ, కవిత, వ్యాసం, అనువాద రచన మొదలైన సాహిత్య ప్రక్రియలన్నింటికీ ప్రకాశిక ఒక విలక్షణమైన వేదికగా ఉంటుంది. గురజాడ వారి జయంతిని పురస్కరించుకుని ప్రతి సంవత్సరం సెప్టెంబరు మాసంలో ప్రకాశిక ప్రత్యేక వార్షికోత్సవ సంచికని వెలువరిస్తాము.

**'ప్రకాశిక'**ను ప్రకాశవంతంగా, శోభాయమానంగా తీర్చిదిద్దడంలో సాహితీ మిత్రులు, రచయితల అండదండలు, సహకారం మాకు సదా అవసరం. **'ప్రకాశిక'**లో ప్రచురించమని ప్రసిద్ధ రచయితలకి, కొత్త రచయితలకి ఆహ్వానం పలుకుతున్నాం.

ఈ పత్రిక మనందరిదీ. కలిసి పెంచుదాం.

**ప్రధాన సంపాదకులు**






# సంపాదకీయం

ప్రకాశిక పత్రికను పునః ప్రారంభించడం ఒక చారిత్రక ఘట్టం. ఒక రకంగా సాహసం కూడా. మహాకవి ఆశయాల మేరకు పత్రికను నడపాలన్న ఆదర్శం, నడపగలమా అన్న సంశయాల మధ్య సంఘర్షణ సహజమైనా, అశేష గురజాడ అభిమానుల ప్రోత్సాహం, సహకారాలతో నడపగలమనే నమ్మకం ఉంది. ఇప్పటి వరకూ సహకరించిన ప్రతీ ఒక్కరికీ పేరు పేరునా ధన్యవాదాలు. సహకరించడానికి ముందుకు వస్తున్న అనేకమందికి ముందస్తు ధన్యవాదాలు. సహకరించమని ప్రముఖులకి వినయపూర్వక విన్నపాలు.

యువతని ఉత్తేజపరచి, ఉన్నత ఆలోచనలు, ఆవిష్కరణల వైపు దృష్టి మళ్ళింపగలిగే రచనలు రావాలి. సామరస్యం, ఐక్యత, సమాజ హితం గురజాడ మౌలిక తత్వం. వాదాల ప్రాతిపదికన కాకుండా, అంశాల, ఆశయాల ప్రాతిపదికన రచనలు వస్తే సమాజంలో సామరస్యం పెరిగి, సమానత్వం వైపు పురోగమించే అవకాశం ఉంటుంది. సాహిత్యం ద్వారా ద్వేష రహిత, సామరస్య భావనలని ప్రోత్సహించడం ద్వారా సాహిత్యకారులు గురజాడకి నిజమైన, ఘన నివాళిని ఇవ్వగలుగుతారన్నది నా అభిప్రాయం.

గురజాడని ఒక వ్యక్తిగా మాత్రమే కాకుండా గురజాడ తత్త్వాన్ని ప్రేమిద్దాం; అనుసరిద్దాం. ఈ ప్రయత్నాలకి ప్రకాశిక వేదిక కావాలని నా ఆకాంక్ష.

ప్రకాశిక పత్రికను పునరుద్ధరించే ప్రక్రియలో నేను మళ్ళీ తెలుసుకున్నదేమంటే, మన చరిత్ర, వారసత్వసంపదల పట్ల ఉండవలసిన ప్రేమ, గౌరవం, అభిమానం, వాటిని పరిరక్షించాలనే అభిలాషల ఆవశ్యకత. ప్రకాశిక పూర్వ ప్రతులు కొన్నైనా దొరికి ఉంటే, మనం ఎంత ఉత్తేజం పొందేవాళ్ళం! గురజాడ విషయంలోనే కాదు, చాలామంది అరుదైన వ్యక్తులు రాసిన గ్రంథాలు మచ్చుకు మాత్రమే దొరికాయంటే ఎంత ఆక్షేపణీయం! త్యాగయ్య రాసిన పాడిన వేలాది కీర్తనలలో ఆణిముత్యాలు కొన్ని వందలు మాత్రమే మనకి దొరికాయంటే, మనం కోల్పోయిన వజ్రాలెన్ని ఉండి ఉంటాయో కదా! లిఖిత, మౌఖిక చరిత్రల పరిరక్షణ భావితరానికి మనం ఇచ్చే అమూల్య సంపద.

తెలుగు భాష ఎంత మధురమో, అంత కఠినం! మాట్లాడే భాష, రాసే భాషల మధ్య సమన్వయం కొంత తక్కువన్నది నిజం. తప్పుడు పద ప్రయోగాలని, ఉచ్చారణలనీ ఎద్దేవా చేస్తూనో, అవహేళన చేస్తూనో వచ్చే వ్యాఖ్యలు చూస్తూ ఉంటాం, వింటూ ఉంటాం. వ్యాఖ్యలతో పాటు సరైన పదమేమిటో, సరైన ఉచ్చారణేమిటో కూడా తెలియచేస్తే విస్తృత ప్రయోజనం ఉంటుంది. తెలుగు ఉపాధ్యాయులు, ముఖ్యంగా విశ్రాంత తెలుగు ఉపాధ్యాయులు, భాషా పరిరక్షణకీ, వికాసానికీ చేయగలిగిన సేవ, సహాయం ఎంతైనా ఉంది. తెలుగు భాషాభివృద్ధికీ, పరిరక్షణకీ జరిగే ఏ ప్రయత్నానికైనా ప్రకాశిక అండగా ఉంటుంది. తెలుగు సాహిత్యం ద్వారా సమాజ శ్రేయస్సుకి దోహదపడే ప్రతీ ప్రయత్నానికీ ప్రకాశిక తోడుగా ఉంటుంది.

ప్రకాశిక మన వారసత్వ సంపద. ప్రకాశిక మన అందరిదీ. కాపాడుదాం, కలిసి పెంచుదాం.

కొవ్వలి గోపాలకృష్ణ

**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ**
ప్రధాన సంపాదకులు

# స్మృత్యంజలి

ప్రౌఢ మీసాల సరళ కవితాసామికి
తెలుగు లోగిళ్ళ నీరాజనం
కన్యాశుల్క శృంఖలచ్ఛేదికి
దిగంతఖ్యాతికి, జగదాంధ్ర కోటి భావాంజలి
దార్శనిక ద్రష్టకి ముత్యాల
సరచ్ఛందో మాత్రా విధాతకి

సాహిత్య సమాజ సంస్కరాణాభిషిక్తకి
శత వసంతాల స్మృత్యంజలి

-డా. కొవ్వలి గోపాలకృష్ణ

# ప్రకాశిక సంపాదక వర్గం

**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ,** ప్రధాన సంపాదకులు



పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎంఎస్.సి, దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్, పిహెచ్.డి చేసారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మాస్యుటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయం లోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పని చేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపా దడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి "మనస్వినీయం" అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.

**మా శర్మ,** గౌరవ సంపాదకులు



"మా శర్మ" గా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతా మహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠంను 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని

సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి, మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రతిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు.ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.

**శ్రీమతి గురజాడ అరుణ,** నిర్వాహక సంపాదకులు



గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రోజెక్ట్ మేనేజర్గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.

**శ్రీ గురజాడ రవీంద్రుడు,** సంపాదక సలహాదారు



గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్‌కు ప్రెసిడెంట్‌గా వ్యవహరిస్తున్నారు.

**శ్రీ విహారి,** సంపాదక సలహాదారు



'విహారి' అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం,7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం– పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ–పరామర్శలు, "బతుకు గీతలు", "కథావిహారం" వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి పురస్కారం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన సాఫల్య పురస్కారం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కారం, తె.వి.వి.కీర్తి పురస్కారం లాంటి ఎన్నో ప్రతిష్టాత్మకమైన పురస్కారాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్‌గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్‌లో నివాసం ఉంటున్నారు.

**ఆచార్య వెలమల సిమ్మన్న,** సంపాదక సలహాదారు



బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ ఆఫ్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్‌లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తిస్తున్నారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన, మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.

**ఆచార్య గుమ్మా సాంబశివరావు,** సంపాదక సలహాదారు



తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావు గారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో 'కన్యాశుల్కంలో హాస్యం' పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన 'తెలుగువాఙ్మయ చరిత్ర–రచయితలు' అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటముప్పైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు, అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞానిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.

**డా. సి. భవానీదేవి,** శీర్షిక సంపాదకులు, వనితా ప్రకాశిక



రచయిత్రి, విమర్శకురాలు, ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శిగా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్టాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.

లోపల >>>

# పరిచయం



విహారి

గురజాడ తాను చేపట్టిన ప్రతి ప్రక్రియనూ ఆధునీకరించారు, సామాజీకరించాడు, సమకాలీనం చేశాడు. ప్రయోగం, సాంఘిక ప్రయోజనం రెండూ సాధించాడు.

'చిన్నకథ' అప్పారావు మానసిక పుత్రిక అన్నాడు రమణారెడ్డి. దీని ఆంతర్యమే 'దిద్దుబాటు'! చదువుకుంటే స్త్రీ చెడిపోతుందనుకుంటున్న రోజుల్లో – చదువుకున్న స్త్రీ తన సొంత తెలివితేటలతో, స్వాభిమానంతో – దాంపత్యాన్నీ, కుటుంబాన్నీ కాపాడుకోగలదనే సందేశాన్నిచ్చిన కథానిక 'దిద్దుబాటు'. ఆధునిక స్త్రీలు మానవచరిత్రను తిరిగిరాస్తారన్న గురజాడ నిబద్ధతకు ప్రారంభసూచి ఈ కథానిక.

కమలిని వేశ్యాలోలుడైన భర్తని చాకచక్యంగా, సేవకునితో కలిసి చిన్న నాటకమాడి, భర్తకు కనువిప్పు కలిగించి అతన్ని దారికి తెచ్చుకుంది. అంతే ఇతివృత్తం!

శిల్పపరంగా కథానికకు కావలసిన ఐక్యత, క్లుప్తత, ఎత్తుగడ (సరాసరి కథానికలోనికి ప్రవేశించటం), ఉత్కంఠ, కథనం, నడక, పట్టు, విడుపు, ముగింపు – అన్న అన్ని లక్షణాలూ సౌష్టవంగా, పొందికగా కుదిరిన ఆధునిక కథ 'దిద్దుబాటు'. ఇక శైలి వాడుక భాషా వాదిగా గురజాడ తెలుగుజాతికి ఆనాటికి గల ఆ భాషలో రాసి చూపిన కథానిక ఇది. నిజానికి ముందు కొంత శిష్ట వ్యావహారికంలో 'కమలిని' పేర రాసి, దానిని తనకు తానుగా మార్చి 'దిద్దుబాటు' రూపాన్నిచ్చాడు.

గురజాడ ఆధునిక కథానికాశిల్ప పరిజ్ఞానానికీ, పరిణతికీ ఉదాహరణగా వెలువడిన ఆణిముత్యం ఇది. నాటికీ, ఈనాటికీ, ఏనాటికీ – కథానికా రచనకు 'నమూనా' శైలీ శిల్ప రూపం ఇది. తదనంతర రచయితల ప్రతిభ, ప్రజ్ఞ, ఉపజ్ఞల్ని బట్టి ఆ శైలీ శిల్పాల్ని మరింత సానబెట్టుకుని పురోగమిస్తున్నారు.

1910 జనవరి, ఫిబ్రవరి 'ఆంధ్రభారతి' పత్రికలో ప్రచురింపబడింది – 'దిద్దుబాటు'! ●

తొలి కథ

# దిద్దుబాటు

– కీ. శే. గురజాడ అప్పారావు గారు



## ‘తలుపు! తలుపు!’

### తలుపు తెరవలేదు.

గదిలో గడియారం టింగుమని వొంటి గంట కొట్టింది.

‘ఎంత ఆలస్యం చేస్తిని? బుద్ధి గడ్డి తిన్నది. రేపట్నుంచి జాగ్రత్తగా వుంటాను. యాంటినాచల్లా పోయి సానిదాని పాట సరదాలో మనసు లగ్నమై పోయినది. ఒక్కపాట సరదాతోటి కుదరలేదు. పాడే మనిషి మీదక్కూడా మనసు పరుగెత్తుతూంది. లేకుంటే, నేను పోకిరి మనిషివలె పాట ముగిసినదాకా కూర్చోవడమేమిటి? ఏదో ఒక అవకాశము కలగజేసికొని దానితో నాలుగుమాటలు ఆడడపు ఆసక్తి ఏమిటి? యిదుగో, లెంపలు



వాయించుకుంటున్నాను. రేపట్నుంచి మరి పాటకు వెళ్ళితే వొట్టు – (వొట్టు వేసుకోరాదు. అదో నియమం వొచ్చింది కదూ) మరి వెళ్ళను, నిశ్చయం, నిశ్చయం. గట్టిగాగాని పిలిస్తినట్టాయనా, కమలిని లేవగలదు. మెల్లిగా తలుపు తట్టి రాముణ్ని లేపగలిగితినా చడీ చప్పుడూ లేకుండా పక్కజేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చు.

గోపాల్రావు తలుపు చేతనంటగానే, రెక్క విడబారింది. 'అరే యిదేమి చెప్మా!' అనుకొని తలుపు మెల్లిగ తెరిచేసరికి, నడవలో దీపం లేదు. నాలుగిళ్ళ వాకిలి దాటి, పడకగది తలుపు తీసిచూస్తే దాన్లోనూ దీపం లేదు. చడీచప్పుడూ లేకుండా అడుగువేస్తూ మంచము దరికిపోయి, కమలిని మేలుకొని వున్నదా, నిద్రించుతున్నదా అని కనిపెట్ట ప్రయత్నించెనుగాని, యేర్పరించ లేకపోయినాడు. బల్లమీద తడివి అగ్గిపెట్టె తీసి ఒక పుల్ల వెలిగించాడు. మంచం మీద కమలిని లేదు. నిశ్చేష్టుడైపోయినాడు. చేతినుంచి అగ్గిపుల్ల రాలింది. గదినీ, అతని మనస్సునూ చీకటి కమ్మింది. వెఱ్ఱి శంకలూ, అంతకు వెఱ్ఱి సమాధానాలూ మనసున పుట్టుతూ గిట్టుతూ వ్యాకులత కలగజేశాయి. బుద్ధి తక్కువ పని చేసినందుకు తనయందో, కానరామికి కమలినియందో యేర్పరింపరాని కోపావేశం కలిగింది. నట్టి వాకిట వచ్చి నిలబడ్డాడు. చుక్కల కాంతిని  నౌకరుగానీ, దాసీగానీ కానరాలేదు.

తిరిగి గదిలోకి పోయి దీపం వెలిగించి, గది నలుముఖాలా పరికించి చూశాడు. కమలిని ఎక్కడా కానరాలేదు. వీధి గుమ్మం దగ్గిరికి వెళ్ళి తలుపు తెరిచి చూసేసరికి, వీధి నడుమ చుట్ట కాలుస్తూ తల ఎత్తి ఆకాశం మీది చుక్కల్ని చూస్తూ రావుడు కనపడ్డాడు! 'రామా!' అని గోపాల్రావు పిలిచాడు. రావుడి గుండె జల్లుమంది. నోట్లో చుట్ట జారి కిందపడ్డది.

'రా వెధవా!'

కాలీడ్చుకుంటూ రావుడు దగ్గర కొచ్చాడు.

'మీ అమ్మేదిరా?"

'మా యమ్మా బాబూ? మా కొంపలున్నాది'

'నీ అమ్మకాదురా! బుద్ధిహీనుడా! నా భార్యరా'

ఆ మాటతో రావుడికి మతిపోయింది. ఆలోచించుకుని అన్నాడు.

'ఎక్కడుంటారు బాబూ? అమ్మగోరు గదిలో తొంగున్నారు బాబూ!'

'యింట్లో ఎక్కడా లేదురా, వెధవ! యిల్లు విడిచి నువ్వెక్కడికి పోయినావురా?"



**'అయ్యా!'**
**'ప్రియుడా!' పోయి 'అయ్యా' కాడికి వొచ్చిందా?"**
**'పెయ్యపోయిందా బాబూ?"**
**'మూర్ఖుడా! వూరుకో!**

రావుడు మొహం ఓరజేసుకుని 'నౌఖరోడికి కాల్నొస్తుంది, కడుపు నొస్తుంది, బాబూ. పెద్దయ్యోరు మరీ మరీ అప్పసెప్పి ఎల్లినారు గందా, అమ్మగారి నొక్కర్నీ ఒగ్గేసి నిసి రాత్రేళ సానమ్మగారి–'

రావుడి వీపుమీద రెండు వీశ గుద్దులు పడ్డాయి.

'సంపేసినారు బాబూ' అని రావుడు నేల కూలబడ్డాడు.

గోపాలరావు దయగలవాడు. వెంటనే కోపం దిగజారి, పశ్చాత్తాపం కలిగింది. రాముడ్ని చేత లేవనెత్తి, వీపు నిమిరి,"కోపం పట్టలేక పశువువలె ఆచరిస్తిని' అనుకుంటూ గదిలోకి తీసుకువెళ్ళాడు.

కుర్చీమీద తాను కూచుని 'రామా ఏమాయెరా!' యని దైన్యంతోటి అన్నాడు.

రావుడు యీ తట్టూ, ఆ తట్టూ చూసి.

'ఏటో మాయలా వుంది, బాబూ' అన్నాడు.

'పుట్టింటిగ్గానీ వెళ్ళి వుండునా?"

'అంతోరు కారనా, బాబూ? కోపగించితే నెప్పజాల్నుగానీ, ఆడోరు సదువుకుంటే, ఏటౌతది బాబూ?"

'విద్య విలువ నీకేం తెలుసురా రామా!' అని గోపాలరావు మోచేతులు బల్లపైన ఆన్చి ఆ నడుమ శిరస్సువుంచి తలపోస్తూ వున్నంతలో ముద్దులొలికే కమలిని చేవ్రాలున వుత్తరవొకటి బల్లమీద కనపడ్డది. పైకి చదివాడు;

'అయ్యా!'

'ప్రియుడా!' పోయి 'అయ్యా' కాడికి వొచ్చిందా?"

'పెయ్యపోయిందా బాబూ?"

'మూర్ఖుడా! వూరుకో!'

'అయ్యా! పది దినములాయె రాత్రులనింటికి మీ రాకయే నేనెరుగను. మీటింగులకు బోవుచుంటిమంటిరి. లోకోపకారమునకై నుద్యమముల నిదురమాని చేయుచుంటి మంటిరి. మా చెలుల వలన నిజము నేర్చితిని. నేనింట నుండుటను గదా మీరు కల్లలు

పలుకవలసి వచ్చెను. నేను పుట్టింటనున్న మీ స్వేచ్ఛకు నిర్బంధమును, అసత్యమునకు అవకాశము కలుగకుండును. మీచే దినదినమును అసత్యమాడించుట కన్న మీ త్రోవకు అడ్డుగ నుండకుండుటయే, పతి మేలుకోరిన సతికి కర్తవ్యము కాదా? నేనీ రేయి కన్నవారింటికి జనియెద. సంతసింపుడు. వెచ్చముగాక ఏపాటి మిగిలియున్న దయనుంచుడు'

'ఉత్తరం ముగించి 'నేను పశువును' అని గోపాల్రావు అనుకున్నాడు.

'అదేమిటి బాబూ, అలా శలవిస్తారు?"

'శుద్ధ పశువును'

రావుడు అతిప్రయత్నంచే నవ్వు ఆపుకొనెను.

'గుణవతి, విద్యానిధి, వినయ సంపన్నురాలు, నా చెడుబుద్ధికి తగిన శాస్తి చేసింది'

'అమ్మగారేటి సేసినారు బాబూ!'

"పుట్టింటికి వెళ్ళిపోయింది – గాని, నీకు తెలియకుండా ఎలా వెళ్ళిందిరా?"

రావుడు రెండడుగులు వెనక్కివేసి, "నాను తొంగున్నాను కావాల బాబు! అలిగితే సెప్పసాల్నుగాని బాబు, ఆడదాయి సెప్పకుండా పుట్టినోరింటికి ఎల్తానంటే లెంపలోయించి కూకోబెట్టాలిగాని మొగోర్లాగా రాతలూ, కోతలూ మప్పితే ఉడ్డోరం పుట్టదా, బాబూ?"

'ఓరి మూర్ఖుడా! భగవంతుడికి సృష్టిలోకల్లా ఉత్కృష్టమయిన వస్తువు విద్యనేర్చిన స్త్రీ రత్నమే. శివుడు పార్వతికి సగం దేహం పంచి ఇచ్చాడు కాదా. ఇంగ్లీషువాడు భార్యను 'బెటర్ హాఫ్' అంటాడు. అనగా పెళ్ళాం మొగుడికన్న దొడ్డది అన్నమాట. బోధపడ్డదా?"

"నాకే బోదకాదు బాబూ?" రావుడికి నవ్వు ఆచుకోవడం అసాధ్యం కావచ్చింది.

'నీ కూతుర్ని బడికి పంపిస్తున్నాం కదా, విద్య యొక్క విలువ నీకే బోధపడుతుంది. మీ వాళ్ళ కంటే అప్పుడే దానికి ఎంత నాగరికత వొచ్చిందో చూడు. ఆ మాట అలా వుణ్ణియ్యి గాని, యిప్పుడు నువ్వో, నేనో వెంటనే బయల్దేరి చెంద్రవరం వెళ్ళాలి? నే వెళ్డానికి శెలవు దొరకదు. నువ్వు తాతలనాటి నౌఖరివి. నీమీద కమలినికి యిష్టం. గనక నువ్వే వెళ్ళడం మంచిది. వెళ్ళి కమలిని పిలుచుకురా'

'శలవైతే యెల్నా, యెలతాను. ఆర్రానంటే–'

'యిందు పదిరూపాయలు. బతిమాలి తీసుకొస్తివట్టాయనా, మరి పది రూపాయలిస్తాను.'

'సిత్తం'

'అయితే, యేవిటి చెప్పాలో తెలుసునా?"

'యేటా, బాబూ? సెప్పకుండా లేసి రావడం మా మంచి పని సేసినారమ్మా. బాబు నా యీపు పగలేసినారు. రండి రండమ్మా అని సెప్తాను'

'నన్ను క్షమించి దెబ్బల మాట మరిచిపో. కమలినితో ఎన్నడూ దెబ్బల మాట చెప్పబోకు. ఈ మాట జ్ఞాపకం వుంచుకుంటావు గదా?"

'సిత్తం'

'నువ్వు కమలినితో చెప్పవలసిన మాటలేవో, చెబుతాను బాగా చెవొగ్గి విను. పంతులికి బుద్ధి వొచ్చిందను...'

'అదేటి బాబు!'

'నీకెందుకు? నే అన్నమాట గట్టిగా జ్ఞాపకం వుంచుకుని చెప్పు. పంతులికి బుద్ధి వొచ్చింది అను. మరి ఎన్నడూ సానుల పాట వినరు. గట్టివొట్టు వేసుకున్నారు. (మరచి పోయి అన్నాను; ఆ మాట అనకు) యిటుపైని ఎన్నడూ, రాత్రిళ్ళు యిల్లు కదలరు. ఇది ఖరారు. తెసిందా?"

రావుడు తల వూపాడు.

'ఇంకా ఏవిటంటే, గెడ్డం పట్టుకుని బతిమాలుకున్నానని చెప్పమన్నారు. దయదల్చి పంతుల లోపాలు బయట పెట్టొద్దన్నారు. (ఇది ముఖ్యమైన మాట. విన్నావా?) రెండు మూడు రోజుల్లో తప్పకుండా వెళ్ళిపోయి రమ్మన్నారు. మీరు దగ్గర లేకపోవడంచేత వెఱ్ఱెత్తినట్టున్నారు. గడియో యేడు లాగ గడుపుతున్నారు. (యీ మాట మరవగలవు జాగర్త) యేం చెప్పాలో తెలిసింది గదా? ఒక్కమాటైనా మరచిపోకు'

'తెలిసింది బాబూ'

'యేం చెబుతావో నాకోమాటు చెప్ప'

రావుడు తల గోక్కుంటూ, "యేటా – యేటా – అదంత నాకేం తెల్దు బాబూ. నేనంతాను... అమ్మా నామాటినుకోండి. కాలం గడిపినోణ్ణి – పిన్నల్ని సూసినాను. పెద్దల్ని సూసినాను యిన్నారా? ఆడోరు యజమాని సెప్పినట్టల్లా యిని వల్లకుండాలి. లేకుంటే, పెద్ద పంతులార్లాగ, సిన్న పంతులోరు కూడా సెడిపోతారు. మీ శెవుల్లో మాట. పట్టంలోకి బంగారం బొమ్మలాంటి సానమ్మవొచ్చింది. ఆ సానెమ్మోర్ని సూసినకాణ్ణుంచీ పంతులు మనసు, మనసులా లేదు. నా మాటిని రండి. లేకుంటే మీ సిత్తం, అంతాను'

'ఓరి వెధవా!' అని గోపాలుడు కోపంతో కుర్చీమీంచి వురికాడు.

తప్పించుకుని రావుడు వూసలాగ గదిపైకి దాటాడు.

అంతలో మంచం కింద నుంచి అమృతం వొలికే కలకల నవ్వూ, మనోహరియైన నూపురముల రొద విననయ్యెను. ●



# తాతగారి జ్ఞాపకాలు



**రవీంద్రుడు గురజాడ**
అధ్యక్షులు, గురజాడ
ఫౌండేషన్, భారత శాఖ

తెలుగు భాషాసాహిత్యరంగాల్లో అత్యాధునిక అభ్యుదయ మార్గాన్ని చూపించిన మహామనీషి గురజాడ వేంకట అప్పారావుగారు. ఆలోచనాధోరణిలో అత్యంత ఆధునికుడు. విజయనగరం మహారాజావారి ఆస్థానంలో ఉంటూ వారి అండదండలతో భాషకు అక్షరార్చన చేశారు. ఆనాటి సామాజిక పరిస్థితులను, ముఖ్యంగా ఆడపిల్లల విక్రయం, వయసు మీరినవారితో వివాహాలను ఎండకడుతూ రాసిన 'కన్యాశుల్కం' నాటకం తెలుగు నాటకరంగంలోనే తలమానికం లాంటిది. కన్యాశుల్కం ఆచారం అంతరించి దశాబ్దాలు దాటినా ఆ నాటకంకాని, దాని ప్రదర్శన కానీ పాతబడలేదు. అందుకే ఆయన రచనలను కాలతీతంగా చెప్పవచ్చు.

వ్యవహార భాషా పితామహుడుగా వినుతికెక్కిన గిడుగు రామమూర్తి పంతులు గారితో కలసి వాడుకభాష ఉద్యమాన్ని సాగించి విశ్వవిద్యాలయాల పాఠ్యాంశాల్లో మార్పునకు పోరాడారు. ఎంతోమంది ఆయనని ఆదర్శంగా తీసుకుని ఏకలవ్య శిష్యులుగా మారారు. అప్పారావుగారి పుత్రుడు శ్రీ వెంకటరామదాసు కాగా మనవడు వేంకట శ్యామలరావుగారు. వారి పుత్రుడిని నేను. మహాకవిలాంటి ఉన్నత వ్యక్తి పుట్టిన మహా వంశవృక్షంలో నేనూ ఒక శాఖను కావడాన్ని అదృష్టంగా భావిస్తున్నాను.



మా కుటుంబాలలో మహాకవిని ఎల్లప్పుడూ అప్యాయంగా 'గురజాడ తాతగారు' అనే స్మరించుకుంటాం. నేను విజయనగరం లోని గురజాడ తాతగారి ఇంట్లోనే పుట్టి పెరిగాను. ముత్తాత గారి గురించి, వారు సాధించిన విజయాల గురించి మా తాతయ్య వెంకట రామదాసు గారి ద్వారా వినేవాడిని.

మా తాతగారు చెప్పిన దానిని బట్టి, మా ముత్తాత అప్పారావు గారు. క్రమశిక్షణ కలిగిన వ్యక్తి. ఆయన ప్రతిరోజు తెల్లవారు

జాము నాలుగు గంటలకు నిద్రలేచి ప్రాత:కాల విధులు, స్నానాదులు ముగించుకొని నుదిటిపై కుంకుమ ధరించి సంధ్యావందనం, చక్రధ్యానం చేసేవారు. కాఫీ సేవించిన తరువాత ఉదయం 7.00 గంటల వరకు తన రచనా వ్యాసంగాలను కొనసాగించేవారు. కవితలు, `ప్రకాశిక` పత్రికకు సంబంధించిన పనులు, ఉత్తరప్రత్యుత్తరాలు సాగించేవారు. భోజనానంతరం మహారాజా వారి కోటకి వెళ్ళి ఆస్థానంలోని కార్యకలాపాల్లో నిమగ్నమైపోయేవారు. మహారాజా వారు రాత్రి భోజనం ముగించి తమ విశ్రాంతి మందిరానికి వెళ్ళిన తరువాతగాని తిరిగి ఇంటికి చేరేవారు కాదు. ఇది ఆయన దినచర్య. ఆరోగ్యకరమైన జీవితం కోసం పాటించవలసిన నియమాలను, తీసుకోవలసిన ఆహారం గురించి ఒక పుస్తకం రాయాలనుకున్నారట. గురజాడ తాత గారు. ఆయన విజయనగరం మహారాజావారి కుటుంబ సేవకు జీవితాన్ని అంకితం చేశారు. సంస్థానానికి సంబంధించిన చట్టపరమైన కార్యకలాపాలపై దృష్టిసారించి, న్యాయపోరాటంలో గెలిచి మహారాజా వారికి తలతో నాలుకలా అంకితభావంతో జీవితాంతం సేవలందించారు.

గురజాడ తాతగారు తమ ఇంటి మేడపై గల ప్రధాన గదిలో పడుకునేవారు. మంచాన్ని గది ప్రవేశద్వారం ఎదురుగా ఉన్న గోడ దగ్గర తూర్పు, పడమర వైపు ఉంచేవారు. తద్వార రాత్రిపూట తన ఆలోచనలను పెన్సిల్తో గోడపై వ్రాయగలిగేవారు. కొన్నిసార్లు, చేతులు, కాళ్ళ నొప్పుల కారణంగా రాత్రిళ్లు నిద్ర కరవయ్యేది. ఒక సహాయకుడు వారి పాదాలకు మసాజ్ చేసేవాడు. గురజాడ వారికి మనవరాలు బుచ్చి కొండాయమ్మ అంటే చాలా ఇష్టం. ఆమె చాలా చురుకైనది,తెలివైనది. తెల్లని మేనిఛాయ కలిగి ఉండేది. ఆయన ఆమెను మనవరాలిగా కంటే స్నేహితురాలిగానే ఎక్కువగా పరిగణించేవారు. సాయంత్రం వేళల్లో సభలు, సమావేశాలకు ఆమెను వెంట తీసుకుని వెళ్ళేవారు. కొన్నిసార్లు ఆ సభలు మా ఇంట్లోనే ఏర్పాటయ్యేవి. ఆయన వివిధ ప్రాంతాలకు చెందిన పలువురితో సంభాషించే వారు. ప్రపంచ శాంతి, తెలుగు సాహిత్యం, సామాజిక సంస్కరణల గురించి ఎక్కువగా ఆలోచించేవారు. గురజాడ తాతగారు ప్రకృతి, పరిసరాలపట్ల గొప్ప పరిశీలనతో ఉండేవారు. తెలుగు సాహిత్యం, సామాజిక సంస్కరణల గురించి మాట్లాడడానికి, బోధించడానికి సదా సంసిద్ధులై ఉండేవారు.

సమాజ హితం కోసం, సాహిత్యం కోసం ఏదో చేయాలన్న తపనతో అప్పారావు గారు తనను తాను మరచి ఎంతటి ఆలోచన చేసేవారు అనడానికి ఓ ఉదాహరణను చెప్పుకోవాలి. మెట్రిక్యులేషన్ విద్యలో తాతగారు కనబరచిన విశిష్ట ప్రతిభ ప్రిన్సిపాలు గారిని ఎంతగానో ఆకట్టుకొంది. ఉన్నతవిద్యను అభ్యసించడానికి తన ఇంట్లో ఉండమని తాతగారిని ప్రిన్సిపాలుగారు ఆహ్వానించారు. ఒకరోజు గురజాడ తాతగారు ఏదో ఆలోచనలోపడి కాలేజీకి ఆలస్యంగా వెళ్ళారు. అది ఆయన కాలేజికి బయలుదేరేముందు, భోజనం చేస్తున్నప్పుడే గ్రహించారు. ఆరోజు మొదటి ఉపన్యాసం ప్రిన్సిపాలు గారిది అని ఆయన గుర్తుచేసుకున్నారు. తాతగారు వెంటనే సగం పూర్తయిన భోజనం నుండి లేచి కండువాని ధరించడం మర్చిపోయి కళాశాల వైపు పరుగెత్తారు. శాస్త్రిగారు గురజాడ తాతగారిని

చూసి, కండువా లేకుండా తరగతి ముందు నిలబడి ఉన్నట్లు గమనించారు. ఆ పరిస్థితిలో తాతగారిని చూసి అవాక్కయిన ప్రిన్సిపాల్ గారు తన ఉపన్యాసాన్ని ఆపి, తన కండువాని తాతగారికి ఇచ్చి, తాతగారిని తరగతిలోనికి అనుమతించిన తరువాత వారి ఉపన్యాసాన్ని కొనసాగించారు.

గురజాడకి చెందిన చారిత్రాత్మక విలువ గల వస్తువులెన్నిటినో మనం కోల్పోయాం. దురదృష్టవశాత్తు గురజాడ తాతగారి మరణం తరువాత వారి ఇల్లు చాలాసార్లు దొంగలబారిన పడింది. ఆయన ఉంగరం, వాయిస్ రికార్డర్, ఫోటోలు, డైరీలు, `ప్రకాశిక` పత్రిక ప్రతులు, విడిగా ఉన్న కాగితాలు గల చెక్క పెట్టె సహా చోరీ అయ్యాయి. ముత్తాతగారి ఇంటిని ప్రభుత్వానికి అప్పగించిన వేళ తాత రామదాసుగారు ఎంతో గర్వించారు. `దేశమును ప్రేమించుమన్నా, మంచియన్నది పెంచుమన్నా... వట్టి మాటలు కట్టిపెట్టోయ్, గట్టిమేల్ తలపెట్టవోయ్' అని గొప్ప దార్శనికతతో చెప్పిన మాటలను భావితరాలవారు ఈ గృహాన్ని సందర్శించినపుడు తలచుకుని గర్వపడుదురు గాక` అని మా తాతయ్య రామదాసుగారు అన్న మాటలు ఇంకా గుర్తున్నాయి. `గురజాడ సంస్థ` (అమెరికా), ఇతర శాఖలు అనుసరిస్తున్న సూత్రం ఇదే. గురజాడ వారి తత్వాన్ని విశ్వవ్యాపితం చేసేందుకు, ప్రపంచ శాంతి గురించి ఆయన కలలను సాకారం చేసేందుకు ఈ సంస్థ ప్రయత్నిస్తోంది. `గురజాడ ఫౌండేషన్`(అమెరికా) కమిటీ సభ్యులు, వాలంటీర్లు ఇప్పటివరకు చేపట్టిన కార్యక్రమాలు ఆరంభం మాత్రమే.

**అప్పారావుగారి మునిమనుమరాలు అరుణ గురజాడ, ఆమె భర్త డాక్టర్ కొవ్వలి గోపాలకృష్ణ టెక్సాస్ లోని షుగర్ ల్యాండ్‌లో యుఎస్ఏ గురజాడ ఫౌండేషన్ స్థాపించడం (2014) చాలా సంతోషం కలగించింది. ఈ ఫౌండేషన్ వారిచే పునః ప్రారంభింపబడుతున్న 'ప్రకాశిక' ద్వారా గురజాడ స్ఫూర్తితో సాహిత్య, సమాజ సేవలను చేయాలనే సంకల్పం నెరవేరాలని ఆశిస్తున్నాను.**

మా కుమార్తె చి.సౌ. శిరీష పిండిప్రోలు, శ్రీమతి అరుణ గురజాడ, కొవ్వలి గోపాల కృష్ణ గార్ల కుమార్తె కుమారి చంద్రలేఖ,ఫౌండేషన్ యువ నాయకులుగా వ్యవహరిస్తూ 'గురజాడ స్ఫూర్తి విద్యార్థి' పురస్కారానికి ప్రాయోజితులుగా ఉన్నారు. వీరు గురజాడ వారి ఆశయాల్ని సాకారం చేసేందుకు మరింత కృషి చేస్తారని ఆశిస్తున్నాను.

అప్పారావుగారి మునిమనుమరాలు అరుణ గురజాడ, ఆమె భర్త డాక్టర్ కొవ్వలి గోపాలకృష్ణ టెక్సాస్ లోని షుగర్ ల్యాండ్‌లో యుఎస్ఏ గురజాడ ఫౌండేషన్ స్థాపించడం (2014)చాలాసంతోషంకలగించింది. ఈఫౌండేషన్‌వారిచేపునఃప్రారంభింపబడుతున్న 'ప్రకాశిక' ద్వారా గురజాడ స్ఫూర్తితో సాహిత్య, సమాజ సేవలను చేయాలనే సంకల్పం నెరవేరాలని ఆశిస్తున్నాను. ఈ పత్రిక గురజాడ తాత గారి ఆశీస్సులతో నిరంతరాయంగా, విజయవంతంగా నడుస్తుందని నాకు పూర్తి నమ్మకం ఉంది.

# కండగలిగిన కవిరాయడు



**మాశర్మ**
జర్నలిస్ట్, కాలమిస్ట్
**Ph: 93931 02305**

దేశమంటే మట్టి కాదోయ్ ! మనుషులోయ్ ! అన్నాడు గురజాడ. ఈ నాలుగు పదాలు చాలు గురజాడను మహాకవి, అనడానికి. ఇలా చాలా అన్నాడు. చాలా రాశాడు. కన్యాశుల్కం అనే సంప్రదాయం ఇప్పుడు లేకపోయినా, అది పోయి చాలా ఏళ్ళైనా, గురజాడ రాసిన 'కన్యాశుల్కం' నాటకం సజీవంగా ఇప్పటికీ తళుకులీనుతోంది. ఉత్తరాంధ్ర, విజయనగరం మాండలీకంలో ఈ రచన సాగినా, అన్ని మాండలీకాలవారు దీన్ని అర్థం చేసుకున్నారు. అర్థం చేసుకోవడమే కాదు, అక్కున చేర్చుకున్నారు, అక్కున చేర్చుకోవడమే కాదు, సాంఘిక నాటకాలలో అగ్రస్థానం ఇచ్చారు. ఇది కొత్తగా వచ్చిన సినిమా కాదు. ఎప్పుడో 65ఏళ్ళ క్రితం (1955) సినిమాగా వచ్చిన కథారాజం. వందలసార్లు వేదికలపై ప్రదర్శనలు జరుపుకున్న నవ్య నాటకరాజం. సమాజంలో ఇప్పటికీ గిరీశంలు అడుగడుగునా తగులుతారు. లుబ్ధావధానుల వంటి లుబ్ధులు మాటిమాటికీ ఎదురుపడుతుంటారు. అంతటి మధురవాణిలు దొరకక పోయినా.. ఆ వాణి, ఆ వాణిజ్యం తెలిసిన మధురవాణిలు తారసపడుతుంటారు. ఇంతటి నాటకీయ సృష్టి గురజాడకే చెల్లు. భారతీయ సాహిత్యంలో మృచ్ఛకటికం తర్వాత, అంతటి గొప్ప నాటకం కన్యాశుల్కం, అని మరో మహాకవి శ్రీశ్రీ కితాబు ఇచ్చాడు. శ్రీశ్రీ దృష్టిలో ఆధునిక యుగంలో గురజాడ ఒక్కడే మహాకవి. బహుశా! గురజాడ సాహిత్యంలో శ్రీశ్రీ ధ్వనిదర్శనం చేసుకొని ఉంటాడు. ఎవడి పలుకులో, కవిత్వంలో ధ్వని ఉందో? వాడే మహాకవి అన్నాడు శ్రీశ్రీ. ధ్వని సిద్ధాంతాన్ని పుష్కలంగా పండించినవాడు తిక్కన మహాకవి, అని శ్రీశ్రీ సిద్ధాంతీకరించాడు. ధ్వనితత్త్వం గురజాడలో కూడా ఆయనకు కనిపించి ఉంటుంది. అందుకే ఆయన్నూ మహాకవిగా అభివర్ణించాడు. 1915లో గురజాడ చనిపోయాడు. గురజాడ చనిపోలేదు,అప్పటి నుండే జీవించడం ప్రారంభించాడని ఇంకో మహాకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి అన్నాడు. ప్రజల భాషలో రాయాలి, కవిత్వం చెప్పాలి, సాహిత్య సృష్టి జరగాలి, అని బలంగా నమ్మి, అంతకంటే బలంగా ఆచరణలో పెట్టినవాడు గురజాడ. గురజాడకు తోడునీడగా గిడుగు కూడా నిల్చున్నాడు. వీరిద్దరూ ఒకప్పుడు సహాధ్యాయులు, సమభావాలు ఉన్నవారు. వీరిద్దరూ కలిసి ఆధునిక భాషను అద్భుతంగా నడిపించారు. ఇప్పుడు మనం చదివే, రాసే భాషంతా వీరి చలువే. మాటను శక్తిమంతంగా, అందంగా చెప్పడం బాగా తెలిసిన ఆధునిక మహాకవులకు అడుగుజాడగా నడిచినవాడు గురజాడ. ఆయనేమీ 150 ఏళ్ళు జీవించలేదు. 53 ఏళ్లకే వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయి కూడా 100 ఏళ్ళు దాటింది (1915), అయినా, ఆయన్ను తలచుకుంటున్నాం, కొలుచుకుంటున్నాం.



గురజాడ ఎవరికీ చుట్టం కాదు. అతను చేసిన భాషాసేవ మనల్నందరినీ అతని చుట్టూ తిప్పుకుంటోంది. 'ఎవడు బతికాడు నూట యాభై ఏళ్ళు' అని ఉత్తరాంధ్రలో ఒక సామెత వుంది. కానీ, గురజాడ బతికాడు, శ్రీశ్రీ బతికాడు. ఉత్తరాంధ్రలోనే కాదు, మన మాటల్లో, రాతల్లో యావత్తు తెలుగు సాహిత్యలోకంలో, భాషా సామాజిక ప్రాంతాల్లో అక్షరాలా జీవించి వున్నారు. వుంటారు. తిండి కలిగితే కండ కలదోయ్: కండకలవాడే మనిషోయ్ అనే మాటలు... మనం నిత్యం చదివే వార్తాపత్రికల్లో వస్తూనే ఉంటాయి. ఇలాంటి పదబంధాలు మనల్ని ఎన్నటికీ వీడవు. ఇవి వీడి పత్రికలు ముందుకు సాగలేవు. ఇంతలా అక్షరాల్లో చొచ్చుకుపోయినవారు ఒకరు శ్రీశ్రీ, ఇంకొకరు గురజాడ. అప్పటి సామాజిక దురాచారాలను కథావస్తువులుగా తీసుకొని, జనంభాషలో రాసి జేజేలు కొట్టించుకున్న జగజ్జెట్టి గురజాడ. తను రాసిన 'పుత్తడి బొమ్మా పూర్ణమ్మా' గేయంలో పండించిన కవిత్వం గుండెనిండా కన్నీళ్లు నింపుతాయి. కన్నుల కాంతులు కలువల చేరెను... మేలిమి చేరెను మేని పసల్... హంసల చేరెను నడకల బెడగులు..దుర్గను చేరెను పూర్ణమ్మా.. అన్నాడు. ఈ పంక్తులు చాలు ఇతనిలోని కవిత్వాన్ని కొలవడానికి. కవిత్వమొక ఆల్కెమీ అయితే, ఆ రహస్యం గురజాడకు కూడా తెలుసు. తెలియకపోతే, ఇనుము వంటి పదాలను బంగారంగా మార్చే కవిత్వ శక్తి ఎక్కడ నుండి వస్తుంది? ఆ పదాలు పట్టుకొని రాయివంటి కసాయిలతోనూ కన్నీళ్లు ఎలా పెట్టిస్తాడు? నవ్వుల పువ్వులు ఎలా పూయిస్తాడు? ఆలోచనామృతాలు ఎలా కురిపిస్తాడు? కృష్ణాతీరంలోని గురజాడ నుండి ఉత్తరాంధ్రలోని విజయనగరంకు వలస వెళ్లిన ఈ కుటుంబం గురజాడ, అనే గొప్ప కానుకను తెలుగు భాషకు ఇచ్చింది. అద్భుతమైన నాటకీయత, పరమ రమణీయమైన పదసంపద, కల్పనా శక్తి, వర్ణనా నిపుణత కలిగిన కవి విలుకాడు గురజాడ. కండపుష్టి కలిగిన కవిత్వం రాశాడు. షేక్స్పియర్, మిల్టన్ కు ఏమాత్రం తక్కువకాని ఆధునిక కవిరాయడు మన అప్పరాయడు (అప్పారావు). రాజు, రాయ శబ్దాల నుండే రావు అనే శబ్దం కూడా వచ్చింది. 'రావు' మన పదం కాదు, మరాఠీ నుండి మనం తెచ్చుకున్నది. అలా, అప్పరాయడు అప్పారావు అయ్యాడు. ప్రారంభంలో, గురజాడ ఇంగ్లీష్ లో కవిత్వం రాయడం మొదలు పెట్టాడు. సొంత భాషలో రాస్తే, ఇంకా శక్తిమంతంగా ఉంటుందని శంభుచంద్ర ముఖర్జీ వంటి కొందరు పెద్దలు గురజాడకు సూచించారు. అప్పటి నుండీ అప్పారావు అమ్మభాషలో, వాడుకభాషలో రాయడం మొదలు పెట్టి మనకు వేడుక చేశాడు. ఎప్పటికీ, మన గుండెల్లో గురజాడ అప్పారావు సందడి చేస్తూనే ఉంటాడు. దేశమును ప్రేమించుమన్నా... అన్నాడు. దేశంతో పాటు భాషను కూడా ప్రేమిద్దాం. సెప్టెంబర్ 21 వ తేదీ ఈ మహనీయుడి పుట్టిన పుణ్యదినం.

*★ ఆంధ్రపత్రిక – సంపాదకీయం (21-9-2020)*

# గురజాడ ఆలోచనా విధానం..
# నేటి చారిత్రక అవసరం



అప్పరసు కృష్ణా రావు
Ph: 98102 23863

ప్రజల జీవితాలను సజీవంగా, సృజనాత్మకంగా చిత్రించడమే కాదు, ఆ జీవితాలను మార్చడం కోసం వారిని చైతన్యపరచడమే లక్ష్యంగా రచనలు చేసే వారిని ఆ కాలంతో పయనించే రచయితలుగా మాత్రమే కాక రాబోయే కాలానికి ప్రతినిధులుగా కూడా పరిగణిస్తారు. వారు చేసే రచనలు ఎప్పుడు చదివినా వాటికి సార్వజనీనత ఉంటుంది. ఏ తరం వారు చదివినా ఆ తరం ఆలోచనలకు పదునుపెట్టేవిగా ఉంటుంది. గురజాడ అప్పారావు రచనలు చదివితే ఆయన ఆలోచనా విధానం ఎప్పటికప్పుడు ఒక చారిత్రక అవసరంగా ప్రతిఫలిస్తుంటుందనడంలో సందేహం లేదు. తన కాలంతో పాటు పయనించి, తన కాలానికి కొన్ని ఏళ్లకు ముందుగానే యోచించిన గురజాడను నిత్య ఆధునికుడు అనడానికి ఏ మాత్రం సందేహించనక్కర్లేదు.

సమాజంలో కుళ్లిపోతున్న వ్యవస్థలు, వ్యవస్థల అండతో పెరుగుతున్న దుర్మార్గాలు, నియంతృత్వ పోకడలు, మూఢనమ్మకాలు, దురాచారాలు, బూటకపు దేశభక్తి, మతతత్వం ప్రబలిపోవడం, మారుతున్న కాలానికి అనుగుణంగా భాష, విద్యా విధానం మారకపోవడం అనుభవంలోకి వచ్చినప్పుడల్లా గురజాడ అప్పారావు గుర్తుకురావడంతోనే ఆయన ఆలోచనల సమకాలీనత అర్థమవుతుంది. ఆయన చేసిన రచనల్లో దాదాపు అన్నిటిలో నేటి సమాజానికి అన్వయించగల అనేక అద్భుత పరిశీలనలు, వ్యాఖ్యానాలు చదివినప్పుడు గురజాడ విలువేమిటో మనకు తెలియక తప్పదు.

ఒకరకంగా గురజాడ తన కాలానికి ఎదురీదారు. భాషా సాహిత్యాల విషయంలో మార్పుకోసం ఒక ఘర్షణే చేయవలసి వచ్చింది. ఉదాహరణకు ఇవాళ మనం పాఠ్యగ్రంథాలను వ్యావహారిక భాషలో చదువుతున్నాం. కాని ఆనాడు ఆయన అందుకోసం పోరాడవలిసి వచ్చింది. 'నేటి విద్యావిధానంలో వచన వాఙ్మయానికి గల అవసరం తీర్చడానికి వాడుకభాషే ప్రయోగార్హం' అని ఆయన స్పష్టం చేశారు. గ్రాంథిక వాదులు పోటీగా ఏర్పర్చిన ఆంధ్ర సాహిత్య పరిషత్ సభల్లో ఒంటరిగా పాల్గొని తన వాదన ద్వారా వారిని ఒప్పించే ప్రయత్నం చేశారు. కాని లాభం లేకుండా పోయింది. 'మార్పుకు వారు బద్ధవిరోధులు, పురోగతికి అవరోధులు' అని ప్రకటించారు. 'సంకెళ్లు ప్రేమించే వాళ్లు గ్రాంథిక భాషను ఆరాధిస్తారు కాని నా మటుకు నా మాతృభాష సజీవమైన తెలుగు. ఇటాలియన్ ఆఫ్ ద ఈస్ట్ అనిపించుకున్న ఈ తెలుగులో మన సుఖాల్ని, మన దుఃఖాల్ని వెల్లడించుకోవడానికి మనం ఎవరమూ సిగ్గుపడనవసరంలేదు..' అన్నాడు.



సాహిత్య ప్రయోజనం గురించి నేటి ఆధునికుల్లో ఎందరికంటేనో ముందుగా స్పష్టీకరించిన రచయిత గురజాడ. 'దురాగతాలను బహిర్గతం చేస్తూ ఉన్నత నైతిక భావాలను వ్యాప్తి చేయడం కంటే మిన్న అయిన లక్ష్యమూ, ప్రయోజనమూ సాహిత్యానికి లేదు..' అని కన్యాశుల్కం తొలి కూర్పు పీఠికలో వివరించారు.

కన్యాశుల్కం అనే దురాచారం నేడు లేకపోయినప్పటికీ ఆ నాటకం విలువ ఇంకా ఉన్నదని చెప్పడానికి ప్రధాన కారణం వివాహ వ్యవస్థలో స్త్రీలకు తమ నిర్ణయాధికారం ఇంకా రాలేదు. స్త్రీలపట్ల అన్యాయాలు ఇంకా కొనసాగుతున్నాయి. కన్యాశుల్కం నాటకంలో అభివర్ణించిన అవకాశవాదులు, అమాయకులు, అమాయకుల్ని మోసం చేసే వాళ్లు ఇంకా ఉన్నారు. మూఢనమ్మకాలింకా ఉన్నాయి. ప్రజల్ని మోసం చేసే సాధువులు ఇప్పటికీ ఉన్నారు. దుర్మార్గమైన పోలీసు, న్యాయవ్యవస్థలు ఇంకా ఉన్నాయి. గురజాడ తీసుకున్న అనేక సమస్యలు ఇప్పుడు విత్తనం నుంచి చెట్టులాగా మారి శాఖోపశాఖలుగా విస్తరించాయి. ఆకలి మూఢవిశ్వాసాలను సృష్టించగలదు, రూపుమాపగలదు. ఆకలి ఏ కూడైనా తినిపించగలదు. అన్న భయంకర సత్యం గురజాడ కన్యాశుల్కంలో ఒక పాత్ర ద్వారా వ్యక్తీకరిస్తారు. ఒక కుళ్లిపోయిన, అవినీతితో నిండిన సమాజాన్ని మన కళ్లముందుంచేందుకు కన్యాశుల్కం అనే అంశాన్ని ఆయన అత్యంత సమర్థవంతంగా ఉపయోగించుకున్నారు. పెద్దమనుషులుగా, విద్యావంతులుగా నటిస్తూ, ఆచరణకూ, ఆదర్శాలకూ పొంతనలేని వ్యక్తుల్ని చీల్చి చెండాడారు.

బ్రిటిష్ పాలకులు మన రాజకీయ ఆర్థిక వ్యవస్థలో ప్రవేశపెట్టిన మార్పులు సమూలమైనవి కావు. పాత వ్యవస్థను అలాగే కొనసాగిస్తూనే కొత్తగా తీసుకువచ్చిన మార్పులు అవి. తమకు అవసరమైన చోట్ల రోడ్లను కొత్తగా వేసుకోవడం, అవసరమైన ఆర్థిక, సామాజిక సంస్కరణలే చేయడం, తమకు అవసరమైన చోట్ల పాతవిలువలను, సంప్రదాయాలను కొనసాగనివ్వడం, అవసరమైన చోట్ల రాచరికాన్ని సమర్థించడం, అవసరమైన చోట్ల మాత్రమే ప్రజాస్వామ్యాన్ని, తిరుగుబాట్లను సమర్థించడం జరిగాయి. ఈ ప్రక్రియ ఇప్పటికీ కొనసాగుతోంది. అధునాతన సమాజానికి మద్దతునిచ్చే అధిపతులే యజ్ఞాలను, యాగాలను, మూఢనమ్మకాలను, బాబాలను, వారి శిష్యురాళ్లను పెంచిపోషిస్తారు. ఒకవైపు ఐటి విప్లవం గురించి మాట్లాడుతూనే మరో వైపు కుల వ్యవస్థను, మత రాజకీయాలను, విద్వేషాలను సమర్థిస్తారు. పాలక వ్యవస్థలో పోలీసులు, న్యాయవ్యవస్థ, రాజకీయ, అధికార యంత్రాంగం, మతం, మూఢనమ్మకాలు, భూస్వామ్యం, వ్యభిచారం, అవినీతి, అణిచివేత, విద్యావ్యవస్థలో లోపాలు మిలాఖతయి కనపడతాయి. ప్రశ్నించడాన్ని సమర్థిస్తూనే ప్రశ్నించినవాడిని అణిచివేసే సంస్కృతి ఇది. కన్యాశుల్కంలో వీటన్నిటిపైనా ప్రశ్నలు మనకు కనపడతాయి కనుకే ఇది నిత్య ఆధునిక

నాటకంగా అనిపిస్తుంది.

పాత విద్యావిధానం నేటికాలానికి ఎందుకు పనికిరాదో వివరిస్తూనే, మిడిమిడి జ్ఞానపు చదువుల ద్వారా ప్రయోజనం ఉండదనే విషయాన్ని గిరీశం, వెంకటేశం ద్వారా వివరించి విద్యావిధానం గురించి కొత్తగా ఆలోచించాల్సిన ఆవశ్యకతను గురజాడ వెల్లడిస్తారు. బ్రిటిష్ వాడు తీసుకువచ్చిన న్యాయవ్యవస్థ ప్రజలకు ఉపయోగపడే వ్యవస్థకాదని చెప్పడం ద్వారా న్యాయవ్యవస్థను ఆయన ప్రశ్నిస్తారు. డిప్టీ కలెక్టర్ కచేరీ నుంచి సారాయి దుకాణం వెనుక ఉన్న తోట వరకు జరిగిన సంభాషణల్లో ఎవరికీ కోర్టుల మీద విశ్వాసం ఉండదని అర్థం అవుతుంది. లంచం తీసుకుని హత్య కేసును కొట్టి వేసిన మునసబు, స్వప్రయోజనాలు ఆశించి చెప్పే దొంగ సాక్ష్యాల ద్వారా అబద్ధపు వ్యవస్థమీదనే న్యాయవ్యవస్థ నడుస్తుందన్న అభిప్రాయం ఆయన కలిగిస్తారు. దొంగసాక్ష్యం ఇస్తే కాని కేసులు గెలవవు అనే సత్యాన్ని ఆ నాడే నిరూపిస్తారు. గురజాడ. ఎవరు శక్తివంతులైతే వారిదే గెలుపు అంటాడు. 'వకీలు అబద్ధాలాడిస్తే న్యాయం పుచ్చుకునే జడ్జి ఏం చేస్తాడండీ. అని గిరీశం అడిగితే, 'ఉభయ పార్టీల వకీళ్లు ఆడించే అబద్ధాల్ని చెయ్యి పీకేట్లు రాసుకుంటాడు' అని సౌజన్యారావు ద్వారా న్యాయవ్యవస్థపైనే పరిహాసమాడిస్తారు గురజాడ. నేటి న్యాయవ్యవస్థ ఇంతకంటే భిన్నంగా ఉన్నదా?

**అధికారవర్గాల ప్రయోజనాలకు అనుకూలంగా రూపుదిద్దుకుంటున్న మత భావజాలానికి నిర్దిష్టమైన ప్రయోజనం ఉన్నది. 'గవర్నమెంట్లూ, దేవుళ్లూ, బ్రాహ్మలూ వారి నేరాలు వారివి.**

ఎవరు అధికారంలోకి వచ్చినా వ్యవస్థల స్వభావం మారదు అనేది కన్యాశుల్కం నిరూపిస్తుంది. స్వాతంత్ర్యం వస్తే మన ఊరి హెడ్ కానిస్టేబుల్ మారతాడా అని ఒక పాత్ర ప్రశ్నిస్తుంది. ఆ ఊరి వరకు హెడ్ కానిస్టేబులే అధికార యంత్రాంగానికి ప్రతినిధి. ఎన్ని స్వాతంత్ర్యాలు వచ్చినా ఆ అధికారి మారకపోతే ఆ స్వాతంత్ర్యానికి అర్థం ఏమిటి? ఇప్పటి వ్యవస్థలు, అధికార యంత్రాంగం అప్పటికంటే వేరుగా ఉన్నాయా? అన్న అనుమానం గురజాడ రచనలు చదివితే మనకు కలగక తప్పదు.

అధికారవర్గాల ప్రయోజనాలకు అనుకూలంగా రూపుదిద్దుకుంటున్న మత భావజాలానికి నిర్దిష్టమైన ప్రయోజనం ఉన్నది. 'గవర్నమెంట్లూ, దేవుళ్లూ, బ్రాహ్మలూ వారి నేరాలు వారివి. వాటితో మనకు పనిలేదు. మన భక్తి మనకుండాలి' అని హవల్దార్ అచ్చన్న అంటాడు. మనిషి సృష్టించిన దేవుడు మనిషి పైనే ఆధిపత్యం చలాయించే స్థితికి ఎదిగి వ్యవస్థ దోపిడీ చట్రంలో ఒదిగిపోతాడు. 'నిజమేమిటి, అబద్ధమేమిటి, లోకమే పెద్ద అబద్ధం' అంటాడు బైరాగి.

ఒక ప్రక్రియను ఏ రకంగా ఆధునీకరించవచ్చో కన్యాశుల్కం ద్వారా మనకు అర్థమవుతుంది. గురజాడ పద్యశకానికి సంబంధించిన ప్రధాన లక్షణాలను విధ్వంసం చేయడం లక్ష్యంగా పెట్టుకుని నవ్యశకానికి నాందీ వాచకం పలికారు. అంతకుముందున్న నాటక సంప్రదాయాన్ని, నాందీ ప్రస్తావనలు, భరత వాక్యాలను త్రోసిపుచ్చారు. వర్ణనలను

వదిలిపెట్టారు. నాయకుడు, నాయిక వంటి సాంప్రదాయిక పాత్రలు ఉండి తీరాలని గురజాడ తాపత్రయపడలేదు. వాడుకభాషలో, కళ్లముందు నడుస్తున్న కథతో, తీవ్రమైన పరిణామానికి లోనవుతున్న సామాజిక చరిత్రతో సమన్వయం చేశారు. సాహిత్యానికీ, సమాజానికీ మధ్య ఉన్న అవినాభావ సంబంధాన్ని గుర్తించి వస్తు శిల్పాల మధ్య ఐక్యత పరిపూర్ణంగా సాధించారు. 'సాహిత్యం వ్యక్తిగతానందం కోసం కాదు, అది సామాజిక రుగ్మతలను రూపుమాపే బలమైన ఆయుధం కావాలి' అని గురజాడ ప్రగాఢంగా విశ్వసించి దానికి తగ్గట్లుగా కన్యాశుల్కాన్ని మలిచారు.

గురజాడ కథల వెనుక కూడా ఒక జీవిత కాలపు చింతన ఉన్నది. వీటిలో పూర్తిగా ఆధునికత మనకు కనబడుతుంది. రాజీతత్వానికీ, ఉబుసుబోని కబుర్లకు ఇందులో తావుండదు. గతానికి చోటుండదు. వర్తమానం వస్తువు, భవిష్యత్తు లక్ష్యంగా ఆయన రచనలు కొనసాగుతాయి. 'దిద్దుబాటు' కథ ద్వారా ఏ వర్గానికి చెందిన స్త్రీ అయినా విద్యావంతురాలు కావల్సిందే అన్నది స్పష్టీకరిస్తారు. 'మీ పేరేమిటి' కథలో గ్రామీణ మతమౌఢ్యాన్ని విమర్శిస్తారు. మతాన్ని అడ్డుపెట్టుకుని కుట్రలు చేసే వారు సృష్టించే భావోద్వేగాలకు లోనై మనుషులు విడిపోరాదని హెచ్చరిస్తారు. దేవుడిని వ్యాపారం చేసే వాళ్ల నిజస్వ రూపాన్ని బహిర్గతం చేస్తారు. మత సమైక్యతే నేటి సామాజిక అవసరం అని రచయిత ఈ కథ ద్వారా చెప్పిన సత్యానికి నేటికీ ఎంతో ప్రాధాన్యత ఉన్నది. 'సంస్కర్త హృదయం' అనే కథ ద్వారా ఒక సంస్కర్తలో నిజాయితీ లేకపోతే సమాజానికి ఎలా కీడు చేయగలరో వివరిస్తారు. 'పెద్దమసీదు' కథ ద్వారా మత మార్పిడులపై లోతైన వ్యాఖ్యానం చేస్తారు.

**'సంస్కర్త హృదయం' అనే కథ ద్వారా ఒక సంస్కర్తలో నిజాయితీ లేకపోతే సమాజానికి ఎలా కీడు చేయగలరో వివరిస్తారు. 'పెద్దమసీదు' కథ ద్వారా మత మార్పిడులపై లోతైన వ్యాఖ్యానం చేస్తారు.**

ఇక కవితల ద్వారా గురజాడ ఆధునికతకు శంఖమే పూరించారు. ఈ ఆధునికత ఎటువంటిది? ప్రపంచమే ఒక కుటుంబంగా ఉండాలన్న ఉదాత్తమైన ఆలోచనకు సంబంధించింది. 'ఎల్లలోకము ఒక్క ఇల్లై, వర్ణ భేదములెల్ల కల్లై' వాక్యం ద్వారా నేటి 'గ్లోబల్ సిటిజన్' అన్న పదానికి ఆయన పరిపూర్ణ నిర్వచనం ఇచ్చారు. మతాలు వస్తూ పోతూ ఉంటాయి. కాని జ్ఞానం మాత్రమే నిలిచి వెలుగుతుంది. జ్ఞానమంటే ఏమిటి? శాస్త్రం, సైన్స్. సైన్స్ ను ఎవరూ కాదనలేరు కదా అన్నది గురజాడ అభిప్రాయం. 'మతాలన్నీ మాసిపోయి సైన్స్ మాత్రమే మిగులుతుంది..' అని ఆయన గట్టిగా చెప్పారు. కాని వాస్తవాల్ని సమకాలికులు గ్రహిస్తారా? గ్రహించరు. 'లోకమందలి మంచి చెడ్డలు లోకులెరుగుదురా' అని గురజాడ ప్రశ్నించారు. అదే అప్పటికీ ఇప్పటికీ జీవన సత్యం. 'మనిషి కల్పించిన దేవుడిని పూజించే ఓ మనిషీ, మనిషి నెందుకు హీనంగా చూస్తావు.. దేవుడెక్కడో దాగి ఉన్నాడని కొండల్లో, కోనల్లో ఎందుకు వెతుకుతావు?' అని ప్రశ్నిస్తారు.

కన్యాశుల్కంతో పాటు దాదాపు అన్ని రచనల్లో గురజాడ గతంపై పోరాటం చేశారు.

వర్తమానం ఆధారంగా మంచి భవిష్యత్తు కావాలని కోరారు... అంత మాత్రాన గతాన్నంతా ఆయన తృణీకరించలేదు. వర్తమానాన్ని పూర్తిగా, గుడ్డిగా కౌగలించుకోలేదు. పాత కొత్తల మేలు కలయిక గురించి మాట్లాడారు. 'మంచిచెడ్డలు మనుజులందున ఎంచి చూడగ రెండు కులములు, మంచి అన్నది మాల అయితే మాల నేనగుదున్' అని కులవ్యవస్థపై సమరం ప్రకటించారు. 'జ్ఞానం, నీతి ప్రధానం కాని జాతిలో ఏముంది' అని కన్యాశుల్కంలో హెడ్ కానిస్టేబుల్ పాత్రతో అనిపిస్తాడు.

గురజాడ 'దేశభక్తి' గీతాన్ని సమస్త ప్రపంచ మహాజనుల జాతీయ గీతంగా శ్రీశ్రీ అభివర్ణించారు. ఈ కవితా పరిమళం ఎన్ని శతాబ్దాలు గడిచినా వాడిపోదు. భౌగోళిక సరిహద్దులు ముఖ్యం కాదని, మనిషి ముఖ్యమనీ, మానవత్వం ముఖ్యమని చెబుతుందీ కవిత. 'దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' అనే వాక్యం ఇవాళ రాజకీయ నాయకులు అలవరచుకోవాల్సిన విశాల దృక్పథాన్ని చెబుతుంది. మతం ఏదైనా మనుషులంతా ఐక్యమయితే జాతి సమున్నతి జరుగుతుందని తెలుపుతుంది. 'దురభిమానమైన, మతపరమైన దేశభక్తి కాదు, ఏ దేశంలోనైనా అనుసరించదగిన దేశభక్తి ఏ విధంగా ఉండాలో గురజాడ శతాబ్దం క్రితమే స్పష్టీకరించారు. దేశ ఆర్థిక వ్యవస్థ గురించి గురజాడకి అప్పటికే సమగ్ర అవగాహన ఉన్నది. విదేశీ వస్త్రదహనం జరగడానికి, 'మేక్ ఇన్ ఇండియా' ప్రచారానికి దశాబ్దాలకు ముందే గురజాడ అప్పారావు 'దేశి సరుకులను అమ్మవలెనోయ్' అని దేశభక్తి గీతంలో చెబుతారు. పాడి పంటలు పొంగిపొరలే దేశం కావాలని ఆశిస్తారు. దేశ మార్కెట్ ప్రపంచాలకు కూడా విస్తరించాలని చెప్పారు. ప్రపంచీకరణ ప్రాధాన్యత పెరుగుతున్న కొద్దీ గురజాడ అభిప్రాయాలకు మరింత విలువ పెరుగుతుంది. దేశభక్తి గీత రచనకు ముందు గురజాడ 1908లో మద్రాస్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశాలకు హాజరయ్యారు. గురజాడ ఈ సమావేశంపై ఇంగ్లీషులో రాసిన వ్యంగ్య కవితను 'పాడకోయ్ కవీ కాంగ్రెస్ భజన సమాజం మాత్రమేనని, ప్రతినిధులంతా నిద్దురపోయినా భవనం కిక్కిరిసిన సత్రమే సుమీ..' అని శ్రీశ్రీ అనువాదం చేశారు. అది ఇప్పటి కాంగ్రెస్ పార్టీకీ వర్తిస్తుంది.

గురజాడ అప్పారావు మరణించి వంద సంవత్సరాలైనప్పటికీ ఆయన రచించిన రచనలు వంద సంవత్సరాల క్రిందవైనప్పటికీ వాటి విలువ ఇప్పటికీ సజీవంగా ఉన్నది. ఇందుకు ప్రధాన కారణం ప్రస్తావించిన అనేక సామాజిక సమస్యల్లో అనేకం ఇప్పటికీ ఉనికిలో ఉండడమే కాక కొత్త రూపాల్లో తలెత్తడం. రెండవది– వారు ఆశించిన సంఘ సంస్కరణలు ఇప్పటికీ అవసరం కావడం. మూడవది– వారిలాగా అధునాతన రీతిలో ఆలోచించిన వారు ఇప్పటికీ లేకపోవడం. 150 ఏళ్ల తర్వాత కూడా గురజాడ ఆశయాలు, ఆదర్శాలు, ఆయన సాహిత్య నిబద్ధతా, మనకు ఆశ్చర్యం కలిగిస్తాయి. వారి చారిత్రక అవసరం నాటికన్నా నేటికే ఎక్కువ ఉన్నదని మనకు ఆ రచనల్ని చదివితే అర్థమవుతుంది. గురజాడ తన కాలానికి కంటే ఒక దశాబ్దం ముందు కాదు, ఒక శతాబ్దం ముందు పుట్టిన మేధావి. 'మంచి గతమున కొంచెమేనోయ్' అన్నది గురజాడ విషయంలో వర్తించదు. ఆయన సూచించిన మంచి అపారం. ●

# యుగకర్త గురజాడ



'తెలుగులో నవ్య రీతులకు, నూతన ప్రమాణాలకు ప్రయత్నించిన మొదటి కవిని నేనే. నా కావ్య కళ నవీనం. కావ్య ఇతివృత్తాలు భారతీయం – కవితలో నేను ఉత్తమ ప్రయోజనాల్ని ఉపలక్షించాను. జీవితాన్ని నూతన దృక్పథంతో దర్శించి, కథా, కవితా రూపంలో దానితత్త్వాన్ని అన్వయించడానికి ప్రయత్నించాను. నాది ప్రజల ఉద్యమం. దానిని ఎవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను'

**– గురజాడ వేంకట అప్పారావు**



**ఆచార్య వెలమల సిమ్మన్న**
**Ph: 94406 41617**

నాటకకర్తగా, కవిగా, కథకుడుగా, రచయితగా, వ్యాసకర్తగా, శాసన పరిశోధకుడుగా, చరిత్ర పరిశీలకుడుగా, వ్యావహారిక భాషా ప్రయోక్తగా, ప్రతిభావంతుడైన పండితుడుగా, విద్యావేత్తగా, సంఘ సంస్కర్తగా, సామాజిక శాస్త్రవేత్తగా, రాజకీయ విశ్లేషకుడుగా, హేతువాదిగా, అభ్యుదయవాదిగా, మానవతావాదిగా, స్నేహశీలిగా, సౌజన్యమూర్తిగా, సహృదయుడుగా, హాస్యప్రియుడుగా, దేశభక్తుడుగా, జాతీయవాదిగా, విధేయతకు మారుపేరుగా, మార్గదర్శకుడుగా, నవయుగ వైతాళికుడుగా – ఇలా ఎన్నో లక్షణాలు ఒకే వ్యక్తిలో వున్న మహాకవి, యుగకర్త, మేధావి, మార్గదర్శి గురజాడ వేంకట అప్పారావు గారు. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రజల పక్షాన గట్టిగా నిలిచి, ప్రజల మనిషిగా గురజాడవారు ఆధునిక సాహిత్యంలో ఎనలేని కీర్తి ప్రతిష్టలు గడించారు.

వేయి సంవత్సరాల తెలుగు సాహిత్యంలో 800 సంవత్సరాల సాహిత్యం 'ప్రాచీన సాహిత్యం'. 200 సంవత్సరాల సాహిత్యం 'ఆధునిక సాహిత్యం'. ఆధునిక సాహిత్యాన్నే 'ఆధునిక యుగం' అని అంటారు. దీన్నే 'గురజాడయుగం' గా పిలుస్తారు. ప్రాచీన సాహిత్యంపై సంస్కృత ప్రభావం, ఆధునిక సాహిత్యంపై ఆంగ్ల ప్రభావం చాలా స్పష్టంగా కన్పిస్తుంది. సాహిత్య చరిత్రకారులు వేయేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రను తమ తమ

సిద్ధాంతాలకు అనుగుణంగా వర్గీకరించారు. కందుకూరి వీరేశలింగం నుండి వెలమల సిమ్మన్న వరకు ప్రముఖమైన ఇరవై తెలుగు సాహిత్య చరిత్రలు తెలుగులో చోటు చేసుకున్నాయి. 'తెలుగు సాహిత్య చరిత్రకారులు' అనే గ్రంథాన్ని డాక్టర్ గుమ్మా సాంబశివరావుగారు వెలువరించారు.

యుగం అంటే కొన్ని విశిష్ట సమాన ధర్మాలు గల కాలపరిమితి. 'వాఙ్మయ చరిత్రలో కొన్ని విశిష్ట లక్షణాలు గల వాఙ్మయం మొదలైన దగ్గర నుంచి, దాని ప్రాధాన్యం నశించి కొత్తదైన, భిన్న వర్గాలకు, చెందిన లక్షణాలు గల వాఙ్మయం ప్రారంభమైనంతవరకు గల, కాలాన్ని యుగం' అని అంటారు. నిరంతరం సమాజం మారుతుంది. అదేవిధంగా సాహిత్యంలో మార్పులు వస్తాయి. సాహిత్యం ఎప్పుడూ సమాజానికి అనుకూలంగానే వుంటుంది. అంచేత సాహిత్యం సామాజిక ప్రతిబింబం. సాధారణంగా ఆయా కాలపు సమాజంలోని మార్పుల మూలంగానే సాహిత్యంలోని యుగ విభజన జరుగుతుంది. సాహిత్య చరిత్రలో చేసే యుగ విభాగం విషయ గ్రహణానికి చక్కని సాధనం.

తెలుగు సాహిత్య చరిత్రకారులు, రచనా సౌలభ్యం కోసం తమ తమ అభిరుచిని బట్టి రకరకాలుగా యుగ విభజన చేశారు. 1)కవుల్ని బట్టి యుగ విభజన 2) కవితా పోషకుల్ని బట్టి యుగ విభజన 3) కావ్య ప్రక్రియల్ని బట్టి యుగ విభజన 4) మార్గదర్శకులైన మహాకవుల్ని బట్టి యుగ విభజన. ఆచార్య పింగళి లక్ష్మీ కాంతంగారు మార్గదర్శకులైన మహాకవుల్ని బట్టి తెలుగు సాహిత్య చరిత్రను యుగవిభజన చేశారు. ఆధునిక యుగంలో మార్గదర్శకుడైన మహాకవిగా, ఎందరో ప్రముఖులచేత, మన్ననల్ని ప్రశంసల్ని అందుకున్న ఏకైక వ్యక్తి గురజాడ అప్పారావుగారు. పింగళివారి విభజన ప్రకారం ఆధునిక యుగాన్ని 'గురజాడ యుగం'గా మనం పరిగణించవచ్చు.

గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు, తిరుపతి వేంకట కవులు, కందుకూరి వీరేశలింగం, శ్రీశ్రీ, విశ్వనాథ సత్యనారాయణ, చలం మున్నగు వాళ్ళ పేర్లు సాహిత్యలోకంలో యుగకర్తలుగా విన్పిస్తున్నాయి. అంతేకాదు, వీళ్ళపై అనేక వ్యాసాలు కూడా వచ్చాయి. కొంతమందిపై గ్రంథాలు కూడా వెలువడ్డాయి. వీరి అందరి రచనలపైన, వాళ్ళ వ్యక్తిత్వంపైన సునిశితంగా, లోతుగా, విశ్లేషణాత్మకంగా, తులనాత్మకంగా, నిక్కచ్చిగా అధ్యయనం చేస్తే శ్రీశ్రీ అన్నట్లు 'యుగకర్త కావడానికి అన్ని రకాలుగా తగినవారు మహాకవి గురజాడ అప్పారావు' గారే. భవిష్యత్ సమాజాన్ని దర్శించిన క్రాంతదర్శి వీరు. సమాజంలో తాను ఆశించిన మార్పులన్నింటినీ సాధించడానికి సాహిత్యాన్నే సాధనంగా చేసుకున్న సామాజిక శాస్త్రవేత్త గురజాడ వారు.

గురజాడకు పూర్వం తెలుగు సాహిత్యంలో భాషాపరంగా, సాహిత్యపరంగా, భావాలపరంగా, దిగజారుడు ధోరణులు, నీచమైన ధోరణులు, తిరోగమన ధోరణులు అనేక అంశాలు చోటుచేసుకున్నాయి. చుట్టూ ఉన్న సమాజంలోని చెడును సరిదిద్దవలసిన సామాజిక బాధ్యతను సాహిత్యం స్వీకరించలేకపోయింది. కొందరికే పరిమితమైన, గ్రాంథికభాషకు మాత్రమే, సాహిత్యగౌరవం కల్పించారు. ఆ కారణంగా సాహిత్యానికి

ప్రజలకు మధ్య గల దూరం చాలా పెరిగిపోయింది. ఈ విషయాన్ని గమనించిన గురజాడ అన్నివిధాలా ముఖ్యంగా సమాజంలోనూ, సాహిత్యంలోనూ భాషలోనూ మార్పును మనసారా కోరుకున్నారు. అదే గురజాడ తెలుగుజాతికి చేసిన మహోపకారం.

అప్పారావుగారి మొత్తం సాహిత్యంలో ప్రధానంగా మనకు కన్పిస్తున్న సామాజిక అంశాలున్నాయి. పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని నిరసించడం, బాల్య వివాహాల్ని ఖండించడం, వితంతు వివాహాల్ని ప్రోత్సహించడం, వేశ్యావృత్తిని నిర్మూలించడం, స్త్రీకి సంపూర్ణ స్వేచ్ఛ ఇవ్వడం, అందరికీ విద్య, అపారమైన దేశభక్తి, జాతీయతా దృక్పథం, మతాన్ని నిరసించడం, కుల నిర్మూలన, మూఢాచారాల్ని, నమ్మకాల్ని, ఛాందస భావాల్ని ఎదిరించడం, అవినీతిపై తిరుగుబాటు చేయడం మొదలైనవి.

ఆధునిక తెలుగు సాహిత్యంలోనేకాక నాటక ప్రక్రియలోనూ గురజాడ రాసిన కన్యాశుల్కం పెనుమార్పులకు కారణమయింది. ఈ నాటకం తెలుగు సాహిత్యంలో చెప్పలేనంత సంచలనాత్మకమైన విప్లవం తెచ్చింది. ఈ నాటకం మీద వచ్చినంత విమర్శ, ప్రతి విమర్శలు మరి ఏ నాటకం మీదా, ఇతర గ్రంథం మీదా రాలేదు. అంతేకాదు ఒక రచయిత రాసిన గ్రంథం మీద ఇన్ని వేల పేజీల విమర్శ కూడా రాలేదు. ఇది గొప్పే కాదు, ఒక రికార్డు కూడా. ఈ నాటక గొప్పతనాన్ని గూర్చి గురజాడ చెపుతూ హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు గారికి ఒక ఉత్తరం కూడా రాశారు. 'ఇతివృత్త స్వీకరణలో, నిర్వహణలో, హాస్యరస పోషణలో, పాత్రోన్మీలనంలో తెలుగు సాహిత్యంలో ఇది అత్యుత్తమ నాటకం అనే విషయాన్ని మరవకండి' అని తన అభిప్రాయాన్ని తెలియజేశారు.

వీరు సృష్టించిన పాత్రలు మానవత్వంతో నిండి వున్నాయి. ప్రాణమున్న ప్రతీ ఒక్కరిలోనూ అవి జీవించి, జీవితాన్ని ఉత్సాహవంతం చేస్తాయి. మానవత్వంతోనూ, జీవితంతోనూ పెనవేసుకున్న పరిపూర్ణమైన రచన కన్యాశుల్కం. ప్రారంభంలో గ్రాంథికభాషలో రచనలు చేసిన గురజాడ తర్వాత వాడుక భాషలో రచనలు చేయవలసిన ఆవశ్యకత గుర్తించారు. దాన్ని ప్రజా ఉద్యమంగా తలచారు. గిడుగు వ్యావహారిక భాషోద్యమానికి బాసటగా నిలిచారు. ఇద్దరూ కలిసి భాషా, సాహిత్యాల్ని ప్రజల దగ్గరకు తీసుకెళ్ళారు. జనాలకు దగ్గరయ్యారు.

సమాజంలోని అన్నిరకాల మనుషులు ఈ నాటకంలో మనకు కనబడతారు. గురజాడ సృష్టించిన అన్ని పాత్రల్ని మనం ఇష్టపడతాం. కారణం, ఆయన సృష్టించిన పాత్రలు సమాజంలో ఇప్పటికీ మనకు కనబడతాయి. అవి సజీవ పాత్రలు. సలక్షణ పాత్రలు – విలక్షణ పాత్రలు.

మధురవాణి లాంటి మానవ విలువలు, నైతిక విలువలు కలిగిన స్త్రీమూర్తి, గిరీశం లాంటి మాయగాడు, మాటకారి, అబద్ధాల కోరు, అగ్నిహోత్రావధానులు లాంటి పరమ ఛాందసుడు, మూఢుడూ, దావాలకోరుగాడు, కోపిష్టి, వెంకమ్మలాంటి సనాతన భావాలు గల భర్తను వ్యతిరేకించిన స్త్రీ, లుబ్ధావధానులు లాంటి పరమ లోభి, పేరుకుతగ్గ వ్యక్తి,

ప్రపంచమంతా డబ్బుతోనే ఉందనుకుంటాడు. డబ్బు కక్కుర్తితో పిచ్చిపనులు చేసేవాడు. రామప్పపంతులు లాంటి టక్కరి మోసగాడు, స్త్రీలోలుడు, స్వార్థపరుడు, కోర్టుపక్షి, డబ్బుకు అమ్ముకుపోయినవాడు, తగవులు పెంచి బ్రతికేవాడు. నీచుడు, బైరాగిలాంటి సమాజ చీడపురుగులు, బుచ్చమ్మలాంటి ఏమీ తెలియని అమాయకురాలైన వితంతువు, మీనాక్షిలాంటి వితంతువు, బుచ్చమ్మ – మీనాక్షి ఇద్దరూ సాంఘిక దురాచారాలకూ, ఛాందస భావాలకూ బలి అయిన, బాల వితంతువులు, పూట – కూళ్ళమ్మలాంటి స్వశక్తితో బ్రతికే బాలవితంతువు, కరటక శాస్త్రి లాంటి కార్యశీలుడు, శక్తిమంతుడు, అనుకున్నపని సాధించిన ధీశాలి. లౌక్యం నేర్చినవాడు, భీమారావు, నాయుడు లాంటి డబ్బుకు దాసోహం అయిన దొంగలాయరులు, వేంకటేశం – మహేశం లాంటి యుక్త వయస్సులో వున్న భావి పౌరులు, సౌజన్యరావు లాంటి సత్ పురుషుడు. వేశ్యావిముఖుడు, సంఘ సంస్కరణాభిలాషి, ఇలాంటి వాళ్ళు అందరూ మన సమాజంలో కోకొల్లలు. అందుకే కన్యాశుల్కం సజీవ నాటకమైంది.



సమాజంలోని అవ్యవస్థను చూసి గురజాడ చాలా మానసిక సంక్షోభానికి గురి అయ్యాడు. ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని చూసి తీవ్ర ఆవేదనకు లోనయ్యారు. తన వంతు సమాజానికి ఏమి చేయగలనా అని మదనపడ్డారు.

సమాజంలోని అవ్యవస్థను చూసి గురజాడ చాలా మానసిక సంక్షోభానికి గురి అయ్యాడు. ఆనాటి సాంఘిక పరిస్థితుల్ని చూసి తీవ్ర ఆవేదనకు లోనయ్యాడు. తన వంతు సమాజానికి ఏమి చేయగలనా అని మదనపడ్డాడు. సంఘ – సంస్కరణ కోసం సాంఘిక నాటకం గురజాడ రాశారు. సంఘంలోని ఛాందసుల్ని చూసి బాధపడ్డారు. అమాయకులైన బాల వితంతువుల్ని కళ్ళారా చూసి మనస్తాపం చెందారు. వేశ్యల జీవితాన్ని చూసి తీవ్రంగా కలత చెందారు. తప్పుడు పనులు చేసే మనుషుల్ని చూచి దుఃఖించారు. దొంగ లాయరుల్ని చూసి ఆవేదన చెందాడు. మనిషిలో మానవత్వం లేమిని గ్రహించాడో సమాజంలోని నీతిని గూర్చి, నిజాయితీ గూర్చి, మానవ విలువల గూర్చి తెలుసుకొని నాటకకర్త అవాక్కయ్యారు.

అందువల్ల తనవంతుగా సమాజంలో మానవతా విలువల్ని వికసింప చేయడానికీ, మనుషుల్లో మానవతా విలువల్ని పెంపొందింపచేయడానికీ నాటకం రాశారు.

కన్యాశుల్కంలో ప్రతీ పాత్ర నిత్యజీవితంలో ఎక్కడో ఒక దగ్గర, ఏదో ఒక సందర్భంలో మనకు కన్పిస్తూనే వుంటుంది. ఆనాటి సమాజంలో దుష్ట, నీచమైన సంప్రదాయాలు, ఆచారాలు, నమ్మకాలు ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమించాయి. ఈ సమస్యలపైనే నాటకకర్త కలాన్ని కత్తిగా దూసారు. అలాంటి అవ్యవస్థను కూకటివేళ్ళతో పూర్తిగా పెకలించడానికే నాటకం రాశారు. అందుకే ప్రముఖ సంఘ సంస్కర్త అయ్యారు.

తెలుగు సాహిత్యంలోనే కాక, భారతీయ సాహిత్యంలోనే కాక, ప్రపంచ నాటక సాహిత్యంలో కన్యాశుల్కం అగ్రశ్రేణిలో నిలిచే గొప్ప నాటకమని మేధావులు, కవులు, రచయితలు, నాటక కర్తలు,పండితులు, సాహిత్యవేత్తలు, విమర్శకులు వేనోళ్ళ కొనియాడారు.

ఇతివృత్తంలోనూ, సాహిత్య కళా సౌందర్యంలోనూ, భాషలోనూ, భావంలోనూ, పాత్ర పోషణా నైపుణ్యంలోనూ, పాత్రోచిత భాషను వాడడంలోనూ, సంభాషణా చాతుర్యంలోనూ, అద్భుతమైన సన్నివేశ కల్పనలోనూ, రసపోషణలోనూ, కథా సంవిధానంలోనూ, శైలిలోనూ, శిల్పంలోనూ, నాటక నిర్మాణ దక్షతలోనూ, సాహిత్య ప్రయోజనంలోనూ, తెలుగుదనం ఉట్టిపడేలా తెలుగు పలుకుబడులు వాడడంలోనూ, జాతీయాలు, సామెతలు వాడడంలోనూ – ఒకటి ఏమిటి ఇలా అన్ని విషయాల్లోనూ కన్యాశుల్కంలో ఉత్తమ నాటక కళా విశిష్టత కొట్టవచ్చేటట్లు కన్పిస్తుంది. ఈ నాటకంలో గొప్పతనం ఏమంటే చదివినా, చూసినా, నాటకంలోని పాత్రలన్నీ మనకు ఎల్లకాలం జ్ఞాపకం వుంటాయి. ఇదే ఈ నాటకం గొప్పతనం.



**గురజాడ రాకతో ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక నూతన శకం ప్రారంభమైంది. ఈ విషయాన్ని అన్నివర్గాలవారు, అందరూ ముక్తకంఠంతో అంగీకరించారు.**

గురజాడ రాకతో ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక నూతన శకం ప్రారంభమైంది. ఈ విషయాన్ని అన్నివర్గాలవారు, అందరూ ముక్తకంఠంతో అంగీకరించారు. మీదు మిక్కిలి అభినందించారు కూడా. సామాజిక సంస్కరణ కోసం, భాషా సంస్కరణ కోసం, వాడుక భాషలో నాటకం రాశారు. గురజాడ నూటికి నూరుపాళ్ళు తాను అనుకున్న సాహిత్య ప్రయోజనాన్ని పూర్తిగా సాధించారు. ఇందులో ఎవరికీ ఏ అనుమానం అవసరం లేదు. తెలుగు భాషా సాహిత్యాల్లో సంస్కరణలు ప్రవేశపెట్టి, రాబోవుకాలానికి అనుగుణంగా తెలుగు సాహిత్యాన్ని ముందుకు తీసుకెళ్ళారు. ఆధునిక తెలుగు సాహిత్యానికి మార్గదర్శకులయ్యారు.

'జీవితం అంత గొప్పది కన్యాశుల్కం' అని శ్రీశ్రీ, "తరగని గని కన్యాశుల్కం" అని ఆరుద్ర, "మానవజీవి చిత్రణే కన్యాశుల్కం' అని ఒంగోలు ముని సుబ్రహ్మణ్యం, "సంస్కరణ పతాక కన్యాశుల్కం' అని టి.ల్. కాంతారావు, "జీవిత రంగమే కన్యాశుల్కం" అని నార్ల మొదలైనవారు కన్యాశుల్కం నాటకం గూర్చి కొనియాడారు. 'కన్యాశుల్కం లాంటి నాటకాలు తెలుగులో లేవు. వచన నాటకాలకు అప్పారావుగారు ఆదిభిక్ష పెట్టారు' అని చింతా దీక్షితులు ప్రశంసించారు. 'కన్యాశుల్కం తిరగేస్తే మొదటి పేజీలోనే మనిషి వాసన

వస్తుందని' సర్దేశాయి తిరుమల రావుగారు అభిప్రాయపడ్డారు.

పాల్కురికి సోమనాథుడు అనగానే ద్విపద, వేమన అనగానే ఆటవెలది, అన్నమయ్య అనగానే కీర్తనలు, క్షేత్రయ్య అనగానే పదాలు, గురజాడ అనగానే ముత్యాలసరాలు మనకు గుర్తుకు వస్తాయి. ఆధునిక కవిత్వానికి ఆద్యులు, ఆరాధ్యులు, పూజనీయులు గురజాడవారు. 1910లో ఈ ముత్యాల-సరాలు వచ్చాయి. గురజాడ కవిత్వంలో నవ్య ప్రయోగాలు ఎన్నో చోటు చేసుకున్నాయి. ఇతివృత్తంలో, నవ్యతలో, భావంలో, శైలిలో, భాషలో, ఛందస్సులో, పదప్రయోగంలో ఒకటి ఏమిటి అన్ని అంశాల్లో కొత్త విషయాలు కన్పిస్తాయి. గురజాడవారు ఆనాడు పద్యాన్ని విడిచిపెట్టి గేయం రాయడమే పెద్ద చైతన్యం. పెనుమార్పు కూడా. అంతేకాదు వాడుకభాషలో కవిత్వం రాయడం కూడా గురజాడ భావంలో సహజత్వం వుంది. వాస్తవికతా సౌందర్యం వుట్టిపడుతుంది. శ్రీశ్రీ అన్నట్లు 'గురజాడది వట్టి ఫోటోగ్రఫీ కాదు X-ray ఫోటోగ్రఫీ'. అంతవరకు తెలుగు కవిత్వంలో లేని కొత్తదనం గురజాడ కవిత్వంలో కన్పిస్తుంది.

'ప్రపంచ కవి సమ్మేళనంలో తెలుగువారి తరఫున పాల్గొనదగిన మహాకవి గురజాడ అని, ఆయన కవిత్వాన్ని కొత్త మలుపు తిప్పారు' అని శ్రీశ్రీ కొనియాడారు. కన్యక అగ్నికి ఆహుతి అయింది. పూర్ణమ్మ నీట మునిగి ఆత్మహత్య చేసుకుంది. కన్యక చైతన్యాన్నిస్తుంది. పూర్ణమ్మ సంస్కారాన్నిస్తుంది. 'పూర్ణమ్మ ముగింపు ఒక గొప్ప కావ్యాన్ని చదివిన అనుభూతి కలుగుతుందని' శ్రీశ్రీ కొనియాడారు. పూర్ణమ్మను గురజాడ చతురశ్ర గతిలో నడిపారు 'పూర్ణమ్మ కథ, కాల గర్భంలో కాదు, కావ్య గర్భంలో కలిసింది. అందుకే శాశ్వతంగా నిలిచింది' అని ఆరుద్రగారు ప్రశంసించారు. 'పూర్ణమ్మ చనిపోలేదు, ఆమెది ఆత్మహత్య కాదు. భర్త యింటికి పోవడానికి మారుగా, లోకేశ్వరి ఇంటికి పోయిందని అనడం యదార్థం' అని రమణారెడ్డిగారు అభిప్రాయపడ్డారు.

వీరు దేశభక్తి గేయాన్ని 'సమస్త ప్రపంచ మహాజనుల జాతీయ గీతంగా' ప్రశంసించారు శ్రీశ్రీ గారు. 'ఠాగూరు రాసిన 'జనగణమణ' కంటే గురజాడ వారి దేశభక్తి గీతం' ఎన్నోరెట్లు మిన్న' అని రోణంకి అప్పలస్వామిగారు అన్నారు. 'అప్పారావు రాసిన కాలానికీ, దేశానికీ, ఇంతకంటే నిండుగా సమాజ పథాన్ని గురించి, ఆదేశించిన జాతీయ గీతం మరొకటి లేకపోవచ్చు' అని కె.వి.ఆర్. గారు తెలియజేశారు.

గురజాడ వారి ఐదు కథలు చదివితే ఆనాటి సాంఘిక జీవితం ఎలా వుండేదో తెలుస్తుంది. దిద్దుబాటు, మీ పేరేమిటి, మెటిల్డా, పెద్ద మసీదు, సంస్కర్త హృదయం అనే ఐదు కథల్లో పతనమవుతున్న నైతిక విలువలు, మతవ్యవస్థ, సాంఘిక వ్యసనాలు మొదలైన అంశాలు కన్పిస్తాయి. గురజాడ రచనా రీతిని గూర్చి చెపుతూ చింతాదీక్షితులుగారు 'చిన్న చిన్న పదాలతో పెద్ద పెద్ద అర్థాలు వచ్చేటట్లు చెప్పగల దిట్ట' అని ప్రశంసించారు. గురజాడవారు రాసిన కథలు ఇప్పటికీ నిత్య నూతనంగా వున్నాయి. కథ సామాజిక జీవితానికి ప్రతిబింబం అనే వాస్తవాన్ని గురజాడ రుజువు చేశారు. అదే విషయాన్ని నేటి కథారచయితలు కూడా వాస్తవం చేస్తున్నారు. వాస్తవ జగత్తును దర్శింప చేస్తున్నారు.

గురజాడ రచనలు మనకు ఆదర్శప్రాయం. అనుసరణీయం అయ్యాయి. అందుకే గురజాడను 'గద్యవాఙ్మయ ప్రవర్తకుడు' అని శ్రీశ్రీ అన్నారు.

డైరీలు, లేఖలు, డిసెంట్ పత్రం, మాటామంతీ లాంటివి కూడా గురజాడను అగ్రపీఠంలో నిలబెట్టాయి. చనిపోయి నూటామూడు సంవత్సరాలు గడిచినా తెలుగు వారి హృదయాల్లో శాశ్వతంగా జీవిస్తున్న మహనీయుడు గురజాడ అప్పారావుగారు (21 సెప్టెంబర్ 30 – 1862 నవంబర్ 1915). మహాకవులకు జననమేగాని మరణం వుండదు.

ఇప్పటికీ గురజాడ రచనలపైన ఆయన జీవితంపైన ప్రత్యేకించి కన్యాశుల్కంపైన ఎన్నెన్నో పరిశోధనలు విమర్శలు, విశ్లేషణలూ, వ్యాఖ్యానాలూ, సమీక్షలు, సంకలనాలు, సంపుటాలు వచ్చాయి. ఇంకా వస్తూ వున్నాయి. అదే గురజాడకూ, ఆయన రచనలకూ వున్న గొప్పతనం, విశిష్టత కూడా. తెలుగు సాహిత్యంలో మరి ఏ ఇతర రచయితకు లేనంత ఖ్యాతి గురజాడ వారికి దక్కింది. వారి రచనలతో తెలుగు సాహిత్యం సుసంపన్నం అయిందనడంలో సందేహం లేదు. గురజాడ గూర్చి ఎంత రాసినా, ఎంత మాట్లాడినా తనివితీరదు. గురజాడపై వచ్చిన కొన్ని విమర్శలు సరైనవి కావు. కావాలని కొంతమంది రంధ్రాన్వేషణ చేశారు. కొందరు చేసిన విమర్శలు వివేచనతో కూడినవి కావు. అవి కువిమర్శలు. గురజాడ ప్రతిభా ప్రజ్ఞా పాటవాల్ని కొంతమంది సంప్రదాయవాదులు గుర్తించలేకపోయారు. ఇదే విషయాన్ని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు పదే పదే నొక్కి చెప్పారు కూడా.

సెట్టి ఈశ్వరరావు, బం.గో.రె, అవసరాల సూర్యారావు, కె.వి.ఆర్, శ్రీశ్రీ, ఆరుద్ర, సర్దేశాయి తిరుమల రావు కొడవటిగంటి కుటుంబరావు, తాపీ ధర్మారావు, నార్ల వేంకటేశ్వరరావు నిడుదవోలు వేంకటరావు, పి.యస్. ఆర్. అప్పారావు, అబ్బూరి రామకృష్ణారావు, మొదలి నాగభూషణ శర్మ, ఒంగోలు ముని సుబ్రహ్మణ్యం మొదలైనవారు ఎందరో గురజాడ సాహిత్యాన్ని లోతుగా అధ్యయనం చేసి నిగ్గు తేల్చారు. చింతాదీక్షితులు, ఇంద్రగంటి హనమచ్ఛాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు మున్నగువారు గురజాడ మార్గదర్శకత్వాన్ని వేనోళ్ళ కొనియాడారు.

గురజాడపై, ఆయన రచనలపై ప్రముఖుల అభిప్రాయాల్ని ముందుగా పరిశీలిద్దాం.

'నవ్యాంధ్ర కవిత్వ శుభోదయమునకు గురజాడ అప్పారావు వేగుచుక్క' అని ఆంధ్ర శేషగిరి రావుగారు అన్నారు.

'అప్పారాయోపజ్ఞకమైన రాసే గీతాలను రాయప్రోలు సుబ్బారావుగారందుకున్నారు' అని విశ్వనాథ సత్యనారాయణ అభిప్రాయపడ్డారు. 'ఈ శతాబ్దపుటారంభమునకే గురజాడ అప్పారాయ కవి యువలోకము కనుచున్న కలలు రూపొందజేయుచు ఆధునిక కవిత్వపు ధ్వజమును ప్రతిష్ఠించెను. ముత్యాల సరములను గేయ సంపుటితో నవ్యకవితకు నాంది పఠించెను' అని ఖండవల్లి లక్ష్మీకాంతంగారు భావించారు.

'అప్పారావు గారి నీలగిరి పాటలు, ముత్యాలసరాలు కొత్త పాతల మేలు కలయిక కూర్చిన నవ్య సాహిత్యపు తొలికృతులు' అని నోరి నరసింహశాస్త్రిగారు పేర్కొన్నారు.

'మహాకవి గురజాడ అప్పారావు మొట్టమొదటిసారి ముత్యాలసరాలు గుచ్చిన యేడు 1910లోనే తెలుగు కవిత్వంలో విప్లవశకం ఆరంభమైనది' అని శ్రీశ్రీ గారు కుండబద్దలు కొట్టినట్లు నిజాన్ని నిక్కచ్చిగా వెలువరించారు. అంతేకాక శ్రీశ్రీ గారు, కందుకూరి వీరేశలింగం, తిరుపతి వెంకటకవులు, రాయప్రోలు సుబ్బారావుగార్లను ప్రస్తావించి వారెవ్వరూ యుగకర్తకారని, సామాజిక పరిణామానికి విప్లవ పంథాలలో వేగం సాధించిన 'మహాకవిగా' గురజాడ వారినే ఆధునిక యుగానికి యుగకర్తగా తాను భావిస్తున్నట్లు తెగేసి మరీ చెప్పారు.

'ఆధునిక సాహిత్య యుగకర్తే కాదు తెలుగులో వ్యావహారిక భాషా రచనకు ఉపక్రమించిన వారిలో ప్రథములు కూడా గురజాడే' అని గొర్రెపాటి వేంకట సుబ్బయ్యగారు ప్రశంసించారు. 'తెలుగులో ఆదికవి నన్నయ్య అయితే తెలుగుకు ఆధునికతని కల్పించింది గురజాడ. ఈ ఇద్దరి చేతుల్లో తెలుగు కొత్త పుంతల్ని తొక్కింది' అని గురజాడ సాహిత్య పరిష్కర్త సెట్టి ఈశ్వరరావు గారు కొనియాడారు.

శ్రీ పాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు గురజాడను 'మహాకవి'గా గుర్తించి గౌరవించారు. 'గురజాడ గురుపీఠం' అనే గ్రంథంలో ఆరుద్రగారు 'ఆధునికాంధ్ర సాహిత్యానికి గురజాడ ఆచార్యుడు' అని సమర్థించారు. గురజాడను 'ఆధునికాంధ్ర కవిత్వానికి మూలపురుషుడుగా' గురజాడను కొనియాడారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు. 'వైతాళికులనే మేలుకొలిపినాడు, మార్గదర్శి, మేధావి' అని ముద్దుకృష్ణగారు అన్నారు. 'కన్యాశుల్కాన్ని దేవుడు తప్పిస్తే మరొకరు రాయలేరు అనేవారు. నాటక రచనా కళా విషయంలో గురజాడ వారు నిజంగా దేవుడే. ఆయన సృష్టించి, పోషించిన పాత్రలే ఆయన్ని దేవుణ్ణి చేశాయి' అని రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు కొనియాడారు.



**గురజాడ వారి ఐదు కథలు చదివితే ఆనాటి సాంఘిక జీవితం ఎలా వుండేదో తెలుస్తుంది. దిద్దుబాటు, మీ పేరేమిటి, మెటిల్డా, పెద్ద మసీదు, సంస్కర్త హృదయం అనే ఐదు కథల్లో పతనమవుతున్న నైతిక విలువలు, మతవ్యవస్థ, సాంఘిక వ్యసనాలు మొదలైన అంశాలు కన్పిస్తాయి.**

**గురజాడ – రాయప్రోలు :**

ఆచార్య సింగిరెడ్డి నారాయణరెడ్డి గారు 'ఆధునికాంధ్ర కవిత్వం – సంప్రదాయాలు – ప్రయోగాలు' అనే పరిశోధనా గ్రంథంలో గురజాడ, రాయప్రోలు ఇద్దరినీ యుగకర్తలుగా పేర్కొన్నారు. నారాయణరెడ్డి గారి పరిశోధనా వాదనలో పసలేదు. తర్వాత కాలంలో ఆయన సిద్ధాంతం నిలవలేదు. ఆ పరిశోధన సరైనది కాదని విమర్శకులు ముక్తకంఠంతో తీవ్రంగా ఖండించారు. కారణం రాయప్రోలు రచనలు ఎక్కువశాతం సనాతన సంప్రదాయ

కవితా ధోరణులతో నిండి వున్నాయి. అందులో ఏమాత్రమూ సందేహం లేదు. ఏ అంశంలోనూ కొత్తదనం లేదు. అంతేకాదు భాష కూడా గ్రాంథికమే. ఇది ఎవ్వరూ కాదనరాని నగ్నసత్యం. ఎటువంటి ముందుచూపులేని, సామాజిక స్పృహలేనీ, సామాజిక దృష్టి లేనీ, కేవలం అమలిన శృంగారానికే పరిమితమైన భావకవి అయిన రాయప్రోలు సుబ్బారావు గారిని గురజాడ వారికి సమ ఉజ్జీగా నిలిపి, యుగకర్తృత్వాన్ని ఇద్దరికీ పంచడం నూటికి నూరుపాళ్ళు తప్పు.



**వీరేశలింగం ఉద్దేశం వేరు. గురజాడ ఆలోచన వేరు. సంస్కరణల్లో జీవన విధానంలో నిక్కచ్చిగా వున్న వారు కందుకూరి. గురజాడ దీనికి పూర్తిగా భిన్నంగా నడిచాడు. అన్ని కోణాల్లోనూ సమగ్రంగా పరిపూర్ణమైన మానవజీవితాన్ని చాలా చక్కగా చిత్రీకరించి ఆవిష్కరించారు.**

ప్రాచీన సనాతన సంప్రదాయాల్ని, పాతభాషను, పాత ఛందస్సును, పాత భావజాలాన్ని బూజుపట్టిన నమ్మకాల్ని గౌరవిస్తూ రచనలు చేసిన రాయప్రోలువారికీ, భాషలోనూ భావంలోనూ, ఛందస్సులోనూ, వస్తువు లోనూ, సాహిత్యంలోనూ అన్ని అంశాల్లోనూ ఆధునికతను ప్రవేశపెట్టిన గురజాడ సామాజిక విప్లవ పథానికి చాలా తేడావుంది. ఈ విషయం ఇద్దరిలోనూ చాలా స్పష్టంగా అందరికీ కన్పిస్తుంది. ఇంతకూ అసలు విషయం ఏమంటే భావకవులు సామాజిక మహాకవులా? మార్గదర్శకులా? రెండూ కాదు కదా! ఒకమాటలో చెప్పాలంటే భావ కవిత్వంలో వస్తువు, వ్యక్తి స్వార్థానికి పరాకాష్ఠ. అటువంటి వ్యక్తుల్ని యుగకర్తలుగా నిర్ధారించడం సమంజసంగా లేదు.

భావకవులు తమ భావనతో ఇతర లోకాల్ని సృష్టించారు. అందులో స్వేచ్ఛగా విహరించారు. వీళ్ళు యుగకర్త ఎలా అవుతారు. భావకవుల దృక్పథం, అస్తిత్వానికి చెందినదని విమర్శకులు తీవ్రంగా ఖండించారు కూడా. భావకవులు తమ చుట్టూ ఒక అద్భుతమైన వాతవరణాన్ని సృష్టించుకున్నారు. ఆ లోకంలోనికి తమ ప్రేయసికి తప్ప ఇతరులకు చోటు లేకుండా చేశారు. వీళ్ళకు విశాల దృక్పథం లేదు. ఇంకా వీళ్ళకి సామాజిక దృక్పథం ఎక్కడిది? వీరు తమ స్వార్థం కోసం చూసుకున్నారు. ఏకాంతంలోనే వుండడానికి ఇష్టపడ్డారు. సామాన్య మానవుని కోసం వీరు కనీసం ఆలోచించలేదు. సామాజిక అవగాహన లేని కవులు తెలుగు సాహిత్యంలో ఎవరైనా వున్నారంటే భావకవులే. భావకవులు సొంత రాజ్యాన్ని ఏర్పరచుకున్నారు. ఆ సొంత రాజ్యం ప్రేమ రాజ్యం. ఆ ప్రేమలో మునిగి, తేలుతూ ఆనందంలో విహరించారు. భావకవులు కేవలం తమ స్వార్థం కోసం కవిత్వాన్ని సృష్టించారు. ఇటువంటివాళ్ళు యుగకర్తలుగా ఎలా అవుతారు? కాబట్టి భావకవి అయిన రాయప్రోలు సుబ్బారావుగారు నూటికి నూరుపాళ్ళు యుగకర్త అవడానికి

అర్హతలు లేవు.

గురజాడ, రాయప్రోలు ఇద్దరూ గొప్పవారే ఇద్దరూ ప్రముఖ సాహిత్యవేత్తలే. అయితే ఒక యుగానికి ఇద్దరు యుగకర్తలు వుండరు కదా! వుండకూడదు కదా. కాబట్టి అన్ని విషయాల్లోనూ కొత్తదనాన్ని, మార్పును కోరుకున్న గురజాడ అప్పారావుగారే యుగకర్త. కాలంతో పాటు కొత్తదనాన్ని సంతరించుకొని, భావితరాలవారు అనుసరించడానికి మార్గదర్శకులైన మహాకవులే యుగకర్తలవుతారు.

**గురజాడ – కందుకూరి :**

కందుకూరి వారు 1878లో రాజమండ్రిలో 'సంఘ సంస్కర్త సమాజం'ను స్థాపించారు. అంతేకాదు తన సంఘ సంస్కరణ ఉద్యమానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా ఎంచుకున్నారు. అందుకే నవల, ప్రహసనం, నాటకం, మొదలైన సాహిత్య ప్రక్రియలన్నింటిని ఈ లక్ష్యంతోనే రాశారు. సాహిత్యానికి సామాజిక ప్రయోజనానికీ మధ్య గల సంబంధాన్ని గ్రహించడంలో కందుకూరి వారి కృషి, చైతన్య స్ఫూర్తి చాలా గొప్పది. మీదు మిక్కిలి విస్మరించరానిది.

వీరేశలింగం ఉద్దేశం వేరు. గురజాడ ఆలోచన వేరు. సంస్కరణల్లో జీవన విధానంలో నిక్కచ్చిగా వున్న వారు కందుకూరి. రాజీపడని మనస్తత్వం కందుకూరిలో కన్పిస్తుంది. ఆయన రచనలో శిల్పం, భాషాసొగసులు, సాహిత్యపు విలువలు, కళాదృష్టి ఇవి పెద్దగా కనబడవు. కందుకూరి ఆ దృష్టితో రచనలు చేయలేదు. సంఘసంస్కరణకు, సాహిత్యాన్ని ఒక ప్రచార సాధనంగా ఉపయోగించుకున్నారు. గురజాడ దీనికి పూర్తిగా భిన్నంగా నడిచాడు. అన్ని కోణాల్లోనూ సమగ్రంగా పరిపూర్ణమైన మానవజీవితాన్ని చాలా చక్కగా చిత్రీకరించి ఆవిష్కరించారు.

కందుకూరిది ఉద్యమదృష్టి గురజాడది మేధోదృష్టి. కందుకూరి సత్యవాది. గురజాడ వాస్తవికవాది. అందుకే తాను సృష్టించిన అన్ని పాత్రల స్వభావాలూ, సమాజంలోని మనుషులుగా సజీవంగా కన్పిస్తారు. సంఘంలోని మనుషుల్లో ఎలా మంచి చెడులు వుంటాయో, గురజాడ సృష్టించిన పాత్రల్లో కూడా అలా కనబడతారు. గురజాడ వారిలా కందుకూరి వారు వాడుక భాషలో రచనలు రాయలేకపోయారు.

గురజాడ సాంఘిక, ఆర్థిక, రాజకీయ, కళా, సాహిత్యాది రంగాల్ని వివేచన చేశారు. వీరు వ్యక్తిగత ద్వేషంతో కాకుండా, వస్తు నిర్దేశిత దృష్టితో మాత్రమే విషయాన్ని నిశితంగా విశ్లేషణ చేశారు. ఆ విమర్శలో చిన్నయసూరిని, కందుకూరిని కూడ వదలలేదు. 'కందుకూరివారు చిన్నయసూరి గారిని మించి పోవాలని' అనుకుంటున్నారు అని భాషా విషయంలో వ్యంగ్యంగా మాటలాడారు. ఆ తర్వాత కందుకూరివారు పూర్తిగా మారిపోయి 'నీతిచంద్రిక' 'మిత్రలాభం'లోని గ్రాంథిక భాషను విడిచిపెట్టి వాడుక భాషలోకి వచ్చారు.

కందుకూరి సాంఘిక పోరాటం కోసం సాహిత్యాన్ని మాధ్యమంగా ఉపయోగించుకున్నారు. ఆయన ప్రధాన దృష్టి సాంఘిక చైతన్యమే. గురజాడ రచనలో వున్న సాహిత్యపు విలువలు, కందుకూరిలో కనబడవు. గురజాడది సంస్కరణ దృష్టితో

పాటు, భాషా దృష్టి, కళాత్మక సాహిత్య దృష్టి కూడా. గురజాడ ప్రజల్ని ప్రేమించడమే కాదు, ప్రజలభాషను కూడా ప్రేమించారు. అందుకే గురజాడ ఎవరికీ అందనంత ఎత్తుకు ఎదిగారు.

వస్తువులో, పాత్ర చిత్రణా నైపుణ్యంలో, భాషలో, హాస్య చతురతలో, వ్యంగ్యస్ఫూర్తిలో సహృదయ పాఠకుల, ప్రేక్షకుల హృదయాల్ని దోచుకున్న నాటకం కన్యాశుల్కం. అందుకే ఈ నాటకం గొప్పది అయింది. ఇందులోని పాత్రలు సమాజంలో వున్నారు. అంచేత గురజాడ సృష్టించిన పాత్రల్ని సమాజంలోని పాత్రల్ని సరిపోల్చి చెబుతూ మురిసిపోయే చాలా ఎక్కువమంది ఇప్పటికీ వున్నారు. గురజాడ వారి కన్యాశుల్కాన్ని అంతకు ముందు వచ్చిన కందుకూరి వారి 'బ్రహ్మవివాహం' ప్రహసనంతో పోలుస్తూ ఇతివృత్తపరంగా వున్న పోలికలను వెదికేవారు గ్రహించవలసిన సత్యం ఇది.

'వీరేశలింగం గారు 'బ్రహ్మ వివాహం' లో ఆనాటి బ్రాహ్మణుల పెళ్ళిళ్ళకు సంబంధించిన అంశాల్ని రాశారు. కేవలం అలవాట్లను, ఆచారాలను ఎద్దేవా చేసే ప్రహసనం అది. కన్యాశుల్కం – బ్రహ్మవివాహం ఈ రెండింటి మధ్య సామ్యము లేదు. విషయ ఆలోచన పూర్తిగా భిన్నమైంది. కన్యాశుల్కంలో హాస్యం, పాత్రల చిత్రీకరణ, జటిలమైన ఒక కొత్త కథా సంవిధానం కోసం ప్రయత్నించాను' అని అప్పారావు గారు అన్నారు.

'కందుకూరి వారు ప్రహసనాల్ని ముఖ్యంగా సాహిత్య విలువల కోసం కాక, ప్రచారం కోసం, సామాజిక ప్రయోజనం కోసం ఉద్దేశించి రాశారు. అందుచేత వీరేశలింగం రచనలు సాహిత్యం సంబంధించి కాకుండా పోయాయి' అని ప్రముఖ కథా రచయిత చాగంటి సోమయాజులు (చా.సో) గారు అభిప్రాయపడ్డారు.

'సంఘంలోని కుళ్ళును తూర్పారబట్టాలనే ఉద్దేశం ప్రధానంగా పెట్టుకొని అప్పట్లో అప్పారావు గారే కాక వీరేశలింగం పంతులు గారు కూడా చాలా వ్యంగ్య రచనలు చేశారు. కాని ప్రచార వేగం చేతనో, ఏమో, వారి రచనలో గురజాడ వారి రచనల నుండి తొంగిచూసే మనోహరశిల్పం కానరాదు. అప్పారావు గారి రచనల్లో పదింతలు ఫలించిందనడానికి లోకమే సాక్షి' అని సుప్రసిద్ధ రచయిత్రి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు తెలియజేశారు. 'వీరేశలింగం పంతులుగారి సాహిత్యం, సంస్కరణ స్పృహకు అగ్రతాంబూలమిచ్చి, సాహిత్య కళా స్పృహకు రెండో స్థానం ఇచ్చింది. గురజాడ వారి సాహిత్యం కళా దృష్టికి మొదటి స్థానం ఇచ్చి, సంస్కరణ స్పృహకు రెండోస్థానం ఇచ్చింది. అందువల్ల నాటకం, కవిత, కథ మొదలైన ప్రక్రియలు గురజాడ రచనల్లో కళాకేతనాన్ని సమున్నతంగా స్థాపించుకున్నాయి' అని విఖ్యాత విమర్శకులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు అన్నారు.

మర్మం లేకుండా వున్నది వున్నట్లు చెప్పాలంటే కందుకూరివారు సంఘ సంస్కర్తగా వేసినంతటి బలమైన ముద్ర సాహిత్యంపై వేయలేకపోయారు. ఒక్కమాటలో చెప్పాలంటే కందుకూరి చైతన్యం సాంఘిక చైతన్యమే కానీ, సాహిత్య చైతన్యం కాదు. అంచేత ఆధునిక తెలుగు సాహిత్యానికి యుగకర్త వీరేశలింగం గారు కాజాలరు. గురజాడ రాసిన

కాలంలోనూ అంతకుముందు కూడా చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి లాంటి ఉద్దండ పండితులు ఎందరో వున్నారు. వారి రచనలు గొప్పవే వ్యక్తులు కూడా చెప్పుకోదగ్గవారే. అయితే మనిషికి ప్రాముఖ్యం ఇచ్చి అతని హృదయ స్పందనకు ప్రాధాన్యం ఇచ్చే వాడే రేపటి ప్రపంచానికి మార్గదర్శి కాగలుగుతాడు. గురజాడ మనకు ఇచ్చిన సందేశం కూడా ఇదే. గురజాడ ముందు సాహిత్యానికీ, తర్వాత సాహిత్యానికీ మధ్య వున్న తేడా కూడా ఇదే.

**గురజాడ – శ్రీశ్రీ :**

శ్రీశ్రీని యుగకర్తగా పేర్కొన్నవారు చాలామంది వున్నారు. గురజాడపై సాధికారికంగా రాసిన మొదటి వ్యక్తి శ్రీశ్రీ యే. గురజాడను తెలుగువారికి సమగ్రంగా పరిచయం చేసిన వ్యక్రి శ్రీశ్రీయే. గురజాడపై చక్కని అంచనా వేసింది కూడా శ్రీశ్రీయే. గురజాడ ఆధిక్యానికి కారణాలు శ్రీశ్రీ వివరించారు కూడా. అంతేకాదు 'నవ్యసాహిత్య జనకుడు' అని గురజాడని అభివర్ణించాడు. అక్కడితో ఆగక 'ఆయన రోడ్డు వేస్తే ఆ మార్గాన్ని తాను వెడల్పు చేశాను' అని శ్రీశ్రీ చెప్పుకున్నారు. 'అడుగుజాడ గురజాడది. అది భావికి బాట' అని శ్రీశ్రీ బల్ల గుద్ది మరీ చెప్పాడు. 'గురజాడ మార్గమే తన మార్గం' అని చెప్పిన శ్రీశ్రీ కూడా గురజాడలా ప్రజల భాషలో కవిత్వం రాయలేకపోయినందుకు బాధపడ్డాడు. అంతేకాదు 'నాకు గురువు గురజాడ' అని శ్రీశ్రీ అన్నారు. అలాంటప్పుడు ఎవరు ఆధునిక తెలుగు సాహిత్యానికి యుగకర్త అవుతారో మనం నిర్ధారించవచ్చు. ఇక్కడ చర్చకు తావు లేదు.



**శ్రీశ్రీని యుగకర్తగా పేర్కొన్నవారు చాలామంది వున్నారు. గురజాడపై సాధికారికంగా రాసిన మొదటి వ్యక్తి శ్రీశ్రీ యే. గురజాడను తెలుగువారికి సమగ్రంగా పరిచయం చేసిన వ్యక్రి శ్రీశ్రీయే**

అసలు విషయం ఏమంటే గురజాడ తర్వాత రెండు దశాబ్దాలకు 'మహా ప్రస్థానం' వచ్చింది. శ్రీశ్రీ ముందు భావకవి, తర్వాత అభ్యుదయ కవి, తదనంతరం విప్లవ కవి. శ్రీశ్రీ వర్గకవి. ఉద్యమకవి. ఉద్యమ కవిత్వం ఎప్పుడూ పరిమిత కాలనికి సంబంధించినదిగా ఉంటుంది. ఈ విషయాన్ని మనం మరిచిపోకూడదు.

భావాలపరంగా తన కాలానికి గురజాడ సాంఘిక దార్శనికుడు. తన కాలానికి శ్రీశ్రీ కవిత్వం పూర్తిగా నూటికి నూరుపాళ్ళు విప్లవ సందేశాత్మకం. సామాజిక అంశాల్లో గురజాడను, శ్రీశ్రీ ని పోల్చలేం. ఎందుకంటే ప్రధానంగా వర్గ చైతన్యమే శ్రీశ్రీ కవిత్వానికి దిక్సూచి. గురజాడది సామాజిక చైతన్యం. వర్గచైతన్యం పరిమితం. సామాజిక చైతన్యం విస్తృతం.

శ్రీశ్రీ రచనల్ని, గురజాడ రచనల్ని తులనాత్మకంగా అధ్యయనం చేస్తే గురజాడ

చనిపోయి ఇప్పటికి నూట మూడు* సంవత్సరాలు అయింది. అయినా గురజాడ రచనలు నిత్యనూతనంగా వున్నాయి. ఇన్ని సంవత్సరాలు గడిచినా ఆ రచనలకు ప్రజాదరణ వుంది. శ్రీశ్రీ రచనలకు అంత ప్రజాదరణ లేదు. అదే గురజాడ రచనల్లోని గొప్పతనం విశిష్టత కూడా. సామాజిక సహృదయ ప్రేక్షకుల హృదయాల్ని శ్రీశ్రీ కన్నా గురజాడే ఎక్కువ దోచుకున్నారు. ఒక్క వాక్యంలో చెప్పాలంటే శ్రీశ్రీ కన్నా గురజాడ అంటే ఎక్కువమందికి తెలుసు.



**గురజాడని – శ్రీశ్రీని వాళ్ళ వాళ్ళ రచనలతో కానీ, వ్యక్తిత్వంతో కానీ, ఇంకా అనేక ముఖ్యమైన అంశాలతో పోల్చి చూస్తే ఆధునిక తెలుగు సాహిత్య యుగకర్త గురజాడే అవుతారు.**

గురజాడని – శ్రీశ్రీని వాళ్ళ వాళ్ళ రచనలతో కానీ, వ్యక్తిత్వంతో కానీ, ఇంకా అనేక ముఖ్యమైన అంశాలతో పోల్చి చూస్తే ఆధునిక తెలుగు సాహిత్య యుగకర్త గురజాడే అవుతారు. ఇందులో ఎవరికీ ఏమీ అనుమానాలు, వగైరాలు అక్కరలేదు. అందుకే కొడవటిగంటి కుటుంబరావుగారు 'ఆనాడు అప్పారావు లేకపోతే ఈనాడు శ్రీశ్రీ వుండరు' అనే సత్యాన్ని ఎప్పుడో తేల్చి చెప్పారు.

శ్రీశ్రీని యుగకర్తగా అనేవాళ్ళు ఒక విషయాన్ని జాగ్రత్తగా గమనించాలి. శ్రీశ్రీ కూడా గురజాడ చైతన్యం నుంచి వచ్చిన వారే. శ్రీశ్రీ కూడా గురజాడ ప్రభావానికి లోనయినవారే. ఈ విషయం శ్రీశ్రీ గారే చెప్పారు. ప్రభావితుడు, ప్రభావం చేసిన వాడికి నాయకుడూ, అధినాయకుడూ, సమ ఉజ్జీ కాడు, కాలేడు. యుగకర్త అసలే కాలేడు. ఇది చరిత్ర చెపుతున్న పచ్చి నిజం.

**విమర్శ – పరామర్శ :**

కన్యాశుల్కం నాటకంలోని ఇతివృత్తం, పాత్రలు, రసం, నాటక లక్షణాలు, నాటక ప్రయోజనం, భాష మున్నగు విషయాలపై విమర్శలు చాలా వచ్చాయి. నాటకంలోని ఇతివృత్తానికి శాశ్వతం లేదన్నది ఒక విమర్శ. ఈ నాటకంలోని పాత్రలు సమాజంలో కన్పిస్తున్నాయి. ఈనాటికి కూడా గురజాడ పాత్రలు సజీవంగా వున్నాయి. అందుకు గిరీశం, రామప్పపంతులు, భీమారావు, నాయుడు, బైరాగి పాత్రలు మంచి ఉదహరణంగా మనం తీసుకోవచ్చు. కన్యాశుల్కంలోని వున్నది హాస్యం కాదని మునిమాణిక్యం గారు విమర్శించారు. దానికి ఘాటైన సమాధానం పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు ఇచ్చారు. 'ఒక కాంతం పాత్రను సృష్టించినందుకే మునిమాణిక్యం వారు తెలుగు వారి కృతజ్ఞతకు పాత్రులైనారు కదా! కన్యాశుల్కంలో కోటి సూర్యకాంతులున్నవి. కన్యాశుల్కంలో ఏమీ లేకపోయినట్లయితే వీరేశలింగం గారి ప్రహసనాలు, గ్రాంథిక వర విక్రయం, పానుగంటి వారి కంఠాభరణం లాగా ఏనాడో ప్రజల మధ్య లేక, రెండు అట్టల మధ్యనే జీవించి వుండలేదని' తీవ్రంగా ప్రతి విమర్శ చేశారు.

అంకాలు పెంచారు. పాత్రలు పెరిగాయి అనేది ఒక విమర్శ. కన్యాశుల్కంలో బాలవితంతు సమస్య ఎలా ముడిపడి వుందో, నిరూపించే ఉద్దేశంతోనే, వితంతువులు వేశ్యా సమస్యల వైపు ఎలా బలవంతంగా లాగబడుతున్నారో, వేశ్యా సమస్య అన్ని వర్గాలపైన, అన్ని వర్ణాలపైన, అన్ని వృత్తులపైన ఎలా ప్రభావం చూపుతుందో, సంఘ సంస్కరణోద్యమంలో ఈ సమస్య పరిష్కారం ఎందుకు కాలేదో ఇలా అన్ని విషయాల్ని విపులంగా వివరంగా లోతుగా చెప్పాలని అనుకున్నారు గురజాడవారు. అందుకే అంకాలు పెంచారు. పాత్రలు కూడా పెరిగాయి.

నాటకంలో మధురవాణి ప్రసంగాలు ఎక్కువగా చోటుచేసుకున్నాయి అనేది ఒక విమర్శ. కావాలనే మధురవాణి పాత్రను గురజాడ పోషించారు. తొలికూర్పులో కన్నా, రెండో కూర్పులో మధురవాణి పాత్రను పెంచి రాశారు. 'సదుద్దేశంతోనే మధురవాణి పాత్రను పోషించాను' అని గురజాడగారే చెప్పారు.

ఈ నాటకంలో ప్రాచీన నాటక లక్షణాలు లేవు అనేది ఒక విమర్శ. అసలు విషయం ఏమంటే గురజాడ వారు ఈ నాటకాన్ని ప్రాచీన నాటక లక్షణాల్ని దృష్టిలో పెట్టుకుని రాయలేదన్న విషయాన్ని మనం మరవరాదు. ఆధునిక కాలంలో పుంఖానుపుంఖాలుగా వెలువడే నాటకాలకు ప్రత్యేకంగా నూత్న లక్షణాల్ని ఏర్పరచుకోవలసి వున్నది. కన్యాశుల్కం నాటక విషయం కూడా ఇలాంటిదే. ఆధునిక నాటకాలకు ప్రాచీన నాటక లక్షణాలు అన్వయించవు.

ఆంగ్ల భాషాపదాలు నాటకంలో ఎక్కువగా వున్నాయి అనేది ఒక విమర్శ. గురజాడ ఆంగ్ల పదాలు వాడారు. ఇందులో వాడిన ఆంగ్ల పదాలు తెలుగువారి నిత్య జీవితంలో సమ్మిళితమై పోయిన పదాలే అన్న విషయాన్ని విమర్శలు గమనించాలి.

కన్యాశుల్కం నాటకం ద్వారా నాటకకర్త ఏమీ సాధించలేకపోయారు అనే వాళ్ళు కూడా వున్నారు. ఇది విచారించదగ్గ విషయం. ఏమీ సాధించకపోతే వందలసార్లు నాటకం ప్రదర్శనకు ఎలా నోచుకుంటుంది. అసలు ప్రజలు ఎందుకు చూస్తున్నారు. ఆ గ్రంథం అన్నిసార్లు ఎందుకు ముద్రణకు నోచుకుంది. విమర్శకులు ఈ విషయాలన్నీ తెలుసుకోవాలి. కావాలని రంధ్రాన్వేషణ చేస్తే అది విమర్శ అన్పించుకోదు. కువిమర్శ అవుతుంది. విమర్శకులు ఒక గ్రంథాన్ని విమర్శించదలచుకుంటే వాళ్ళ కోణంలో నుంచి కాక రచయిత ఏ దృష్టితో ఆ రచన చేశాడో ముందు తెలుసుకోవాలి. ఆ కోణం నుంచే ఆ గ్రంథాన్ని విమర్శించాలి. గురజాడ ఈ నాటకం ద్వారా సాహిత్య ప్రయోజనాన్ని, భాషా ప్రయోజనాన్ని సాధించారు. ఈ నాటకం ద్వారా ఏ ప్రయోజనం కనబడలేదంటే మీరు అవివేకులు. ఇప్పటికైనా గురజాడ రచనల్ని ఆ కాలం నాటి సామాజిక దృక్పథంతో తులనాత్మకంగా అధ్యయనం చేయాలి.

కన్యాశుల్కం ఒక వర్గానికి సంబంధించి ముఖ్యంగా అగ్రవర్ణాలైన బ్రాహ్మణులకు చెందిన నాటకమని ఒక విమర్శ సాహిత్య లోకంలో బలంగా వుంది. కాబట్టి ఇతర వర్గాల

వారు, ఇతర కులాల వారు ఈ నాటకం చదవవలసిన అవసరం లేదు అనే వాళ్ళు కూడా ఈ సమాజంలో వున్నారు. ఇది నూటికి నూరుపాళ్ళు అవగాహన లేనివాళ్లు కావాలని, పనికట్టుకుని, బురద జల్లాలని చేసే కువిమర్శ ఇది. ఆ కాలం నాటి సామాజిక పరిస్థితుల్ని మన కళ్ళముందు వుంచడానికి నాటకకర్త వివిధ పాత్రలతో మన ముందుకు వచ్చారు. అంతేకానీ ఈ నాటకం ఒక వర్గానికో, మతానికో, కులానికో, కొంతమంది అనుకున్నట్లు వ్యక్తులకో, సంబంధించినది కాదు. గురజాడవారు వీటన్నింటికీ అతీతుడు. ఈ విషయం ఆయన రచనల్ని విశాల దృక్పథంతో అధ్యయనం చేస్తే మనకు తేటతెల్లమవుతుంది. 'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును' అన్న దార్శనికుడు గురజాడ.



**కన్యాశుల్కం నాటకం ద్వారా నాటకకర్త ఏమీ సాధించలేకపోయారు అనే వాళ్ళు కూడా వున్నారు. ఇది విచారించదగ్గ విషయం. ఏమీ సాధించకపోతే వందలసార్లు నాటకం ప్రదర్శనకు ఎలా నోచుకుంటుంది.**

సమాజంలోని అన్ని అంశాల్ని ఒక రచయిత తన రచనలో చెప్పలేడు. అలా చెప్పిన వాడు సృష్టి పుట్టిన నుంచి ప్రపంచంలో లేడు. అది కుదరదు కూడా. ఇప్పటికైనా మీ వితండవాదాన్ని విడిచిపెట్టి, మంచి దృష్టితో విమర్శించడం అలవాటు చేసుకోండి. తీసుకున్న ఇతివృత్తం బట్టి, ఏ పాత్రలు సమాజం నుంచి తీసుకోవాలి అనే విషయాన్ని రచయిత ఆలోచిస్తాడు. మాకులం గూర్చి చెప్పలేదు. మా మతం గూర్చి ఈ నాటకంలో లేదు. మా వర్గాన్ని గూర్చి రచయిత కనీసమైనా పట్టించుకోలేదు అనేవి అర్థం లేని మాటలు. ఈ విమర్శ చర్చలో నిలవదు. ఆ దృష్టితో విమర్శ చేయడం తప్పు కూడా. మీదు మిక్కిలి కువిమర్శ అవుతుంది.

అందరూ అన్ని విషయాలు రాయలేరు. కొన్ని విషయాలు కొన్ని అంశాలు కొందరే రాయగలరు. ప్రతీ రచయిత సమాజంలోని అన్ని అంశాల్ని తన గ్రంథంలో రాయలేదని విమర్శ చేయడం అజ్ఞానానికి పరాకాష్ఠ. ఉదహరణకు గురజాడ, జాషువా గార్ల రచనలు తీసుకుందాం. ఇద్దరూ సమాజంలో, పాతుకుపోయిన తీవ్రమైన సమస్యల్ని ముఖ్యంగా తమ సమాజంలో ఒక కులంలో జరిగిన అన్యాయాల్ని, అక్రమాల్ని, మోసాల్ని, బాధల్ని ఎత్తిచూపారు. ఆ సమాజం బాగుపడాలని కోరుకున్నారు. అంతేకాక సమాజంలోని అన్ని వర్గాలవారూ, అన్ని కులాలవారు బాగుపడాలని మనసారా కోరుకున్నారు. ఆ ఇద్దరూ రచయితలు వాళ్ల గ్రంథాల్ని వాళ్ళ కులాల దృష్టితో రాయలేదు. సామాజిక దృక్పథంతో రాశారు. విమర్శకులు కూడా ఆ కోణం నుంచే అధ్యయనం చేయాలి. లేకపోతే కువిమర్శకులుగా సాహిత్యలోకంలో మిగిలిపోతారు. సాహిత్య విమర్శను తప్పుదోవ పట్టించినవారు అవుతారు.

సామాజిక దృక్పథంతో కాకుండా, ప్రజలకు ప్రయోజనం లేకుండా ఊహా ప్రపంచంలో

తిరిగి, రచనలు చేసిన రాయప్రోలు సుబ్బారావు గారు కానీ, సాంఘిక ఉద్యమదృష్టితో రచనలు చేసిన కందుకూరి వీరేశలింగంగారు కానీ, తమ సాహిత్య దీప్తితో జనాల్ని ఉర్రూతలూగించిన తిరుపతి వేంకట కవులు కానీ, స్త్రీ సమస్యల్ని ఇతివృత్తంగా తీసికొని రచనలు చేసిన చలంగారు కానీ, "ఈ శతాబ్దం నాది" అని సామ్యవాద సిద్ధాంతాల్ని తన కవిత్వం ద్వారా వెల్లడించిన శ్రీశ్రీ గారు కానీ, ప్రాచీన సనాతన సంప్రదాయ భావాలతో ఎన్నో సాహిత్య ప్రక్రియల్ని సృష్టించిన బహుగ్రంథ కర్త విశ్వనాథ సత్యనారాయణగారు కానీ, ఇంకా మరి కొంతమంది కానీ – అందరూ గొప్ప కవులే, అందరూ గొప్ప రచయితలే. అందరి రచనలు విశిష్టమైనవే. ఇందులో వాదోపవాదాలు లేవు. ఈ విషయంలో చర్చేలేదు. అందరిదీ ఒక్కటే మాట. అయితే తెలుగు సాహిత్యానికి సామాజిక చైతన్య దీప్తినీ, నవ్య తేజస్సునూ వాడుక భాషా సొగసుల్ని కలుగజేసిన మహానుభావుడు, మహాకవి, మేధావి, మార్గదర్శి అప్పారావుగారు. అంతేకాక ప్రముఖ సాహిత్య చరిత్రకారులు, సుప్రసిద్ధ విమర్శకులు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు చెప్పినట్లు మార్గదర్శకుడైన మహాకవి మాత్రమే యుగకర్త అవుతాడు. అంచేత ఆధునిక తెలుగు సాహిత్యానికి యుగకర్త గురజాడవారే అనే విషయం విస్పష్టం.

**ఆధార గ్రంథాలు :**

**ఆధునికాంధ్ర కవిత్వం – సంప్రదాయాలు – ప్రయోగాలు** – సి.నారాయణరెడ్డి

**మహాకవి, మహాపురుషుడు – గురజాడ అప్పారావు** – సెట్టి ఈశ్వరరావు

**మహోదయం** – కె.వి. రమణారెడ్డి

**కన్యాశుల్కం** – నూరేళ్ళ సమాలోచనం – విశాలాంధ్ర

**మన గురజాడ** – శ్రీశ్రీ

**గురజాడ గురుపీఠం** – ఆరుద్ర

**కన్యాశుల్కం** – నాటక కళ – సర్దేశాయి తిరుమలరావు

**తెలుగు సాహిత్య చరిత్ర** – వెలమల సిమ్మన్న

**తెలుగు సాహిత్య విమర్శ సిద్ధాంతాలు** – వెలమల సిమ్మన్న

**యుగకర్త గురజాడ (అముద్రితం)** – వెలమల సిమ్మన్న

గురజాడ జయంతి సంచికలు

గురజాడ వర్ధంతి వేడుకలు

గురజాడ ప్రత్యేక సంచికలు

దిన, వార, పక్ష, మాస పత్రికలు

***ఈ వ్యాసం 2018 లో రాసినది.** •

# గురజాడ సాహిత్యంలో దార్శనికత



-కొండ్రెడ్డి
వెంకటేశ్వర రెడ్డి
Ph: 99487 74243

ఆధునిక కవిత్వానికి అడుగుజాడ గురజాడ. ఈయన కవిత్వం రసజ్ఞతతో కూడిన దార్శనిక శక్తితో త్రికాల యుక్తమై రక్తికడుతూ అలరారుతుంది. అలతి అలతి పదాలతో లోతైన భావాలను పండించిన సాహిత్య విప్లవానికి వెన్నుదన్నై నిలిచిన నవయుగ వైతాళికుడు. వాడుక భాషకు వన్నె చిన్నెలద్దిన, మెత్తని తెలుగుపలుకులకు వెలుగులద్దిన విశిష్ట కవితాస్రష్ట. సామాజిక రుగ్మతలను చర్మచక్షువులతో మాత్రమే కాకుండా రసచక్షువులతోను తిలకించి ఆత్మావలోకనంతో అక్షరమై సాగిన వాడు. ఆస్తికతను, నాస్తికతను హేతుదృష్టితో పరిశీలించి సహేతుకమైన కవిత్వాన్ని అందించిన ఆధునికుడు. వీరి సాహిత్యంలో కవి విషయప్రపంచములో మునకలేచిన అనుభవం కనిపిస్తుంది. క్రాంతదర్శిగా, దార్శనికునిగా, వినూత్నరీతిలో పయనించి, చేపట్టిన సాహిత్య ప్రక్రియలన్నిటిని అద్భుతంగా పండించిన వైనం కవిపండితుల్లో వినిపిస్తుంది. వీరి కవిత్వంలో పదప్రయోగం సంక్లిష్టతకంటే విశిష్టతకే పెద్దపీట వేయబడినది. వీరి కలంనుండి జాలువారిన నాటకము, గేయము, వ్యాసము, కథానిక సామాజిక సంస్కరణలకు ఊపిరిలూదుతూ రసపుష్టి, చమత్కృతులతో సాగిపోయిన తీరు గమనించవచ్చును. ఈయన దార్శనికతే ఈయన సాహిత్యానికి సజీవతను సంతరించిపెట్టింది. కందుకూరి వీరేశలింగం సాంఘిక విప్లవాన్ని, గిడుగురామ్మూర్తి భాషా విప్లవాన్ని అవగాహన చేసుకుని తనదైన ముద్రతో సాహిత్య విప్లవాన్ని సృష్టించిన ద్రష్ట. అస్పృశ్యంగా పడివున్న వ్యావహారిక భాషకు అందాలద్ది అందలమెక్కించిన మేధావి. ఈయన కవిత్వం పదునెక్కడానికి స్పష్టత, సూటిదనం, భావాల్లో మేళవింపజేస్తూ నిర్భయత్వంతో కూడిన వ్యక్తీకరణకు వేగుచుక్కె నిలిచాడు. కవిత్వం భోగవస్తువు కాదు, ఉపయోగవస్తువుగా భావిస్తూ, సాహిత్యపు నిర్బంధాలను వెక్కిరిస్తూ, సంక్షుభిత జీవితపు నిశ్శబ్ద ఘోషలను వినిపించాడు.

గురజాడ ఆంగ్ల సాహిత్యాన్ని బాగా అధ్యయనం చేయటం వలన కొత్తగాలిని పీల్చుకున్నాడు, సరికొత్త చైతన్యాన్ని తనలో నింపుకోగలిగాడు. ఆ ఫలితంగానే 8921 లో కన్యాశుల్కం నాటకము 1910లో ముత్యాలసరాలు రచనలు చేశాడు. ఆస్తికతను, నాస్తికతను హేతుదృష్టితో పరిశీలించి సహేతుకమైన కవిత్వాన్ని అందించిన ఆధునికుడు.

'కొత్తపాతల మేలు కలయిక / కొమ్మెరుంగుల జిమ్మగా' తేటైన మాటలతో ముత్యాల సరములు గేయాల్ని' 1910, జూలైలో రాశారు. ఆంగ్ల పరిజ్ఞానమున్న గురజాడ లోతుగా ఆంగ్ల సాహిత్యాన్ని అధ్యయనం చేసి తెలుసుకున్న సత్యం 'కన్నుకానని వస్తుతత్వము/



కాంచనేర్వరు అంగిలీజులు / కల్లనొల్లరు; వారి విద్యల/ కరచి సత్యము నరసితిన్'.అంటారు. తెలుగుసాహిత్యం హేతుబద్ధం గాని అంశాలను భక్తిరూపంలో వ్యక్తీకరించడం మూఢనమ్మకాలను ప్రోత్సహించడమే అవుతుంది అనేది గురజాడ భావన.

అందుకే అంటారు 'కవుల కల్పన కలిమినెన్నో/ వన్నెచిన్నెలు గాంచువస్తువు/ లందు వెర్రిపురాణగాథలు / నమ్మజెల్లునె పండితుల్'. కవి పండితులు సాహిత్యంలో సత్యాసత్యాలను తెలుసుకోవాలి. గ్రుడ్డిగా పురాణాల్లో ఉన్న అంశాలను నమ్మరాదు అనే భావన గురజాడ దార్శనికతను పట్టిస్తాయి.

వీరి ఆలోచన ఎంత దార్శనికమైనదో, ధర్మబద్ధమైనదో ఎల్లరిలోను సౌభ్రాతృత్వ వాంఛ రేకెత్తించేదో తెలియజేస్తుంది. ఈ పద్యాలు 'యెల్లలోకము వొక్క యిల్లై / వేడుకలు కురియ' అనడం విశ్వమానవతా భావం ఎత్తిచూపడమవుతుంది. సర్వమతాల సమానత్వాన్ని ఆకాంక్షిస్తూ, మతముతో ఎవ్వడూ నిలిచి వెలగలేడని, జ్ఞానముతోనే మనిషి పూజింపబడతాడనే భావాన్ని వ్యక్తపరుస్తూ 'మతములన్నియు మాసిపోవును / జ్ఞానమొక్కటె నిలిచి వెలుగును / అంత స్వర్గసుఖంబులున్నవి / యవని విలసిల్లన్' అంటారు. సహపంక్తి భోజనాలతో సర్వులు వివక్షత వీడి విలసిల్లుతారనే భావనతో 'మొన్న పట్టమునందు ప్రాజ్ఞులు / మొట్టమొదటిది మెట్టు, యిదియని / వెట్టినారొక విందు, జాతుల / జేర్చి వినవైతో?' అంటారు.

మనిషిని మనిషిగా చూడలేని మనిషితనాన్ని ప్రశ్నిస్తాడు కవి. 1912 లో 'మనిషి' శీర్షికతో రాయబడిన కవితలో ప్రాణంలేని శిలలకు మ్రొక్కుతూ ప్రాణమున్న మనిషిని రాయిరప్పల కంటే హీనంగా చూడడాన్ని ఎత్తుచూపుతూ 'మనిషి చేసిన రాయి రప్పకి / మహిమ కలదని సాగిమొక్కుతు / మనుషులంటే రాయిరప్పల / కన్న కనిష్టం' అంటారు. కన్నుతెరిచి, మనసుబెట్టి చూచినట్లయితే 'బ్రతికి, చచ్చియు ప్రజలకెవ్వడు / ప్రీతిగూర్చునో, వాడె ధన్యుడు/' అంటారు 'డామన్, పితియస్' అనే కవితలో వ్యవహార భాషలో, సుతిమెత్తగా మందలిస్తూ ప్రబోధాత్మకంగా చెప్పిన దేశభక్తి గేయాల్లో.... 'దేశమును ప్రేమించుమన్నా / మంచి అన్నది పెంచుమన్న / వొట్టిమాటలు కట్టిపెట్టోయ్ / గట్టిమేల్ తలపెట్టవోయ్' అంటూ దేశాన్ని ప్రేమించడం, మంచితనాన్ని పెంచుకోవడం, నిష్ప్రయోజనమైన మాటల్ని కట్టిపెట్టడం, గట్టిప్రయత్నంతో మేలు తలపెట్టడం మనిషి లక్ష్యం లక్షణంగా చెప్పాడు కవి. ఈనాడు జగం ఘోషించేదదే!

మానవ సమైక్యత ఆవశ్యకతని చాటిచెబుతూ, కులమత భేదాలను వివక్షతను వీడి

సోదరభావంతో మెలగవలయును అంటూ 'చెట్టాపట్టాల్ పట్టుకొని / దేశస్థులంతా నడవవలెనోయి / అన్నదమ్ములవలెను జాతులు / మతములన్నీ మెలగవలెనోయి' అని ప్రబోధిస్తాడు.

'నా కులానికి నా మతానికి మాత్రమే దేశభక్తి ఉంది. మేం దేశభక్తికి పేటెంట్ హక్కు గలవారమని విర్రవీగవద్దు. వొట్టి గొప్పలు చెప్పవద్దు. ఒక్క మంచి పని జనానికి చేసి చూపెట్టు' అంటూ దార్శనిక దృష్టితో మనుషులు ఏవిధంగా ఉండాలో సూచిస్తాడు కవి.

'దేశాభిమానం నాకు కద్దని / వొట్టి గొప్పలు చెప్పుకోకోయి / పూని యేదైనాను వొకమేల్ / కూర్చి జనులకు చూపవోయి' అంటూ తోటివారికి సహాయపడాలి అంటే నీ స్వార్థాన్ని కొంత విడిచిపెట్టాలి. దేశాన్ని మట్టిగా కాకుండా మనుషులుగా చూడడం నేర్చుకోవాలి.

> 'నా కులానికి నా మతానికి మాత్రమే దేశభక్తి ఉంది. మేం దేశభక్తికి పేటెంట్ హక్కు గలవారమని విర్రవీగవద్దు. వొట్టి గొప్పలు చెప్పవద్దు. ఒక్క మంచి పని జనానికి చేసి చూపెట్టు' అంటూ దార్శనిక దృష్టితో మనుషులు ఏవిధంగా ఉండాలో సూచిస్తాడు కవి.

'స్వంతలాభం కొంతమానుకు / పొరుగువాడికి తోడు పడవోయి / దేశమంటే మట్టికాదోయి / దేశమంటే మనుషులోయి' అంటారు.

మతం వొక మత్తుమందు. ఇది యెన్నో నిజాల్ని దాచి పరమత సహనాన్ని కోల్పోయే విధంగా మనిషిని మారుస్తుంది. ఏ మతమైన మానవ జీవితాన్ని కోరాలి. 'మతం వేరైతేను యేమోయి? / మనసులొకటై మనుషులుంటే / జాతమన్నది లేచి పెరిగి / లోకమున రాణించునోయి' అప్పుడే మానవ సమాజం ఉన్నతస్థితికి వస్తుంది. మనిషి ఏవిధంగా తన సుఖసంతోషాలను జారవిడుచుకుంటాడో, తనకు ఏవిధంగా మేలు జరుగుతుందో చెప్తూ 'పరుల కలిమికి పొర్లి యేడ్చే / పాపికెక్కడ సుఖం కద్దోయి? / ఒకరి మేల్ తనమేలనెంచే / నేర్పరికి మేల్ కొల్లలోయి' అంటారు.

మానవునిలో చైతన్యం కలిగించి కార్యోన్ముఖుణ్ణి చేయువాడే నిజమైన కవి. సోమరితనంతో ఏది పట్టనట్టు వుంటే, దేశప్రగతికి భంగం కలుగుతుందనే దార్శనిక హెచ్చరిక ఎలా వుందో చూడండి! 'యీసురోమని మనుషులుంటే / దేశమేగతి బాగుపడునోయి / జల్దుకొని కళలెల్ల నేర్చుకు / దేశి సరుకులు నించవోయి' అంటూ అన్ని కళల్లో పరిశ్రమించి ఘనత కెక్కమంటాడు కవి.

పాడిపంట పొంగి పొర్లేదారి వ్యవసాయం. ఆ దారిలో పాటుపడితే దేశంలో తిండికి కరవులేకుండా ఉంటుంది. తిండి వుంటేనే మనిషికి కండ బలముంటుంది. శక్తిమంతుడే ప్రగతికి సోపానమవుతాడు. 'పాడిపంటలు పొంగిపొర్లే / దారిలో నువు పాటు పడవోయి / తిండి కలిగితే కండ కలదోయి / కండ కలవాడే మనిషోయి' అంటారు.

గురజాడ రాసే మాత్రా ఛందస్సు కవిత్వం ఆనాడు కొంతమంది కవులకు నచ్చలేదు.

విమర్శ చేశారు. గురజాడను కవిగా వారు భావించలేదు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ముందు తరం కవులకు వెనుకతరం కవులకు కవిత్వమంటే ఏమిటో చెప్పాడు గురజాడ. 'మెచ్చనంటావీవు: నీవిక / మెచ్చుకుంటే మించి పాయెను / కొయ్యబొమ్మలె మెచ్చు కళ్ళకు / కోమలుల సౌరెక్కునా?' అంటారు.

కవికర్తవ్యాన్ని అపూర్వమైన రీతిలో గుర్తుచేస్తూ, కవులు కవిత్వం రాయడమే కాదు, ఆయుధం కూడా పట్టాలి, ఉద్యమాల్లో ముందుండాలి అనేవాదం నేడు వినిపిస్తుంది. దీనికి సమాధానంగా కవి బాధ్యతలేమిటి ఎంతవరకు సమాజానికి తోడ్పాటివ్వాలి, అనే భావనతో 'ఆకులందున అణగిమణగీ / కవిత కోకిల పలకవలెనోయ్ / పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తవలెనోయ్' అంటారు. కవి ఏ పరిస్థితుల్లో ఎక్కడవున్నా చైతన్య గీతికలు వినిపించాలి రచించాలి. ఆ కవితాసారం చైతన్యాన్ని రేకెత్తించాలి. జనాన్ని ముమ్ముందుకు నడిపించాలి అనేది కవి భావన.

గురజాడ 1910లో రాసిన 'లవణరాజుకల' లో కులాన్ని గురించి ప్రస్తావిస్తాడు. 'మాలల్ని 'అంటరానివారిగా భావిస్తూ అగ్రకులస్థులు వివక్షత చూపేవారు. దాదాపు 110 సంవత్సరాల క్రితం ఎంతో దార్శనికతతో కులం కంటే మనిషికి గుణం ప్రధానం అనే భావాన్ని వ్యక్తీకరిస్తాడు కవి. 'లవణరాజు' చేత పలకరిస్తాడు. 'మలిన వృత్తులు మాలవారని / కులము వేర్చిన బలియు రొకదే / శమున కొందరివెలికి దోసిరి / మలినమే, మాల' – మాలలు పశుమాంసం తింటారని, పశువులను హింసిస్తారని వారిని ఊరికి దూరంగా పెట్టారు. కాని మనుషుల్ని హింసించేవారిది పెద్దకులంగా భావిస్తారని సమాజాన్ని ప్రశ్నిస్తాడు గురజాడ. 'కులము లేదట వొక్కవేటున / పసరముల హింసించువారికి కులము కలదట నరులవ్రేచెడి / క్రూరకర్ములకున్' అంటారు. సమాజానికి ఇంకా విప్పిచెప్తూ మంచిచెడ్డలు మనుజులందున / యెంచి చూడగ రెండు కులములు / మంచియన్నది మాలయైతే, మాల నే అగుదున్' 'మనుషుల్లో మంచి, చెడు అనే రెండు వర్గాలు ఉంటాయి, 'మంచి' మాలకులం అయితే, నేను కూడ మాలవాడినే' అంటాడు కవి. ఆ రోజుల్లో యింత నిర్భీతిగా ధైర్యసాహసాలతో బ్రాహ్మణ కులజుడైన గురజాడ ఈ మాటలనడం ఎంత గొప్ప ఆదర్శవాదో దార్శనికుడో తెలియజేస్తాయి ఈ భావనలు.

'కన్యక' కవితలో దౌర్జన్యపూరితమైన రాచరిక వ్యవస్థ దుర్మార్గాన్ని సమాజంలో అండలేని స్త్రీ దుస్థితిని అద్భుతంగా ఆవిష్కరించాడు. 'కన్యక' నిస్సహాయస్థితిలో రాజును శాపనార్థాలు పెడుతూ కాసులుంటేనే సరికాదు కనీసం మానవత్వం ఉండాలి మనిషికి అని చెప్తూ 'కాసువీసం కలిగి వుంటే / చాలుననుకొని / వీర్యమెరుగక, విద్యనేర్వక / బుద్ధిమాలినచో / కలగవా యిక్కట్లు?' అంటుంది.

యింకా అంటుంది :'కండకావరమెక్కినీవీ / దుండగము తలపెట్టినందుకు / వుండడా వొక దైవమంటూ / వుండి వూర్కొనునా?' అని ప్రశ్నిస్తుంది. ఇక్కడ గురజాడ ప్రశ్నించే తత్త్వాన్ని బాధితుల్లో రేకెత్తించడం ఈయన గొప్పతనం. ముందు ముందు అన్యాయాల్ని అక్రమాల్ని సామాన్య జనం సైతం ప్రశ్నిస్తారు అనే భావనే దార్శనికత.

'కన్యాశుల్కం' నాటకంలో గురజాడ, ఆనాడు బ్రాహ్మణ సమాజంలో బహుళంగా

జరుగుతున్న కన్యాశుల్క పిచ్చి బాల్యవివాహం చేసుకునే ముసలివరుడి ఆగడాలను అరికట్టడానికి, సాంఘిక దురాచారాన్ని మట్టుబెట్టడానికి నడుముకట్టి నిలిచాడు. కాటికి కాళ్ళు చాచే వృద్ధులు కాసులిచ్చి కన్యల్ని వివాహమాడడం వో పెద్దసమస్యగా మారిపోయిందనే భావనతో గొప్ప సాంఘిక నాటకంగా కన్యాశుల్కాన్ని తీర్చిదిద్దాడు. ఈ నాటకంలో ఇతివృత్తం స్వీకరణ, హాస్యరసపోషణ, పాత్రలను పండించడంలోకాని, భాషాప్రయోగపరంగా గానీ, సంభాషణల నిర్వహణగాని అద్భుతంగా మలచబడ్డాయి. ముందు తరాలకు ఈ నాటకం కనువిప్పు కల్గించబట్టే కన్యాశుల్కం దురాచారం అంతరించింది. వరకట్న దురాచారం దాని స్థానంలో ప్రవేశించింది. అది కొనసాగుతూనే వుంది.

మొదట్లో గురజాడ సంప్రదాయ రీతిలో పద్యాలు, ఖండకావ్యాలు రాశాడు. తరువాత పాతబాటలో కాకుండా కొత్తబాటలో కావ్యరచన చేయాలనుకున్నాడు. ముత్యాలసరాలు, ఖండకావ్యంలో లవణరాజుకల, కన్యక, పూర్ణిమ, లంగరెత్తుము, డామన్ పితియస్, దేశభక్తి గేయం, నీలగిరి పాటలు మొదలగు గొప్ప కవితలు రాశాడు. ఈయన కావ్యాలలో కథానాయికలు సామాన్యులు, పేదవారలు.

ఇవాల్టి కవుల్లో ఆవేశబలం తప్ప అనుభూతిచిత్రణ అరుదు. వాదాల బలం తప్ప ఆ వాదాలవెనుక దాగివున్న సామాజిక నేపథ్యం వివరణ శూన్యం. కాని గురజాడ కవిత్వంలో నిసర్గమైన ఒక ఉద్వేగభావ శబలత నిజాయితీ కనిపిస్తుంది. ఈయన కవిత్వంలో మార్మికత కంటే దార్శనికత గాఢంగా కనిపిస్తుంది. సామాజిక రుగ్మతలు రూపుమాపి సమాజాన్ని చైతన్యవంతంగా తీర్చిదిద్దాలనేది ఈయన సాహిత్యంలో దాగివున్న ఆర్తి, ఆవేదన.

ఈ కవిపై ధనిక వర్గం ఒక నిఘాకన్ను వేసివున్నా, నిబద్ధత గల రచయితగా ప్రజాపక్షం వహిస్తూ 'పాతసంధులు పాతిపెట్టుము / యుద్ధముల కవి, ఉనికిపట్టులు' అని హెచ్చరించాడు. చదువుకున్న మేధావులే వెర్రిభ్రాంతులతో మూఢవిశ్వాసాలకులోనై వాటిని వదిలించుకోలేరు అనే భావాన్ని చెప్తూ 'చదువు వారికి వెర్రిభ్రాంతులు / మెదడుకెక్కిన పాయవందురు / అదును లేదే దేనికైనను / అందరెరుగనిదే?' అంటారు. హేతుబద్ధంగా ఆలోచించినప్పుడే యథార్థమైన జ్ఞానసముపార్జన చేయవీలగుతుందని జ్ఞానసముపార్జన ద్వారానే మానవజీవితం సుఖతరం, ప్రయోజనకరం అవుతుందని నమ్మినవాడు గురజాడ.

గేయకవితా ప్రస్థానానికి ప్రవర్తకుడు గురజాడ. ఆయన ముత్యాలసరం ఆధునిక భావాలతో దార్శనికతతో తెలుగులో గేయకవిత్వ ప్రక్రియకు శ్రీకారం చుట్టింది. ఈయన గేయకవిత్వం సమాజపరమైన వేదనలను, రోదనలను బొమ్మకట్టించింది. గురజాడ కవితాజాడల్లో ప్రేమతత్వాన్ని వివరిస్తూ 'మగడువేల్పన పాతమాటది' అన్న అభ్యుదయపథగామి. గురజాడ. 'ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును / ప్రేమనిలిపిన ప్రేమ నిలుచును' అంటాడు. గురజాడ సాహిత్యం, దార్శనికత గల్గిన మానవతావాదం, సంఘసంస్కరణ దృష్టి, తెలుగుదనం, దేశభక్తి, విశ్వమానవ ప్రేమ పుష్కలంగా కలిగి తెలుగు ఆధునిక కవిత్వానికి దిశానిర్దేశం చేసేది దిక్సూచిగా పేర్కొనవచ్చును. ●

# గురజాడ సంప్రదాయ కవిత్వం



-డా|| అయ్యలసోమయాజుల గోపాలరావు
Ph: 96528 90660

పాఠశాలల్లో కఠిన గ్రాంథిక భాషకు బదులు సులభ భాషను ప్రవేశపెట్టాలన్న ఉద్యమానికి ప్రతిఘటన చెలరేగుతున్న సమయంలో గురజాడను, గిడుగును, జె. ఏ. ఏట్సును, పి.టి.శ్రీనివాస అయ్యంగార్లను "దుష్టచతుష్టయం" అని 'పేరుపెట్టి తూలనాడడం జరిగింది. ఆ సందర్భంలో గురజాడకు సలక్షణమైన తెలుగుభాష రాయడం చేతకాదు, వాడుకభాషలో రాయడం అందుచేతనే! అన్నదో అభియోగం.

కోవెల సుప్రసన్నాచార్య "గురజాడ ఒక సాధారణ కవి" అనే వ్యాసంలో నాలుగు అంశాలని చూపుతూ కవిత్వంలో మార్గపద్ధతిలో సుభద్రాపరిణయం రచించినా అది పరిపుష్టస్థాయికి చెందకపోవటం అన్నారు.

ముదిగొండ శివప్రసాద్‌గారు "విదేశీబానిసత్వమేనా! యుగకర్త లక్షణం" అనే వ్యాసంలో పూర్ణమ్మ గేయంలో ముడివేస్రి, చేప్రి, వంటి వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలుండటానికి కారణం ఆయనకు ఛందోవ్యాకరణాలపై పట్టులేకపోవడమే అన్నారు. విచారమేంటంటే గురజాడపై విమర్శకులు ఏమేమి వ్రాసినా ఈ అంశాలపై సుభద్రవంటి మార్గకవిత్వ రచనల్లో గురజాడ ప్రావీణ్యాన్ని ప్రధానంగా చర్చించకపోవడమే. ఇదే అంశాన్ని సెట్టి ఈశ్వరరావు తన సంపాదకత్వంలో ప్రచురించిన 'గురజాడ కవితల సంపుటిలో' సుభద్ర కావ్యాన్ని ప్రచురిస్తూ ఇలా రాసారు– "'సుభద్ర' అసమగ్రం. సంప్రదాయ కవిత్వం రాయడం చేతకాకపోవడం వల్ల దానికి పూర్తిగా భిన్నమైన కవిత్వం గురజాడ రాస్తున్నారని ప్రచారం జరిగింది. దానికి ఖండనగా, గురజాడ 'సుభద్ర' ను సంప్రదాయ పద్ధతిలో రాశారు. దీన్లో చక్కని నాటకీయత అడుగడుగునా ఎదురవుతుంది. సుభద్ర అంగాంగ వర్ణనకు కావలసినంత అవకాశం వుంది. కాని గురజాడ ఆ చాపల్యానికి లొంగక శృంగార ఘట్టాన్ని నిగ్రహంతో, హుందాగా నడిపారు. అర్జునుని ప్రేమించిన సుభద్ర, తాపసి అర్జునుడని ఎరగదు. కాని తాపసి పైకి పోతున్న మనసును నిగ్రహించుకొన్న ఘట్టం అమలినంగా నడిచింది. తాపసికి సదుపాయాలు చేసే పనికి తాను పోకూడదనుకుంటుంది. అప్పుడు రుక్మిణి తన వివాహ ప్రస్తావన తెచ్చి, సుభద్రను ఒప్పిస్తుంది. ఈ ఘట్టం ఎంతో బాగుంది. ఇక్కడితో అసంపూర్ణంగా యీ కావ్యం ముగుస్తుంది. పండితులు దీని మంచి చెడ్డలు శ్రద్ధగా పరిశీలించినట్టు లేదు యింతవరకూ.

ఈ సుభద్రాకల్యాణ కథను కావ్య వస్తువుగా తీసుకోవడం, దానిలో రుక్మిణీ కల్యాణ



ప్రసక్తి తీసుకురావడం ప్రాచీన శృంగార కావ్యరచనలో కొత్త పోకడకు పూనికలా కనిపిస్తోంది. ఇది పూర్తిచెయ్యక పోవడమే కాదు, మధ్యను పూరించకుండా వదిలి పెట్టిన భాగాలూ వున్నాయి. బలరాముని అమాయకత్వం, అర్జునుని ధర్మోపదేశం ఎంతో చమత్కారంగా నడిచాయి.

"కావ్యభాష ప్రాచీనమైనదై ననూ, కవి హృదయమాధునికమే! పద్యములలో అన్వయము, భావము, ధార నవీనములు. కొన్ని ఘట్టములలో భాషా నిర్బంధము కలిగినట్లు యధేచ్ఛ ముగా స్వతంత్రించి వాడిన ప్రయోగములు కలవు. "... ఒకొక్క పద్యమందొక్కొక్క రసము బోధించి పద్యావళి వ్రాసి నటుల స్పష్టపడుచున్నది." (రా.వి.స. పీఠిక. తేదీ 1.4 1939)"

గురజాడ సంప్రదాయ కవితలు ఐదు ఉన్నాయి. (1) సుభద్ర, (2). సత్యవ్రతిశతకము, (3) పుష్పలావికలు, (4) మాటల మబ్బులు, (5) మెరుపులు.

1. **సుభద్ర**: – అర్జునుడు తీర్థయాత్రలలో ద్వారకకు చేరుకోవడం, (శ్రీకృష్ణుడు యతివేషంలో ఉన్న అర్జునుని రైవతకాద్రిపై చాతుర్మాస్యదీక్షావ్రతంగా ఉండ మనడం, చెల్లెలు సుభద్రను మునిసేవకై బలరాముని అంగీకారముతో ఉంచడం, ఈ విషయం రుక్మిణికి తెలిపి రహస్యంగా ఉంచమని చివరకు అర్జునుడు సుభద్రను గాంధర్వవివాహం చేసుకోవడం, బలరామునికి నచ్చజెప్పి శ్రీకృష్ణుడు వారి వివాహం జరిపించడం ఇలా నడుస్తుంది కథ.

ఆంధ్ర మహాభారతంలో ఆదిపర్వం అష్టమాశ్వాసంలో 168 నుండి 210 పద్యాల వరకు నన్నయ్య రచనగా ఈ కథ అందగించింది. దక్షిణాంధ్ర యుగంలో ప్రముఖ కవిగా పేరుగాంచిన చేమకూర వెంకటకవి ప్రత్యేకంగా విజయవిలాసం ప్రబంధంలో ఈ ఘట్టం ప్రతిపద్య చమత్కృతితో అలరారుతోంది.

గురజాడ ఈ సుభద్ర కథను పూర్తిగా వివాహం వరకు వర్ణించలేదు. అర్జునుడు రావడం, బలరామ శ్రీకృష్ణులతో సంభాషణ, బలరాముడు అర్జునుని రైవతకంపై ఉండమని సుభద్రను పరిచర్యకై నియోగించడం, సుభద్ర యతిరూపం లోని అర్జునుణ్ని చూసి అర్జునభావంతో కొంత మనసుపడి తేరుకొని అతని సేవలకు వెళ్ళననడం, రుక్మిణి సుభద్రకు కొంత బోధ చేయడంతో రచన సమాప్తమవుతుంది.

కవితా విషయానికి వస్తే సంప్రదాయ కవిత్వంగా కందాలు, వృత్తాలు, ఆటవెలదులు, సీసాలు, అన్నీ చోటుచేసుకున్నా కంద పద్యాలే ఎక్కువగా అందగించాయి. కందం రాసినవాడే కదా కవి. ఈ విషయం మన విమర్శక శిఖామణులకు తెలియలేదు. ప్రబంధ కవులకు తీసిపోని రీతిలో గురజాడ వర్ణనలు ఎంతో హృద్యంగా వున్నాయి.

ఉదా: సుభద్ర అర్జునుని సమీపానికి సపర్యకై వచ్చిన ఘట్టంలో ఆమెను వర్ణించిన తీరు అమలిన శృంగారంగా అందంగా సాగింది.

**కస్తూరి గన్నేరు కావి చీర మెఱుంగు**
**మేని చాయకు వింత మిసిమి గొలుప**
**చెలరేగు ముంగురుల్ చేర్చి కట్టిన జోతి**
**యిరులపై రిక్కల కరణి వెలుగ**
**పైటపై దూగాడు పచ్చల హారముల్**
**చలదింద్ర చాపంబు చాడ్పు జూప**
**నిద్దంపు జెక్కుల దిద్దిన పత్రముల్**
**మకరాంకు బిరుదాల మాడ్కి వఱల**
**మెఱపు, కెమ్మబ్బు లోపల మెఱయునట్లు**
**వలిపమున మేల్మి మొలనూలు తళుకులీన**
**భద్ర నడతెంచె బంగరు పళ్లెరముల**
**బండ్లు బూవులు గొనుచు సపర్య కొరకు.**

ఈ ఘట్టంలో సుభద్ర అర్జున సపర్యకై వచ్చిన సందర్భంలో నన్నయ్య రచన చూద్దాం!

**క్వణదణు కింకిణీ కవిత కాంచన కాంచి కలాపమున్ రణ**
**న్మణికల నూపురంబులు సమధ్వని నొప్పగభక్తి పాదచా**
**రిణి యయి కన్యకాజనపరీత సుభద్ర తదద్రి పూజన**
**ప్రణతులు సేసె నింద్రసుతు, బార్థు నిజేశ్వరుగా దలంచుచున్.** **(ఆది. 2ఆ. 178)**

ఇక చేమకూర తన కాలంనాటి సాహిత్య స్వరూపంలో సుభద్ర రావడాన్ని ఇలా వర్ణించాడు–

**చందురు కావి పావడ పిసాళిరుచుల్ సరిగంచు చీరపై**
**జిందులు ద్రొక్క వేణి కటిసీమపయిన్ నటియింప జాళువా**
**యందెలు మ్రోయ జంటిరవికంటి చనుంగవ పిక్కటిల్లగా**
**చందనగంధి వచ్చె రభసమ్మున నమ్మునిరాజు సేవకున్** **(విజయ–2–180)**

ఈ మూడు పద్యాలను కవుల పేర్లు లేకుండా పేర్చి ఎవరెవరిది ఏ పద్యమో చెప్పగలమా!

అంటే సంప్రదాయ కవిత్వంలో గురజాడ స్థానం ఎంత వున్నతమో చెప్పగలమా! అక్కడక్కడ కొన్ని సందర్భాలు చూద్దాం.

సుభద్ర, అర్జునులను శ్రీకృష్ణుడు చూడడం ఎంత మధురంగా అలతి అలతి పదాలతో కూర్చాడో గురజాడ!

**కపట మౌని జూచి కన్నియ జూచుచు**
**గన్నె జూచి కపట మౌని జూచి,**
**చిత్త మలర దల చె జిత్తజ జనకుండు**
**నేడు గంటి నలువ నేర్పటంచు.**

ఇంకో సందర్భంలో కందాన్ని ఎంత అందంగా పొందుపరచాడో చూడండి.

**"విన్నాడట హరి యీనా**
**దున్నా దవతారమెత్తి యుర్వినని, యతం**
**దన్నాడట నీవే యని,**
**కన్నారగ నిన్ను గాంచగా నిటు వచ్చెన్."**

అలాగే మాట్లాడుతున్నట్లు కందపద్యాలు

**"పోనొల్లను యతి కడ కిక**
**గానిమ్మేమైన; నరుడు గానలలోనన్**
**గాని యగచాట్లు గుందగ**
**గానక నే దిరుగుచుంటి గఠిన హృదయనై."**
**"కారాదొకొ యతి యీశుడు**
**రారాదొకొ నిన్ను బ్రోవ రమణిరొ వటుడై**
**తా రాదొకొ యిటకు నరా**
**కారంబున నెంత యతికి గరుణ గలిగినన్".**

నన్నయ్య చేమకూరలు వర్ణించని విషయాన్ని గురజాడ ఇందులో సమకూర్చాడు. సుభద్ర తాను అర్జునుని పరిచర్యకు వెళ్ళలేనని నిర్ణయించుకున్న సందర్భంలో రుక్మిణి సుభద్రతో తప్పకుండా వెళ్ళమనిచెబుతూ యతివల్ల నీకు అర్జునుని దర్శనం కలగవచ్చు. నాకానాడు ఓ బ్రాహ్మణునివల్లేకదా శ్రీ కృష్ణుని భర్తగా పొందే అదృష్టం కలిగింది అనడం ఎంతో చక్కగా కథకు అన్వయించింది.

**"కోరి వరించితి గాదే**
**నారాయణు నేను నాడు నాతులతోనన్**
**బేరు బ్రతిష్ఠయు గాంచనె**
**పారుడొకడు కాదె నాకుఁ బట్టై నిలిచెన్."**

కథ అసంపూర్ణంగా ఉన్నా 3 భాగాల విభజనతో రచన నడిచింది. మొత్తం 78 పద్యాలలో 57 కందపద్యాలే. అంటే కందం గురజాడ చేతిలో మాకందం. అదే మనకందం.

2. **సత్యవ్రతి శతకం :**

ఆనందగజపతి మహారాజు ఒకనాటి ఇష్టాగోష్టిలో "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్" అనే సమస్యను కవులకు ఇచ్చారట. దానిని ఎంతమందో ఆనాడు పూరించారు. హరికథా పితామహుడు అష్టభాషా విశారదుడు ఆదిభట్ల నారాయణ దాసుగారైతే వంద కంద పద్యాలలో ఆశుధారణాశుధారతో నూరు విధాల పూర్తిచేసారట. ఏక సమస్యా పూరణలు నూరువిధాలుగా ఉన్న ఏకైక తెలుగు శతకం ఈయన సత్యవ్రతి శతకం.

ఆ సమస్యనే స్వీకరించి గురజాడ కూడా పూరించారు. సమస్య కందపద్య పాదం కాబట్టి కందాలే చెప్పాలి. ఈ సంపుటంలో 25 కందపద్యాలే ఉన్నాయి. అంటే ఇది పావుశతకం అన్నమాట.

ఆదిభట్లవారి మొదటి పద్యం:

**"హితమిత వాక్సంతతికిన్**
**దతభూత దయానురతికి ధైర్యోన్నతికిన్**
**జతుర మనీషా గతికిన్**
**సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్"**

గురజాడవారి మొదటి పద్యం:

**స్మితమతి సూచీ భేదిత**
**ఋత మౌక్తిక పదక శతక మిభపతి భాషా**
**సతి కతి కుతుకతగూర్చగ**
**సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.**

ఈ గురజాడకా ఛందోవ్యాకరణాలు తెలియవన్నది!

దాసుగారి చివరి పద్యం:

**చతురకళా విద్యాసం**
**గతికిన్ స్థిరధృతికి ప్రకటకరుణా మతికిన్**
**కృతియానందగజపతికి**
**సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.**

గురజాడవారిది:

**ధృతి గురు జాడల నరిగెడు**
**గతి పెద్దల జూప జనితి గజపతి త్రోవన్**
**కృతి కదె గౌరవమగుటన్**
**సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్.**

ఇందులో గురజాడ గురుజాడలు కూడా ఉండడం విశేషం. గురజాడవారి 25 పద్యాలు ఋతం, సత్యం గురించే వివరిస్తూ సాగాయి. సమస్య దానికి సంబంధించిందే కాబట్టి అందుకే ఈ శతకాన్ని ఋతశతకము అని కూడా అనడం వుంది. సంగీత సాహిత్యాన్ని సమ్మేళనం చేస్తూ...

**మతి వీణ మీటు నంతనె**
**ఋత తంత్రీ శ్రుతిని జేరి యింపుగ స్వరముల్**
**ప్రతి సంవాద మ్మిడునని**
**సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్**

3. **పుష్పలావికలు:**

పువ్వులు కోసి అమ్మే పూబోడులు పుష్పలావికలు. ప్రాచీనకాలంలోనే కాదు నేటికీ చాలా ప్రాంతాలలో ముఖ్యంగా తమిళదేశంలో స్త్రీలే పువ్వులమ్ముతారు. మన ప్రాచీన కవులందరూ ముఖ్యంగా ప్రబంధకవులు పుష్పలావికావర్ణన చేసినవారే. కావ్యంలో అష్టాదశ వర్ణనలు ఉండాలన్నది ఆలంకారిక నిర్ణయం.

**"పురసింధు నగర్త్వినశశి**
**సరసీవన మధు రతిప్రసంగ విరహముల్**
**పరిణయ తనయోదయ నయ**
**విరచన యాత్రాజి దౌత్య విభు వర్ణనముల్** (నరస. 2అ. 166)

అని ఆ అష్టాదశవర్ణనల్ని వివరించాడు భట్టుమూర్తి. అందులో మొదటిది పురవర్ణన. కావ్యకథా ప్రారంభంలో నగరాన్ని వర్ణిస్తూ అక్కడ పుష్పలావికల్ని వేశ్యల్ని వర్ణించడం చూస్తాం. పుష్పలావికల వర్ణనలో ప్రధాన పాత్రలు విటులు, పుష్పలావికలు. వారిమధ్య సంభాషణ సరస మధురంగా సాగుతుంది.

సాహితీ సమరాంగణ సార్వభౌముడు తన ఆముక్తమాల్యదలో పుష్పలావికల విటుల మధ్య సరసోక్తులను ఇలా వర్ణించాడు–

**వెలది! యీ నీ దండ వెలయెంత? నాదండ**
**కును వెలబెట్ట నెవ్వనితరంబు**
**కలువదావులుగాన మవి కదంబకవేణి**
**కలువతావులు వాడకయకలుగునె!**
**కడివోదు నాకిమ్ము పడతి యీ గేదంగి**
**నన గడివోమి ముందరికి జూడు**
**జాతులేవంబుజేక్షణ! పద్మినులు సైత**
**మునునున్నయెడ జాతులునికి యరుదె!**
**యనుచు, దొలినుడి నభిలాష లెనయమూగి**
**పలుకుతోడనె నర్మగర్భంబుగాగ**
**నుత్తరము పల్లవశ్రేణి కొసగు చలరు**
**లమ్ముదురు పుష్పలావిక లప్పురమున. (1ఆ. 19)**

వివరణ చాలా వుంది కాబట్టి సహృదయులు మూలగ్రంథాన్ని చూస్తారని ఆశిస్తాను. అంతా శ్లేష చమత్కృతి నడుస్తుంది.

రామరాజ భూషణుడు వసుచరిత్రలో–
**"పొన్న పూవొడినేల పొదవితేచెలి!**
**యది పొడమె బల్ దీవిపై పొదువలదె" (1–109)**

**చేమకూర:**
**ప్రాయపు నాయకుల్ వెలనెపాన నెగాదిగచూడ నేర్పులా**
**రాయవి, దండమీద గొసరం దొరకొంటిరి మంచిసాములే**
**పో, యటులైనచో సరముల్గద మీకిపుడంచు నప్పురిన్**
**కాయజు తూపులమ్ముదురు కందువమాటల పుష్పలావికల్ (1–79)**

ఈ నేపథ్యంలో గురజాడ పుష్పలావికల్ని చూద్దాం.
**వెన్నెల గాయు కుందములు వేళ నెరుంగక బూయు కల్వలున్**
**జున్నులు జూరగా గుడిపి చొక్కుల నెక్కుడు తేల్చు తమ్ములున్**
**జెన్ను వహించె నీ కడను చేరగ నిమ్మిక యన్య మేలనే**
**వెన్నుని యాన యిచ్చెదను వేడిన నంద్రు కామినుల్.**

**నీ దండ చిక్కువడెనే**
**నాదండలు చిక్కటన్న నగరే ప్రాజ్ఞుల్**
**నీ దండ నుంచి కొనుమా**
**వాదుడుగు మటందు రచటి వనితలు విటులున్.**
**చూతము మీ మీ జాతుల**
**నాతిరొ యన విటులు బల్కె నగి లావికలున్**
**ప్రీతిగలదేని జాతులు**
**జూతురె మా జాతులెల్ల జోద్యము లనరే.**

చిన్న విరోధాభాసతో చక్కని సూక్తితో చెప్పిన ఈ పద్యం ఎలా అమరిందో చూడండి.
**కుసుమ శర విద్ధు లయ్యును**
**కుసుమంబులె కొందు రచటి కోవిదులు విటుల్**
**విషమునకు మందు విసమగు**
**నసమాయుధు వేటు తీట లలరులె మాన్పున్.**

చివరగా ముగింపులో గురజాడ మగవారి మక్కువలెలా వుంటాయో చివరకి ఏమవుతాయో కూడా చెప్పడం అద్భుతం.
**చక్కదనంబు నశ్వరము సత్యమె మక్కువ లెల్ల కాలమున్**
**మిక్కుటమై చెలంగునొకొ, మిత్రమ చీమలు చుట్టుముట్టుచుం**
**జక్కెర చెల్లుదాక బలు సందడి జేయుచు వీడు కైవడిన్**
**జొక్కపు ప్రాయ మేగు తరి సున్న కదా మగవారి మక్కువల్!**
ప్రబంధకవులకు దీటుగా ఇలా చక్కని చిక్కని పద్యాలు రాసిన గురజాడకు మనమివ్వవలసిన స్థానం ఏది!

4. **మాటల మబ్బులు:**
ఇందులో 4 పద్యాలలో గురజాడ లోక రీతుల్ని వేమనలా విప్పి చెప్పాడు. అందుకే శ్రీశ్రీ అన్నాడు, తిక్కన వేమన గురజాడ ముగ్గురే కవులని.
**దబ్బరలుం గొండెమ్ములు**
**మబ్బువలెం గ్రమ్మ మాయ మాటల తీపున్**
**నిబ్బరము మొండితనమును**
**నబ్బురమగు విద్య లచటి యధికారులకున్.**

**తన కొంక మేలు చేకురగ తక్కినవారికి గీడు సేయుటల్**
**మనమున లేని భక్తి యభిమానము మాటలలోనె చూపుటల్**
**గొనకెటు లాభముల్ గలుగు? గొంకక నాటక మాట సాగుటల్**
**ధనమునకు న్మహోన్నతికి దారులు రాజ గృహాంతరంబులన్.**

**కెంజిగురుల కోయిల, సుమ**
**మంజరులన్ దేటి గముల-మనుజ ఖగములన్**
**మంజుల ఫలముల, చూతమ!**
**రంజించెద వితర తరులు రా వాదుకొనన్.**

**విధి వశమున నీ చెంతకు**
**మధుపము రా హేళనంపు మాటాడకుమా**
**మధు వొలుకు జలజ కులముల**
**కధికపు నెయ్యుడగు కుటజమా! తెలియు మెదన్.**

మొదటి పద్యంలో అధికారుల మాయమాటల స్వభావాన్ని రెండవ పద్యంలో రాజగృహాల్లోకి దారులను, మూడవ పద్యంలో చూతవృక్ష విషయాల్ని, నాల్గవ పద్యంలో పుష్పాన్నుద్దేశించి తుమ్మెదవస్తే రావద్దనకుమా అనడంలో అన్యాపదేశంగా ఇలా లోకరీతుల్ని పేర్కొన్నాడు.

**5. మెరుపులు:**

ఆరు పద్యాలున్న ఖండిక. ఇది సూక్తిముక్తావళిలా గోచరిస్తుంది. ప్రాచీన కవుల సుభాషితాలకు వివరణగా సాగిన తెనుగు సేత ఇది.

**"దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వముచితజ్ఞతా!**
**అభ్యాసేన న లభ్యంతే చత్వారః సహజాగుణాః॥**

ఈ ప్రసిద్ధమైన శ్లోకాన్ని గురజాడ ఇలా తెలిగించాడు.

**ఈవియు దియ్యని మాటయు**
**భావంబున జేయ తగిన పని తెలియుటయున్**
**ఠీవియగు ధైర్య భావము**
**రావు సుమీ యొకని వలన రావలె తనతోన్.**

కాళిదాసు అభిజ్ఞానశాకుంతలంలో దుష్యంతుడు దుర్వాసుని శాపవశంగా కణ్వాశ్రమంలో శకుంతలను గాంధర్వవివాహం చేసుకొన్న సంగతిని మరిచిపోతాడు.

శకుంతల సభలోకి వచ్చి దుష్యంతునితో తమ కలయికను గుర్తు చేస్తున్నప్పుడు దుష్యంతుడన్నట్లుగా ఈ శ్లోకం–

**స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు**
**సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః**
**ప్రాగ న్తరిక్ష గమనాత్స్వమపత్యజాత**
**మన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయన్తి.**

ఎవరూ నేర్పకుండానే తెలివిగా ప్రవర్తించడం పశుపక్ష్యాదుల్లోనే ఉన్నప్పుడు మనుష్యుల్లో వేరే చెప్పాలా? కోకిల తన పిల్లలు ఎగిరేవరకు కాకిగూడులోనే గుడ్లుపెట్టడం చూడలేదా! ఈ భావాన్ని గురజాడ ఇలా చెప్పాడు.

**మానిసులు గాని యింతుల**
**తా నేర్చని నేర్చు చెలగు తరి జెప్పంగా**
**జ్ఞానవతుల కగునె పికము**
**దాని శిశువు బెంచు నెగురుదాక నొరు చేన్.**

కాశ్యాం మరణాత్ ముక్తిః అంటారు. ఇదే భావంగల ప్రసిద్ధ శ్లోకాన్ని గురజాడ ఇలా తెలుగుచేశాడు.

**కాశి జచ్చెనేని కలుగదు జన్మంబు**
**కలిగెనేని నుదుట కలుగు కన్ను**
**సిరసు నందు చిన్న సిరి తోడు బుట్టవు**
**కంఠసీమ వెలయు గరళ చిహ్న**

**కాశ్యా మవశ్యం త్యజతాం శరీరం**
**శరీరిణాం నా స్తి పునశ్శరీరం**
**యద్యస్తి కంఠే గరళం లలాటే**
**విలోచనం చంద్రకళాచ మౌళౌ.**

బంగారానికి పరీక్షాస్థానం అగ్ని. ఈ విషయాన్నే ధనంజయే హాటక సంపరీక్షా అన్నారు. అంతేకాదు ఇంకా దానికి నాలుగురకాల పరీక్షలున్నాయన్నారు.

**యథా చతుర్భిః కనకం పరీక్ష్యతే**
**నికర్షణచ్ఛేదన తాప తాడనైః**
**తథాచతుర్భిః పురుష పరీక్ష్యతే**
**కులేన శీలేన గుణేన కర్మణా.**

మూల శ్లోకంలోని భావాన్ని వివరిస్తూ మనిషికి కూడా కులం, శీలం, గుణం, కర్మలనుబట్టి నాలుగు విధాల పరీక్షతో గొప్పతనం కలుగుతుందనడం గురజాడ గొప్పతనం!

**నాల్గు రీతుల గనకంబు నాడెమగును**
**వేటు గీటుల తునియించి వెచ్చజేసి**
**నరుడు నట్టుల నాల్గింట నాడెమగును**
**కులము శీలంబు కర్మంబు గుణము చేత.**

సత్యవ్రతి శతకాన్ని మకుటంతో పూరించడాన్ని గురజాడ కందపద్యాల అందాన్ని చూసాం. సమస్యాపూరణం కూడా అతనికి గల ప్రజ్ఞగా మరో సందర్భం. రీవా రాణి అప్పలకొండయాంబకు సమస్యా పూరణం అంటే చాలా ఇష్టమట. "వెలవాల్గంటికుమారులౌదురుగదా విప్రోత్తముల్ రావణా" అనే సమస్యను ఆమె ఆస్థాన పండితులకిచ్చారట. దానికి గురజాడ పూరణ ఇది అని కె.వి.ఆర్. మహోదయంలో పేర్కొన్నారు.

**కలిచేతన్ విమతిత్వమొందుచు మహాకామాంధకారంబునన్**
**కులధర్మంబు పరిత్యజించి గణికన్ గూడిమ్మ అమ్మా నినున్**
**బలుమార్వేడెద మంచు బల్కెదరహో పాండిత్యమూహింపకే**
**వెలవాల్గంటి కుమారులౌదురుగదా విప్రోత్తముల్ రావణా.**

పైవిధంగా గురజాడ సంప్రదాయకవిగా ప్రాచీనకవులకు పోటీగా దీటుగా, సాటిగా చిక్కని కవిత్వం పలికిస్తే అతనికి ఛందస్సు, వ్యాకరణం, సంప్రదాయం అన్నవేవీ తెలియవు అందుకే వ్యావహారికభాషలో రాసేడనడం ఎంతవరకు సమంజసమో సహృదయులు భావించండి. ఆ అన్నవాళ్లైనా అవేవీ తెలియనివాళ్ళు కారు. అయినా అన్నారంటే వాస్తవాన్ని కప్పి పుచ్చి కేవలం కవి మీద ద్వేషంతో అక్కసుతో ఈర్ష్యతో అన్న కువిమర్శే కానీ మరేమీ కాదు. నేడింతగా ఈ విషయాన్ని వివరించవలసిన అవసరంలేదు కానీ ఏదో ఉండబట్టక చాపల్యంతో రాసాను. ●

"నీ అవగాహనను
ఉపయోగించుకునే ధైర్యం అలవర్చుకో"

–శ్రీ గురజాడ వేంకట అప్పారావు

# గురజాడ ప్రేమతత్వం



డా. కాత్యాయని విద్మహే
Ph: 94405 50379

**"ప్రేమ పెన్నిధిగాని,ఇంటను నేర్ప
రీ కళ, ఒజ్జలెవ్వరు లేరు,
శాస్త్రము లిందు గురించి తాల్చె
మౌనము; ..." ( గురజాడ – కాసులు )**

ప్రేమ ఒక కళ. ఇంట్లో నేర్పించరు, బయట నేర్పించే ఉపాధ్యాయులు లేరు. శాస్త్రములు చదివి తెలుసుకుందామంటే అవి ఏమీ చెప్పవు. అలాంటప్పుడు ఈ సమస్యకు పరిష్కారం వెతుక్కోవలసినది ఎక్కడ ? సాహిత్యంలోనే అన్నది నిస్సంశయం. జీవితంలోని ఖాళీలను పూరించటమే సాహిత్యం పని కదా!? "కాసులు" కవితలో నాయకుడు కూడా "నేను నేర్చితి భాగ్య/ వశమున; కవుల, కృపగని హృదయ/ మెల్లను నించినాడను ప్రేమ /యను రతనాల – కొమ్మ !" అని చెప్పుకొన్నాడు. అంటే కవిత్వం చదివి, సాహిత్యం చదివి ఎన్నింటినో నేర్చుకోవచ్చునన్నమాట. ఇది గురజాడ మాట. ఆ బాటలో అదే గురజాడ సాహిత్యాన్ని పరిశీలించి ఆయన నిరూపించిన ప్రేమతత్వం ఏమిటో తెలుసుకొనాలని కలిగిన కుతూహలం ఫలితం ఈ వ్యాసం.

భారతీయులకి ప్రేమ ఆధునిక భావన. ప్రాచీన భారతీయ శాస్త్రాలు, సాహిత్యం కామం, కోరిక, శృంగారం అనే మాటలను వాడినట్లు ప్రేమ అనే మాటను ప్రయోగించినట్లు కనబడదు. కామాన్ని తృతీయ పురుషార్థంగా చెప్పారు. ప్రియము అనే మాట ఇష్టం, స్నేహం అనే అర్థంలో ప్రయోగించబడింది కానీ ప్రేమ అనే మాటకానీ, దానిచుట్టూ ఉన్నభావజాలం కానీ పూర్తిగా కొత్తవి. ఫ్రెంచ్ విప్లవానంతరం ప్రచారంలోకి వచ్చిన స్వేచ్ఛ, సమానత్వ స్వాతంత్ర్య భావనలు, పారిశ్రామిక విప్లవానంతరం ప్రపంచ రాజకీయార్థిక వ్యవస్థలలో వచ్చిన పరిణామాలు, పెరిగిన వ్యక్తి ప్రాధాన్యత 'ప్రేమ'ను మానవ సంబంధాలలో కీలకమైన అంశంగా అభివృద్ధి చేశాయి.

అటు సంస్కృత భాషా సాహిత్యాలను, ఇటు ఆధునిక భాషా సాహిత్యాలను మాత్రమే కాక చరిత్ర, సమాజం మొదలైన విషయాలను లోతుగా అధ్యయనం చేసి గాఢమైన అనుభవాన్ని పొంది, నిర్దిష్టమైన అభిప్రాయాలను ఏర్పరచుకొన్న గురజాడ 20 ఏళ్ల వయసుకు ఇంగ్లీష్‌లో కవిత్వం వ్రాయటం మొదలు పెట్టాడు. సామాన్యుల దైనందిన జీవితాన్ని సాహిత్య వస్తువుగా చేసిన వర్డ్స్ వర్త్ వంటి కవుల కవిత్వ సారాన్ని ఆస్వాదించ గలిగాడు. అభినందించగలిగాడు. ఆ క్రమంలో ఆధునిక ప్రేమ భావనను అందిపుచ్చుకోగలిగాడు. గురజాడ సమగ్ర సాహిత్యంలో ప్రేమ గురించి అక్కడక్కడా ఇచ్చిన నిర్వచనాలు, చేసిన వ్యాఖ్యానాలు పరిశీలించి చూస్తే గురజాడ ప్రేమతత్వం నిగ్గు

తెలుతుంది.

రకరకాల అంశాల మీద గురజాడ తనలో తాను తిప్పుకొంటున్న ముడి ఆలోచనలను 'మై ఓన్ థాట్స్' అనే శీర్షిక కింద వ్రాసిపెట్టుకొన్న నోట్స్ రచనా కాలం జీవితకాలమే తప్ప నిర్దిష్టంగా లేదు. ఆ నోట్స్ లో ప్రేమ గురించిన ఆలోచనలు కూడా ఉన్నాయి. మానవాత్మ యొక్క కాంతిమంతమైన పుష్పం ప్రేమ అంటాడు. ప్రేమ అంటే పిచ్చికాదు, తీవ్రమైన భావావేశమూ కాదు. ప్రేమ అంటే అందమైన స్వభావం నుండి ప్రకాశమానం అయ్యే సౌందర్యాన్ని, స్ఫటిక స్వచ్ఛత గల అనురాగమయ ఆత్మలను, దయను, శాంతాన్ని, ప్రశాంతతను ఆరాధించటం అని భావించాడు.

సౌదామిని నవల వ్రాయటానికి వ్రాసుకొన్న నోట్స్ కూడా నిర్దిష్టమైన రచనా కాలం లేనిదే. ఇందులో ప్రేమ దానంతట అది, అంతకన్నా అధికమైనదానితో రూపాంతరం చెందుతుందని, అందులోని ప్రమాదాలనూ గుర్తిస్తుందని, ప్రేమలో దోషాలు సైతం సౌందర్యాన్ని పొందుతాయని, అజ్ఞానం కూడా సుగుణమే అవుతుందని చెప్పాడు. ప్రేమ అంటే ఎటువంటి ఆరోపణ లేకుండా మనుషులను ఆమోదించే అత్యున్నత మానవ తత్వంగా గురజాడ ప్రతిపాదించినట్లు కనబడుతుంది. (గురుజాడలు, పు;909) సౌదామిని నోట్స్ లోనే మరొక చోట "ప్రేమించటం అంటే స్నేహం చేయటం. అంతకన్నా ఎక్కువ మరేమీ ఆశించకపోవటం. ప్రేమిస్తున్నవ్యక్తికి హాని కలిగించకపోవటం" అని కూడా చెప్పాడు గురజాడ. (గురుజాడలు, పు;912)



గురజాడ ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపిన 159 మందిలో (గురుజాడలు, మనసు ఫౌండేషన్,2012) ఒంగోలు ముని సుబ్రహ్మణ్యం ఒకడు. ఆయన విజయనగరం కాలేజీ విద్యార్థి. గురజాడ సహాయ సహకారాలతో చదువు పూర్తి చేసుకొన్నాడు. గురజాడ సాహిత్య వ్యాసంగాన్ని సన్నిహితంగా చూస్తూ అభిమానించాడు. అతను బిఎ పూర్తి చేసుకొని స్వస్థలం నెల్లూరు వెళ్ళిపోయిన తరువాత 1909 నుండి వాళ్ళిద్దరి మధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగాయి. గురజాడ వ్రాసిన లేఖలు అనేకానేక సాహిత్య సామాజిక కళా శాస్త్ర విషయాలు చర్చిస్తూ సుదీర్ఘంగా సాగాయి. అట్లా చర్చించబడిన విషయాలలో 'ప్రేమ' కూడా ఒకటి.

గురజాడ ఒంగోలు ముని సుబ్రహ్మణ్యానికి 1909 మే 21 న వ్రాసిన ఉత్తరంలో 'సాహిత్యం కేవలం స్త్రీపురుష శారీరకవాంఛలు, కామప్రవృత్తితోనే ఎందుకు నిండి

ఉండాలి' అని ప్రశ్న వేసాడు. 'ప్రేమ యౌవనంలో ఉన్న ఆడదానిమీదే తప్ప చీకాకులతో జీవితంలో వొడలిపోయిన యాభైఏళ్ల ముసలి దానియందు ఎందుకు కలగదు' అని తర్కిం చాడు. ప్రేమ యౌవనాన్ని ఆశ్రయించుకున్నది అయితే అది చాలా సంకుచితం అని గురజాడ భావం. 'తన కాల పరిమితులకు లోబడి క్రీస్తు ఏ మానవ ప్రేమ గురించి చెప్పాడో, బుద్ధుడు తన జీవితకాలంలో ఏది నమ్మి బోధించాడో, షెల్లీ దేనిని కళావిలాసం, కవితాత్మక సత్యం అని వ్యాఖ్యానించాడో– అది నిజమైన ఆదర్శ ప్రేమ అవుతుంది.' అని గురజాడ అభిప్రాయ పడ్డాడు.

క్రైస్తవం ప్రకారం ప్రేమ అంటే భగవంతుడు మనలను ప్రేమించినట్లు, మనకోసం సర్వం వదులుకొన్నట్లు మనం కూడా అందరినీ ప్రేమించటం, అందరికోసం బాధలు పడటానికి సిద్ధంగా ఉండటం. ప్రేమ షరతులు, నిబంధనలు లేనిది. ద్వేషానికి, అగౌరవానికి వ్యతిరేకంగా మనుషులను కలిపి ఉంచే బంధం. మనుషులను సాధికారులుగా, మహోన్నత మానవులుగా మార్చే శక్తి.

బౌద్ధం ప్రకారంస్వార్థ స్పర్శ లేకుండా మరొక జీవికి ఇచ్చేది అసలైన ప్రేమ. ఇతరులకు మన వల్ల ఏమాత్రం కష్టం లేకుండా చూసుకొనటం, వాళ్లకు సంతోషాన్ని కలిగించటానికి ప్రయత్నించటం అనే రెండు పార్శ్వాలు ఉంటాయి దానికి. స్నేహం, కరుణ, సంతోషం, ఉపేక్ష(ఎవరేమి చేసినా అందరినీ ఆమోదించటం) అనే నాలుగు మౌలిక అంశాలు ప్రేమలో కీలకమైనవి. బౌద్ధాన్ని తుడిచిపెట్టటం ద్వారా భారతదేశం మత విషయకంగా ఆత్మహత్య చేసుకొన్నదని గురజాడ అన్నాడంటే దేశం నిజమైన విశ్వమానవ ప్రేమ స్వభావాన్ని కోల్పోయిందని సూచిస్తున్నాడన్న మాట. పరిణామంలో అది విద్వేష రాజకీయంగా వికృతరూపాన్నితీసుకొనటం వర్తమానంలో మనం చూస్తున్నాం.

షెల్లీ ప్రేమకవి. ప్రేమను అనేక రంగులలో దర్శించినవాడు. లైంగిక,కాల్పనిక ప్రేమ, విశ్వమానవ ప్రేమ. మానవుల అంతిమ గమ్యం అదే.( shelley; a poet of love css forums.. ఇంటర్నెట్ సోర్స్) మానవజాతికి సంబంధించిన సమస్త బాధ్యతలను స్వీకరించటం ప్రేమ. ప్రేమను ఆరాధించటం మానవుల పాపాలన్నిటినీ మాయం చేస్తుంది. సమాజంలో మనుషుల మధ్య సంబంధాన్ని దృఢతరం చేసి సామరస్యం ద్వారా సంతోషాన్ని పొంద టానికి ఉపయోగ పడుతుంది అన్న షెల్లీ భావాలను గురజాడ ఉటంకించాడు. ఈరకంగా గురజాడ ప్రేమతత్వం ఈమూడు మూల శక్తుల నుండి అభివృద్ధి చెందింది. అదే సంవత్సరం జూన్ 2 న ఒంగోలు మునిసుబ్రహ్మణ్యానికే వ్రాసిన ఉత్తరంలో ప్రేమ ఒక్కటే సాధారణ మానవజీవన సూత్రం అని, ప్రేమ మనిషిని మరీమరీ సంతోష పెడుతుందని, మనం సాటి వాళ్ళపట్ల చూపే ప్రేమ మనకు ప్రేమను సంపాదించి పెడుతుందని చెప్పాడు గురజాడ. ప్రేమ అంటే గురజాడ దృష్టిలో సాటి మానవుల సుఖదుఃఖాలకు స్పందించి వారికి ఏమాత్రమైనా ఊరట కలిగించటానికి చూసే మానవీయ ప్రతిస్పందన అన్నది స్పష్టం.

ప్రేమ అంటే పిచ్చిగా, తీవ్రమైన భావావేశంగా, స్త్రీ నుండి ఏమేమో ఆశించటంగా

కనబడుతూ, ఆశించినది లభించలేదన్న అసహనంతో ప్రేమ పేరుమీద జరుగుతున్న యాసిడ్ దాడులు, నరికి చంపటాలు వంటి ఘాతుక చర్యలు పెచ్చు పెరుగుతున్న వర్తమానంలో గురజాడ వివరణలు గుర్తు చేసుకోవలసి ఉంది. ప్రచారం చేయవలసి వుంది. అలాగే కులమత విద్వేషాలతో మనుషులపై అధికారం, దౌర్జన్యం నెరిపే దుష్టసంస్కృతి ప్రబలుతున్న కాలంలో అసహనం హద్దులు దాటి హత్యలకు, అత్యాచారాలకు కారణ మవుతున్న పాడుకాలంలో మననం చేసుకోవలసినది గురజాడ ప్రేమతత్వాన్నే.

'మై ఓన్ థాట్స్' లో మంచితనం అంటే దేవుడు అనిచెప్పి మంచితనం పై ప్రేమలో పడటమే ప్రేమను దైవంగా మార్చే వాస్తవ శక్తి అని పేర్కొన్న గురజాడ ఆ క్రమంలో ఆత్మ చెడు నుండి విముక్తం అవుతూ సుగుణాలను పెంచుకొంటూ దైవత్వాన్ని పొందుతుంది అని భావించాడు. నాగరికతతో పాటు ప్రేమ అభివృద్ధి చెందుతుంది అని చెప్పాడు. (గురుజాడలు, పు; 830) అట్లా మనుషులు ప్రేమను అభ్యాసం చేస్తూ దైవత్వం వైపు చేయవలసిన ప్రస్థానాన్ని నిరూపించటం కొరకే గురజాడ సాహిత్య సృజనకారుడయ్యాడు.

సమాజంలో, మానవ సంబంధాలలో ప్రేమకు అవరోధంగా ఉన్న శక్తులలో కులం ఒకటి. దానిని గుర్తించాడు కనుకనే 1909 నవంబర్ లో బరంపురంలో జరిగిన భిన్న కులాల సహపంక్తి భోజనానికి వెళ్లి వచ్చాడు. "వర్ణభేదములెల్లకల్లై/ వేలనెరుగని ప్రేమబంధము" దృఢపడాలని ఆకాంక్షిస్తూ కవిత్వం( ముత్యాలసరము, 1910 జులై) వ్రాసాడు. అదే సంవత్సరం నవంబర్ నెలలో ప్రచురించిన 'లవణరాజు కల'లో 'మలిన వృత్తుల, మలిన దేహుల మాలలని సమాజము నుండి ఉపాంతీకరించి మలిన చిత్తులకు అధిక కులమును కట్టబెట్టిన వర్ణధర్మం అధర్మ ధర్మం' అని నిర్ద్వంద్వం గా ప్రకటించాడు. మంచి, చెడు అనే విలువల వ్యత్యయమే తప్ప అధిక,హీన అనే కుల వ్యత్యయం ఉండరానిదని తేల్చి చెప్పాడు. మంచి, చెడు రెండే మానవకులాలు అని "మంచి యన్నది మాల యైతే / మాలనేయగుదున్" అని ప్రకటించాడు. అదే సంవత్సరం ఆగస్టు నెలలో ప్రచురితమైన 'కాసులు' గేయం 'ప్రేమ విద్దెకు ఓనమాలు' దిద్దబెట్టింది. సందర్భం భార్యాభర్తలకు సంబంధించిందే అయినా "ప్రేమ పెంచక పెరుగునే" అన్న ప్రశ్నను వేసి ధనం కన్నాప్రేమ అభివృద్ధి చేసుకోవలసిన జీవిత విలువ అని నిర్ధారించి చెప్పాడు గురజాడ. 'ప్రేమ కలుగక బ్రతుకు చీకటి' అని తేల్చి చెప్పాడు. వయసుతో మరలిపోయే మరులకు భ్రమపడరాదని హెచ్చరించాడు. మగువలకు, మగవారికి ఒకేరకంగా వర్తించే ప్రేమ మాత్రమే మాయ మర్మము లేని నేస్తంఅని, సమానత్వం దాని మూల విలువ అన్న ఎరుకతో చెప్పాడు. "ప్రేమనిచ్చిన, ప్రేమవచ్చును/ ప్రేమనిలిపిన, ప్రేమ నిలుచును" అని పరస్పరం మనుషులమధ్య వినిమయం కావలసిన ప్రేమ గురించి చెప్పాడు. "మగడు వేల్పన పాతమాటది; ప్రాణమిత్రుడ నీకు" అని చెప్పటంలో ప్రేమకు స్నేహం, సమానత్వం ప్రతిపాదికలని చెప్పినట్లయింది.

డామన్ పితియస్( 1910, సెప్టెంబర్ ) లో స్నేహం, త్యాగ సంసిద్ధత, విలువల కోసం నిలబడటం, ప్రేమ సంపదలో భాగం అని నిరూపించాడు. దాని ముందర రాజ్యం,

అధికారం అన్నీ తీసికట్టేనని ( అలఘు రాజ్యము ప్రేమసంపద కలతి యని దలతున్ ) అని రాజు చేతనే చెప్పించాడు.

ప్రేమంటే ఏమిటో, ఏది జీవితమో దానిని జీవించేవాడిని, ఏది దైవమో దానిని ఆరాధించే వాడిని అడిగి తెలుసుకోవాలంటాడు షెల్లీ( On Love and Fragments by Percy Bysshe Shelly –https://romantic –circles.org / editions/mws/ lastman/pbsfrags.htm) ప్రేమంటే ఏమిటో పూర్ణమ్మ గేయం(1912) చదివితే అర్థం అవుతుంది. పూలతో, పండ్లతో, అవి ఇచ్చే సర్వ ప్రకృతితో, రుతువులు తెచ్చే మార్పులతో స్నేహం చేసిన పూర్ణమ్మకు జీవితం విలువ తెలుసు. తండ్రికి ధనంతోనే సంబంధం. దాని ముందు తాత వయసువాడికి బిడ్డనిచ్చి పెళ్ళిచేయటంలో న్యాయం గురించిన చింతన గానీ, కన్నబిడ్డ బతుకు గురించిన దయ గానీ అతనికి లేకపోయింది. ఆ పెళ్లి వల్ల లభించే జీవితం పూర్ణమ్మ దృష్టిలో విలువలేనిది. ఏది జీవితమొ అది జీవించటం అంటే గుణాత్మకంగా జీవించటం. సార్థకంగా జీవించటం. అది అసంభవం అయినప్పుడు జీవితం త్యజించటమే పూర్ణమ్మ ఎంపిక. "నలుగురు కూచుని నవ్వే వేళల / నా పేరొకతరి తలవండి;/ మీమీ కన్నబిడ్డల నొకతెకు / ప్రేమను నా పేరివ్వండి/" అని అన్నదమ్ములను సంబోధించి పూర్ణమ్మ చెప్పిన మాటలు జీవితాన్ని ఆమె ఎంత ప్రేమించిందో, దానిని త్యజించటానికి ఎంత బాధను అనుభవించిందో చెపుతాయి. సంతోషంగా, సార్థకంగా జీవించటానికి అవరోధంగా ఉన్న ధనం, జీవించే హక్కును భంగపరుస్తున్న దుష్ట సంప్రదాయాలు మొత్తంగా జీవితాన్ని ప్రేమ రాహిత్యంలోకి నెడుతున్న స్థితిని చూపటం ద్వారా గురజాడ సామాజిక సంస్కృతి లో, మానవ సంస్కారాలలో రావలసిన మహత్తరమైన పరివర్తనను ఊహించాడు.

వ్యక్తి ప్రేమలు, కుటుంబ ప్రేమలు, అక్కడి నుండి దేశ ప్రేమ వరకు గురజాడ ప్రేమతత్వం విస్తరించింది. 'దేశమును ప్రేమించుమన్నా' అన్న ప్రబోధగీతం (దేశభక్తి,1913) గమనించవచ్చు. ఓర్వలేనితనం వదిలించుకొని ఒకరి మేలు తనకు మేలని ఎంచగల మానవత్వం మేల్కొనాలని కలలు కన్నాడు. స్వార్థం కొంత తగ్గించుకొనటం, పొరుగువాడి కి తోడ్పటం మానవత్వ వికాసనానికి ఊపిరులూదుతుందని భావించాడు. "దేశమంటే మట్టికాదోయి / దేశమంటే మనుషులోయి!" అని చెప్పటం ద్వారా దేశభక్తి అంటే భౌగోళిక సరిహద్దులు, జండావందనాలు, జైశ్రీరామ్‌లు కాదని, మనుషుల మధ్య సాధించబడ వలసిన ఒక సామరస్యం అని గురజాడ సూచించినట్లయింది. వ్యక్తులుగా, కులాలుగా, మతాలుగా విడిపోయిన మనుషుల మధ్య పరస్పర సానుభూతి, సహానుభూతి, స్నేహం అభివృద్ధి చెందటానికి అనువైన వాతావరణాన్ని సిద్ధం చేయటమే దేశభక్తి అని ఆయన భావించాడు. "దేశమనియెడి దొడ్డవృక్షం / ప్రేమలనుపూలెత్తవలెనోయి" అన్న గురజాడ ఆకాంక్షకు వంద సంవత్సరాలు దాటాయి. దానిని వాస్తవీకరించటానికి సాహిత్యం దగ్గర ఆగితే సరిపోదు. సాహిత్యం నుండి క్రియాశీల సామాజిక రాజకీయ కార్యాచరణ వైపు కదలక తప్పదు. ●

## గురజాడవారి లేఖలు..

# గురుజాడల ఆశారేఖలు



పాలమరశెట్టి కృష్ణారావు
Ph: 96765 44764

మహాకవి గురజాడ అప్పారావు గారి విభిన్న సాహితీప్రక్రియలలో లేఖాసాహిత్యం ఒక వినూత్న ఒరవడి సృష్టించిందనడం అతిశయోక్తి కాదు.

అంతకుపూర్వం ఉన్న ప్రముఖ సాహితీస్రష్టల లేఖా సాహిత్యంలో పొడసూపని భావసాంద్రత గురజాడవారి లేఖలలో ప్రస్ఫుటంగా ఉన్నట్లు భాషాకారుల అభిప్రాయం. ఆ మహాకవి రచనలు శిష్టవ్యవహారంలో అక్షరరూపం సంతరించుకోవడంతో ఆయన సమకాలిక సాహిత్యకారులలో ఒక విశిష్ట స్థానం దక్కింది. "నా ఉద్యమం ప్రజా ఉద్యమం. సంస్కృతీపరుల భావసంపద నాకు అండగా ఉంది. అంటూ ఆధునిక వ్యావహారిక భాషోద్యమానికి సంబంధించిన వారి ఆలోచనలు, అనుభవాలను లేఖల రూపంలో తన మిత్రులతో పంచుకున్నారు.

11 మార్చి 1909న. తన శిష్యుడు ఒంగోలు మునిమాణిక్యం గారికి రాసిన లేఖలో ఇలా అన్నారు– 'నాతో కలసిమెలసి మెసలడం వల్ల నా సాంగత్యం ఫలితంగా నీకు సారస్వతాభిరుచీ, అభినివేశం కలిగాయని నువ్వు చెబుతున్నావు. సరే...సంతోషం. అయితే వొక్క మాట. నీతో పరిచయం కలగడం వలన రానున్న తరంలో యువకులు మాకన్న ఎక్కువ సాహిత్యకృషి చేయగలరన్న విశ్వాసం నాకు కుదిరింది. యువకుల పట్ల ఆప్యాయత, అభిమానమూ కలిగాయి. నీ పరిచయం వల్ల మళ్ళీ నా స్వయంవ్యక్తిత్వాన్ని నేను పొందగలిగాను.'

ఈ లేఖలో భవిష్యత్ యువతపై తనకున్న ఆశావాహ దృక్పథం వ్యక్తం చేయడం ఆయన దార్శనికతకు అద్దం పడుతోంది.

కవిగా తనకుతానుగా స్వీకరించిన సామాజిక బాధ్యతను ఆ మహాకవి ఎన్నడూ విస్మరించలేదు. 1909 మే 21 న మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన లేఖలో...' కవితా న్యాయం ఒకప్పుడున్నట్టుగా ఇప్పుడు లేదు. నేను జీవితాన్ని చిత్రిస్తాను. కళ నాకు అధికారి అయినప్పటికీ సమాజం పట్ల నాకు ఒక కర్తవ్యం ఉంది.' అని సాహితీకృషీవలునిగా తన నిబద్ధతను లోకానికి ప్రకటించారు.

1911 నవంబర్ 22 తేదీన మునిమాణిక్యం గారికి రాసిన మరో లేఖలో 'ఒక వాక్యం వ్రాయని, ఒక పుస్తకం వ్రాయని పండితులు మనలో అనేకమంది ఉన్నారు. సృజనాత్మక శక్తికి, పాండిత్యానికి భేదం చాలా వుంది. ఒక కళాశాలలోనో, ఒక పాఠశాలలోనో పండితుడుగా ఉన్నంత మాత్రాన తానొక వచన రచయితననో, కవిననో భావించడం మన దౌర్భాగ్యం. మనదేశంలోని పాఠశాలలోని పండితులు సాధారణంగా అలాగే

అనుకుంటున్నారు. పనికిమాలిన పాండిత్యంతో కవిత్వం మీద విరుచుకుపడుతున్నారు.' అంటూ ఆనాటి సాహిత్య స్థితిగతులను విమర్శించిన తీరు గురజాడవారి తులనాత్మక విమర్శను స్పష్టం చేస్తోంది.

మునిమాణిక్యం గారికి రాసిన మరోలేఖలో వేశ్యజాతి పట్ల తన నిశ్చితాభిప్రాయాన్ని ఇలా ప్రకటించారు. "వేశ్యలో మానుషత్వాన్ని మరచిపోకండి. ఆమె సుఖదుఃఖాలు మీవిగాని, నావిగాని అయిన సుఖదుఃఖాలకు ప్రాముఖ్యత లో తీసిపోవు. సంఘంలో లెక్కలేని వ్యభిచారులైన భర్తలు, భార్యలూ వున్నారు. స్పష్టంగా తన వృత్తిని తెలియబరిచే వేశ్య వారందరికన్నా అధమురాలెట్లా అవుతుంది?" అని సూటిగా సమాజంపై ప్రశ్నాశరం సంధించిన ధీరోదాత్తుడాయన.

6 డిసెంబర్ 1912 న కళాప్రపూర్ణ బిరుదు ప్రథమ స్వీకర్త, నెల్లూరు మండలవాసి వేదం వేంకటరాయశాస్త్రి గారి 'ప్రతాప రుద్రీయం' నాటకాన్ని మెచ్చుకుంటూ గురజాడవారు రాసిన లేఖ ఇలా సాగింది..."పెక్కు విషయాలలో నేను మిమ్ము మెచ్చుకొనుచున్నాను.

ముఖ్యంగా ప్రతాపరుద్రీయంలో మీరు చూపిన భాషాతత్పరతకునూ, దేశభక్తికినీ, చారిత్రక వాతావరణముతోడి కథానిర్మాణమునకు మీరు పాత్రలను, సంస్థలను ఆదర్శ ప్రాయంగా సృష్టించినారు." విమర్శకులమని స్వయంగా ప్రకటించుకునే వారిలో దానిని గ్రహించగల సంస్కారం ఉన్నవారు చాలా అరుదుగా ఉంటారు.

గురజాడవారు స్వతహాగా వ్యావహారిక భాషావాది. భాషాపరమైన విభేదాలు ఉన్నా పెక్కు విషయాలలో వేదం వేంకటరాయశాస్త్రి గారిని, ప్రత్యేకించి ప్రతాప రుద్రీయం నాటకాన్ని ప్రశంసించడం అప్పటి సాహితీ, చరిత్ర భాషాకారులలో విశేష చర్చకు దారితీసింది. 1912 డిసెంబర్ 16 న గున్నయ్య శాస్త్రిగారికి రాసిన లేఖలో అప్పారావుగారు తన అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా ప్రకటించడం గమనార్హం. "తెలుగు కవిత్వం లో నేను కొత్త 'ఎక్స్పెరిమెంటు' ఆరంభించాను; నా ముత్యాల సరాల రీతిని గమనించినట్లయితే మీకీ విషయం బోధపడుతుంది; నేను తలపెట్టిన మార్పు స్పష్టపడుతుంది. వాటి శబ్దవిన్యాసంలో భేదం కనపడక పోదు. ఛందోపద్ధతిని బట్టి శబ్దాల అమరిక ఏర్పడుతుంది. ఛందోరీతుల ఇమిడికవల్ల ఒక్కొక్కప్పుడు శబ్దాలు కొద్ది కొద్దిగా మారడం కద్దు. మన తెలుగుభాషలో యూరోపియన్ల భాషకంటే అధికం. బెంగాలీ కవులు సులభమైన ఛందోరీతులను స్వీకరిస్తారు. అయినా పదములను పొడిగించి వాడుతూ ఉంటారు." పద్యాల కల్పనలో నవీనరీతులకు మార్గం సుగమం చేసినకారణంగానే గురజాడవారు తెలుగుసాహితీ ప్రపంచంలో నవయుగకవితా చక్రవర్తిగా ప్రశంసలు అందుకున్నారు.

ఒక సందర్భంలో విజయరామగజపతి మహారాజా వారికి రాసిన లేఖలో మహాకవి ప్రస్తావించిన అంశాలు నేటికాలానికి వర్తిస్తాయనడంలో అనౌచిత్యం ఏమాత్రం లేదు. గురజాడవారి మాటల్లోనే ఒకసారి పరికిద్దాం–"తెనుగున గ్రంథప్రచురణమనేది పీకులాట పంచాంగం. కృత్యాద్యవస్థ. యూరపులోనో లేదా కనీసం బెంగాలులోనో వున్నట్లు తెలుగుదేశంలో పుస్తకవ్యాపారమనేది లేదు. గ్రంథకర్త తన పుస్తకాన్ని తానే అచ్చు ఒత్తించుకోవాలి. ముద్రాపకుడు, ప్రకటనకర్త, ప్రచురణకర్త అన్నీ అతనే! అచ్చు ఒత్తించిన

పుస్తకాన్ని అభివందనాలతో బహూకరించమని పరిచయస్థులైన మర్యాదస్తులు గ్రంథకర్తను అర్థిస్తారు. దీనితో గ్రంథకర్త లాభం గూబల్లోకి వస్తుంది. అతని పని కుదేలు.'

గురజాడవారి లేఖలలో స్పృశించని అంశంలేదని భాషాకారులు వ్యాఖ్యానిస్తారు. వారు రాసిన కొన్ని అక్షరరూపకాల పరిశీలనకు ప్రయత్నిద్దాం.

"నిత్య జీవిత కార్యకలాపాలలో గ్రాంథికభాషను వ్యవహరిస్తే ఎంత కృత్రిమంగా వుంటుందో దానిని రంగభూమియందు ప్రయోగించినా అంత కృత్రిమంగానూ వుంటుంది.'

"ఆధునిక స్త్రీ రేపటి సమాజ చరిత్రను రచిస్తుంది.''

"ఏనాడు బౌద్ధమతం భారతదేశంలో తుడిచిపెట్టబడిందో ఆనాడే భారతదేశం మత విషయక ఆత్మహత్యను చేసుకుంది.''

"కవితాన్యాయం నిన్నమొన్నటిలా నేడు లేదు. మానవ జీవితాన్ని నేను చిత్రిస్తాను. చిత్రిస్తూ కళానైపుణ్యంతో ఆదర్శ పూరితం చేస్తానే అనుకో. కవితాకళకు నేను వొదిగి ఉండవలసిన వాడినే. అయినా మానవ సమాజం పట్ల నాకొక మహత్తరమైన బాధ్యత ఉంది. కనుక పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును. నేను వొక దోషాన్ని, దుర్నడతను ఆకర్షవంతం చేశానా? చేయలేదనే నేను భావిస్తున్నాను.'' "కన్యాశుల్కం నాటకం పిలవని పేరంటానికి మా అప్ప చీరె కట్టుకొస్తానని బయలుదేరి యేదో వొక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా, బలవంతంగా నెత్తిన రుద్దదు. కానీ..దానికి మహత్తరమైన నైతిక ప్రయోజనం ఉంది.''

"సాంఘిక సంస్కరణోద్యమాన్ని పురోగమించచడానికి నాటకరంగానికి తెలుగుభాష నప్పదనే సామాన్య దురభి ప్రాయాన్ని పోగొట్టడానికే కన్యాశుల్కం నాటకం వ్రాశాను. వొక ప్రయోజనాన్ని కాంక్షించి, వొక మార్గాన్ని నిర్దేశించడం కోసం ఆ నాటకాన్ని వెలువరించాను. రచయితలు ముఖ్యంగా నాటకకర్తలు తప్పుదారులు పట్టి, పట్టాలు తప్పి సాహిత్యకృషి సల్పుతు న్నారని నేను గమనించాను.''

ఇలా అసంఖ్యాకమైన, అతి విలువైన లేఖల ద్వారా నాటి సామాజిక స్థితిగతులతో పాటు సమకాలీన భాషాసాహిత్యాలకు సంబంధించిన రసస్ఫోరకమై భావగర్భితమైన నిష్పాక్షిక చర్చ కనిపించడం విశేషం. తనదైన భావజాలంతో ఉత్తర తరాల సాహితీస్రష్టలకు ఆదర్శ ప్రాయుడు, ఆరాధ్యనీయుడుగా తెలుగునాట సమున్నత కీర్తిప్రతిష్టలు సొంతం చేసుకున్న యుగకర్త గురజాడ వారి అడుగుజాడలు తరతరాలకు తరగని అమూల్య నిధులు.

ఆనాడు గురజాడ అప్పారాయ కవివరేణ్యులు విత్తిన సాహితీబీజం శాఖోపశాఖలై విస్తరించిన మహావటవృక్షమై దశదిశలా వ్యాపించింది. ఆ మహత్తర తరుచ్ఛాయలో పునీతులమవుదాం. తెలుగుభాష పునః ప్రాభవ సాధనకు పునరంకితమవుదాం.

అదే ఆ మహాకవికి మనమిచ్చే ఘన నివాళి.

జై తెలుగుభాష!

జై తెలుగుజాతి! ●



# అభినవ వాల్మీకి



కళారత్న డా. మీగడ రామలింగస్వామి
Ph: 94401 89229

సీ. ముత్యాల సరములన్ పూర్ణమ్మనే జూపి
కవుల మన్నన గొన్న ఘనత నీది!
'దిద్దుబాటు' ను జూపి పెద్దగా నిలబడి
కథకునిగా గొన్న ఖ్యాతినీది!
మాండలికానికి మాన్యత కల్పించి
ప్రజలమన్నన పొందు ప్రతిభ నీది!
దేశభక్తిని దశదిశలకు వినిపించి
గొప్పను వడసిన మెప్పు నీది!

తే. విశ్వకీర్తిని గొన్నట్టి విమలచరిత!
ఆధునిక కవి పూజ్యుడా! అగ్రగణ్య!
విజయ నగరానికే గొప్ప వెలుగునీవ!
ప్రథిత! అభినవ వాల్మీకి! భవ్యచరిత!
అందుకో! గురజాడ! మా వందనములు!

'ఏరుల జన్మంబు ఎరుగ నగునే' అంటారు – నన్నయ. అలాగే మహాకవుల కవితాసృష్టిని విశ్లేషిస్తున్న కొద్దీ ఇంకా ఉండనే ఉంటుంది. ఎంత మంది ఎన్ని విధాల పరిశీలించినా పరిశోధించినా అంతుబట్టదు. అలాంటివారి కోవలోకి చెందిన వారే మహాకవి గురజాడ వేంకట అప్పారావుగారు. ఆధునికాంధ్ర సాహిత్యంలో పుంఖానుపుంఖంగా గురజాడపై ఎందరో ఎన్నో వ్యాసాల పరంపరలు వెలిబుచ్చారు. ఇంకా పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. అంతే ఆసక్తిగా సాహితీప్రియులు వాటన్నిటినీ

ఆస్వాదిస్తునే ఉన్నారు.

నాకు, ఇటీవల తే2016-01-10దిన 'గురజాడ స్ఫూర్తి రత్న' పురస్కారాన్ని గురజాడ సంస్థ (అమెరికా) వారు (అరుణా గురజాడగారు) గురజాడ కుటుంబ సభ్యులు (శ్రీ రవీంద్రుడు గురజాడ మొదలగువారు) విజయనగరం, గురజాడవారింట్లో ఇచ్చారు. ఈ సందర్భంలో మరోసారి గురజాడ వారిని చూశాను. నాకు వారిలో ఓ వాల్మీకి దర్శనమిచ్చారు. అందుకే 'అభినవ వాల్మీకి' అన్నాను. అంతకు ముందు ఈమాటెవరైనా అన్నారా అని ఆరా తీసినప్పుడు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారన్నారని విన్నాను. కాని వారేమన్నారో, ఎలా సమన్వయించారో మాత్రం ఇప్పటికీ నాకు తెలియదు. కానీ నేననుకున్నది, వినిపించాలని ఆ సభలో రేఖామాత్రంగా అన్నాను. దాన్నే ఇప్పుడు అక్షరరూపంలో అంటున్నాను.

**(అ) గురజాడ పద్యం :**

ఆధునికాంధ్ర సాహిత్యానికి మార్గదర్శకుడై, మలుపు తిప్పిన మహాకవి, పద్యాలు రాయలేదా? రాస్తే ఎలా ఉన్నాయి? చూద్దామని అనిపించింది. అయితే గురజాడ పద్యం సరళంగా, సందేశాత్మకంగా సాగి సామాన్యులకు కూడా ఇట్టే అర్థమైనట్టు ఉంటుంది. మచ్చుకు రెండు మూడు చూద్దాం.



సుభద్ర ఇతివృత్తంగా సాగిన పద్యకావ్యంలో ఈ పద్యం చూడండి.

**"ధర్మముండుచోట దైవ బలంబుండు**
**కలుగ దైవబలము కలుగు జయము"**

ధర్మం ఎక్కడ ఉంటే అక్కడ దైవం ఉంటాడు. దైవం ఎక్కడ ఉంటే తప్పక జయం కలుగుతుందని ఎంత సరళంగా, సందేశాత్మకంగా పద్యం నడిచిందో నేను చెప్పక్కరలేదు.

అలాగే అర్జునుణ్ణి వర్ణిస్తూ,

**"ఏడు లోకంబుల నెనలేని విల్లుకా**
**డెవ్వడెటెనంగ గవ్వడియట**
**సాటి వారల పట్ల సౌహార్ద్రమొనరించు**
**మేటి ఎవడన కిరీటియనగ**
**నెనరు నేర్పులు గల్గు నెఱజాణుడెవడన్న**

**ఇంద్రజుండని లోకమెన్ని పల్క**

**పెద్దల కడ భక్తి, పిన్నల యెడ రక్తి**

**నెరపువాడెవడన్న నరుడెయనగ"** అన్నారు.

ఏడు లోకాల్లో సాటిలేని విలుకాడు అర్జునుడని, సాటి వారిని ఎంతో ఆదరంతో చూసే స్వభావం కలవాడని, విద్యల్లో మంచి నేర్పరి అని, పెద్దల పట్ల భక్తి, చిన్నవాళ్ళపై అనురాగం కలిగేవాడు ఆ అర్జునుడని సరళ సుందరంగా వర్ణించారు. పద్యంలో కాఠిన్యం ఎక్కడా లేదు. సీసపద్యం నడకను అద్భుతంగా నడిపించారు.

**పుష్పలావికలు** : ఇందులో మగవాళ్ళ స్వభావం ఎంత అందంగా చెప్పారో చూద్దాం.

**ఉ. "చక్కదనంబునశ్వరము సత్యము, మక్కువలెల్ల కాలముల్**

**మిక్కుటమై చెలంగునొకొ, మిత్రమ! చీమలు చుట్టు ముట్టుచుం**

**జక్కెర చెల్లుదాక బలు సందడి జేయుచు వీడు కైవడిన్**

**జొక్కపు ప్రాయమేగుతలరి సున్న కదా మగవారి మక్కువల్"**

అందం ఉన్నంతవరకే మగవాళ్ళు ఆడవాళ్ళను మక్కువతో చూస్తారు. వయసుడిగి అందం తగ్గేసరికి, పంచదార అయిపోయినపుడు చీమలు చెదిరిపోయినట్టు చెదిరిపోతారని చెప్పారు.

ఇలా ప్రాచీన కవులకు ఏ మాత్రం తగ్గకుండా, సరళత్వం, సందేశాలను బిగించి తనదైన శైలిలో గురజాడ పద్య రచన చేశారు.

**మెరుపులు** : లోకాన్ని, శ్లోకాలను గురజాడ ఆంధ్రీకరణ కూడా చేశారు. బంగారాన్ని నాణ్యం చేయడానికి నాలుగు మార్గాలున్నాయి. అలాగే మనిషికి కూడా నాలుగు విధాలుగా నాణ్యత కనిపెట్టవచ్చని అంటారు.

తే. **నాల్గురీతుల కనకంబు నాడెమగును**

**వేటు, గీటుల తునియించి, వెచ్చజేసి,**

**నరుడు, నట్టుల నాల్గింట నాడెమగును,**

**కులము, శీలంబు, కర్మంబు, గుణము చేత"** అని.

**గురజాడ – 'గురుజాడ'** : గురజాడ వారిది 'గురుజాడ' అని మనం చాలా గొప్పగా చెప్పుకుంటుంటాం. కాని వారే, 'ఋతశతకం' రాస్తూ....

**"ధృతి గురుజాడ లనరిగెడు**

**గతి పెద్దలు జూప జనితి గజపతి మెచ్చన్"**

అని ఎంతో వినమ్రంగా, తనకంటే పూర్వ కవులను గురుజాడలననుసరించారని చెప్పుకున్నారు.

అయితే, గురజాడ పద్యాలు ఎంత బాగున్నాయని అనుకున్నా, అలా పద్యాలు రాసుకుంటూ ఉంటే, గురజాడ వారిది గురుజాడ అయి ఉండేది కాదని, ఇంతమంది ఇన్ని విధాలుగా వారి అడుగుజాడల్లో నడిచేది ఉండదని మనం నిర్ద్వంద్వంగా చెప్పుకోవచ్చు.

గురజాడ – సంగీతజ్ఞానం ఉన్నవారని చాలామందికి తెలియకపోవచ్చు. మద్రాసులో ధనమ్మాళ్ అనే సంగీత విద్వాంసురాలు కచేరీ చేస్తుంటే, ఆమె పాడిన కీర్తనలు ముఖ్యంగా దర్బారు, భైరవి, సావేరి, యదుకుల కాంభోజి, పున్నాగవరాలి రాగాలు గురజాడ వారిని మంత్రముగ్ధుల్ని చేశాయట. అంతేకాదు, ఆరోజుల్లో బాగా కచేరీలు చేసిన వారెవరూ ఆమె గాత్రం ముందు, ఆమె స్వరప్రస్తారం ముందు సరితూగలేరని మెచ్చుకున్నారు. అంటే, గురజాడకు మంచి సంగీత పరిజ్ఞానం ఉంటేనే కదా రాగాలు, వాటి మర్మాలు తెలిసేది. ఇదంతా 1895 ఏప్రిల్ 21వ తేదీ డైరీలో ఉంది.

**గురజాడ – వైణికుడు** : గురజాడ సంగీత పరిజ్ఞానే కాదు వీణ వాయించడంలో నేర్పరి అని కూడా తెలుస్తుంది. గురజాడ వీణవాయిస్తూ ఉండగా గిడుగు సీతాపతిగారు చూసినట్టు 1895 ఏప్రిల్ 21 తేదీ డైరీని బట్టి తెలుస్తుంది.

అందుకే గురజాడవారి సంగీత పరిజ్ఞానం, వీణావాదనం వంటి విషయాలు కూడా పరిశోధనలో వెల్లడి చేయాల్సిన అవసరం ఉంది. చాలా మంది పరిశోధనలకు సంగీత పరిజ్ఞానం ఉండకపోవడం వల్ల ఆ జోలికి పోవడంలేదనిపిస్తుంది.

గురజాడవారికి సంగీత పరిజ్ఞానం బాగా ఉండబట్టే ముత్యాలసరాలు ఛందాన్ని సృష్టించే శక్తి వారికి కలిగింది. అందుకే అది ఏ రాగంలో గానం చేసినా ఒదిగే స్వభావం కలది అయింది. (ఆ పురస్కార సభలో నేను మూడు నాలుగు రాగాల్లో పాడి సభ్యులకు వినిపించాను).

ఆ) **వాల్మీకి – గురజాడ :** గురజాడలో వాల్మీకి పోలికలు చాలా కనిపిస్తూ ఉండడంలో గురజాడను **అభినవ వాల్మీకి** అని అన్నాను.

**1. కవితాపరంగా:** అనంత సాహిత్యానికి వాల్మీకి ఆదికవియై 'అనుష్టుప్ ఛందం' లో ఆది శ్లోకం రాస్తే, ఆధునికాంధ్ర సాహిత్యాన్ని ఓ మలుపు తిప్పి గురజాడ 'ముత్యాలసరం' అనే కొత్త ఛందాన్ని రాశారు.

**2. భాషాపరంగా :** వేద వాక్ మయ, లౌకిక వాక్ మయంగా రెండు విధాలుగా ఉంటుంది. వేద వాఙ్మయం అందరికీ అర్థం కాదు. లౌకిక వాక్ మయం సాధన చేస్తే తప్పక అర్థం అవుతుంది. అలాంటి లౌకిక వాక్ మయంలో అనుష్టుప్ ఛందస్సు ఏమాత్రం సంస్కృత శబ్ద జ్ఞానం ఉన్నా అర్థం అవుతుంది. అలాంటి సరళమైన సంస్కృత పదజాలంలో వాల్మీకి 24 వేల శ్లోకాలతో రామాయణం రచన చేశాడు.

మన గురజాడ, అప్పటివరకు పద్యసాహిత్యంతో పరవళ్ళు తొక్కుతున్న ఆంధ్రసరస్వతికి, ముత్యాలసరాలు మెడలోవేసి సామాన్యులకు సైతం చూడ్డానికి అర్హత కల్పించాడు.

వాల్మీకి శ్లోకం చూడండి:

**"గగనం గగనాకారం – సాగరస్సాగరోపమః:**

**రామరావణయోర్యుద్ధం – రామరావణయోరివ "**

ఆకాశం ఆకాశంలానే ఉంది. సముద్రం సముద్రంలానే ఉంది. రామ రావణ యుద్ధం,

రామరావణ యుద్ధంలానే ఉంది. దేనికదే సాటి అని అర్థం. ఎంత సులభంగా అర్థమయింది?..

**సంగీత పరంగా :** వాల్మీకి రామాయణం రాస్తూ 'పాఠ్యే గేయేచ మధురం' అన్నాడు. రామాయణం పాడుకోవడానికి, చదువుకోవడానికి అనువైంది అన్నాడు. అందుకే గాంధర్వ విద్యా మర్మజ్ఞులైన కుశలవులచే గానం చేయించినట్టు చెప్పుకున్నాడు.

గురజాడ పుత్తడిబొమ్మ పూర్ణమ్మగానీ, దేశమును ప్రేమించుమన్నా అన్నది కానీ ఏ రాగానికైనా ఒదిగే స్వభావం కలిగి ఉండడం గమనించవచ్చు.

స్వరపరిచే వారికి రామాయణంగానీ, ముత్యాలసరంగానీ చక్కగా ఇముడుతాయి. పాడేవాడి గాత్రానుగుణంగా అద్భుతంగా గానానుకూలంగా ఉంటాయి.

1. **అభిప్రాయపరంగా...**

వాల్మీకిని స్తుతిస్తూ వాల్మీకిని కోకిలగా వర్ణించారు.

'కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్'

గురజాడ

**'ఆకులందున అణిగి మణిగి**
**కవిత కోకిల పలకవలెనోయ్'**

ఇద్దరూ కవితాకోకిలలే, ఇద్దరూ కవితాశాఖలపై నుండి సర్వజన సమ్మోహనంగా, సకల లోక వశంకరంగా గానం చేశారు.

2. **సందేశపరంగా...**

'విశ్వశ్రేయః కావ్యం' విశ్వానికి శ్రేయోమార్గం ఉపదేశించేదే కవిత్వం. అది శ్లోకంలో ఉందా? పద్యంలో ఉందా? గద్యంలో ఉందా? ఏ ఛందస్సులో ఉంది? ఏ ఛందంగా ఉంది? అనేది కాదు.

కాబట్టి, విశ్వ సందేశాన్ని అందించాడు. కాబట్టి వాల్మీకి జగద్వంద్యుడైనాడు. విశ్వ వీధుల్లో నినదించాడు. కాబట్టే, గురజాడ మహాకవి అయినాడు.

అందుకే, **'భక్త్యా భాగవతం జ్ఞేయం**
**భక్త్యా, యుక్త్యాచ భారతం'**

అలాగే; ఇక మన గురజాడ ముత్యాల సరంలో

**'మేలిమి బంగరు మెలతల్లారా!**
**కలువల కన్నుల కన్నెల్లారా!**
**తల్లులగన్న పిల్లల్లారా!**
**విన్నారమ్మా ఈ కథను?'.....** దీనికర్థమే చెప్పనక్కరలేదు.

3. **సమాజపరంగా...**

వాల్మీకి రామాయణ కావ్యం మానవ విలువలకు మణిదర్పణం. గురజాడ కన్యాశుల్కం నాటకం ఎవరు ఎలా ఉండాలో ఎవరు ఎలా ఉండకూడదో చూపించే సమాజ దర్పణం. వాల్మీకి రామాయణం అన్నాతమ్ములు, తండ్రీతనయులు, భార్యాభర్తలు మొదలైన సంబంధాలకు ముంజేతి కంకణం. గురజాడ కన్యాశుల్కం, మనుషుల్లో ఉండే కపటత్వం, మోసపూరిత వ్యవహారాలు, సాంఘిక దురాచారాలు ఎత్తిచూపడంతో పాటు భాషా వ్యవహారాలకు మణిమండపం. వాల్మీకి పాత్రలు స్వభావాలు మార్గదర్శకాలు. గురజాడ పాత్రల స్వరూప స్వభావాలు సజీవ చిత్రాలు. ఇలా ఎన్నైనా చెప్పుకోవచ్చు.

**4. రసపరంగా:**

'ఏకో రసః కరుణ ఏవ, అని ఆలంకారికులు సిద్ధాంతీకరించారు. సమాజాన్ని కదిలించే స్వభావం కలది కరుణ రసమే. కరుణ రసానికి కంటతడి పెట్టనివాడు ఉండడు. ఎవడో నీరస హృదయుడు తప్ప. అలాంటి, కరుణ రసమే వాల్మీకిని కదిలించింది. ఆదిశ్లోక ఆవిర్భావానికి నాంది పలికింది.

జంట పక్షుల్లో ఒకదాన్ని చంపినందుకే, వాల్మీకి హృదయం విలవిల్లాడింది. శోకహృదయంతో శ్లోకమైంది.

ఇక, గురజాడ గుండె కరుణా రస నిర్భరమై, ముత్యాలసరం పుత్తడిబొమ్మయై పూర్ణ రసావిష్కరణ జరిగింది. విశ్వ విఖ్యాతమైంది.

**'భక్త్యాయుక్త్యాచ, బుద్ధ్యాచ**
**జ్ఞేయం రామాయణార్ణవమ్'**

భక్తిచేత భాగవతాన్ని, భక్తిచేత యుక్తి చేత భారతాన్ని, భక్తి చేత, యుక్తి చేత, బుద్ధిచేత రామాయణ సముద్రాన్ని తెలుసుకోవాలి, ఈదాలన్నారు.

అదీ వాల్మీకి గొప్పతనం.

ఇక, గురజాడ, కన్యాశుల్కం పోయి ఎన్నోఏళ్ళు అయినా, ఇన్నేళ్ళూ కన్యాశుల్కం నాటకం బతికి బట్టకట్టడానికి, మరి ఎన్నేళ్ళు అయినా చదువుకోవడానికి, ప్రదర్శించడానికి సరిపడే శక్తికలది కాగలగడానికి కారణం, కన్యాశుల్కంలోని సజీవపాత్రలు, మాండలిక భాష, పాత్రల స్వభావ చిత్రణం ఇంకా ఎన్నైనా చెప్పవచ్చు.

ఒక్కమాటలో చెప్పాలంటే, గురజాడ కవితాశక్తిని ఎవరైనా కొలిచి మహాకవి అని చెప్పడానికి, ఒక్క దేశభక్తి గేయం చాలు. దానికి ఎన్ని పేజీల వ్యాఖ్యానం అయినా చాలదుగాక చాలదు.

అందుకే గురజాడను అభినవ వాల్మీకి అనగలిగాను. ఆదికవిగా వాల్మీకికి సాహితీ లోకంలో ఎంత సుస్థిరం ఉందో ఆధునిక అగ్రగణ్య మహాకవిగా గురజాడకు అంత సుస్థిర స్థానం ఉంది. ఎప్పటికీ ఉంటుంది. ●

# గురజాడ..
# నీలగిరి పాటల సౌందర్యం



డా. గుమ్మా
సాంబశివరావు
Ph: 98492 65025

ఆధునికాంధ్ర సాహిత్యానికి యుగకర్తగా ప్రసిద్ధిపొందిన గురజాడ అప్పారావు పుట్టి 158 సంవత్సరాలైనా ఇప్పటికీ ఆంధ్రసాహిత్య ప్రపంచంలో ఆయన సాహిత్యాన్ని గూర్చి చర్చలు జరుగుతూనే ఉన్నాయి. గోష్ఠుల నిర్వహణ సాగుతూనే ఉంది. గురజాడ అప్పారావు మహాకావ్యాలు రాయకపోయినా మానవతా దృక్పథాన్ని ప్రబోధించాడు. సంస్కరణ దృక్పథాన్ని వెల్లడించారు. ఆంగ్లాంధ్ర రచనలు సాగించాడు. గురజాడ దేశభక్తి గీతం విశ్వభక్తి గీతంగా ప్రశంసలందుకొంది.

గురజాడ బహుముఖ ప్రతిభావంతుడనటానికి ఆయన రచనలు సాక్ష్యంగా నిలుస్తాయి. ప్రారంభదశలో పద్యాలు రచించాడు. ఆంగ్ల రచనలు గావించాడు. అయితే సామాజిక అవసరాన్ని గుర్తించి తన రచనాపథాన్ని మార్చుకొని సాహిత్యలోకానికి మేలు చేశాడు. కథాగేయరచనం, కథానికా రచనం, ముత్యాల సరాల సృష్టి, వ్యావహారికంలో నాటక రచన గురజాడను మహారచయితగా నిలబెట్టాయి. ఆంగ్లగ్రంథాలనెన్నిటినో చదివిన గురజాడ పాశ్చాత్య సాహిత్య ధోరణులతో పరిచయం పెంచుకొన్నాడు. కొత్త ఆలోచనలతో రచనలు వెల్లడించాడు.

ప్రజల దగ్గరకు సాహిత్యం వెళ్ళినప్పుడే ప్రయోజనకరంగా ఉంటుందని గుర్తించిన గురజాడ ప్రజలభాషలో రచనలు చేశాడు. గేయరూపంలో సందేశాన్ని అందిస్తే అది త్వరగా ప్రజల్ని చేరుతుందని గేయరచన గావించాడు. సాహిత్య ప్రక్రియల్లో నాటకానికున్న బలాన్ని గుర్తించి వ్యావహారికంలో, మాండలికంలో 'కన్యాశుల్కము' నాటకాన్ని రచించాడు. ఆనాటి సమాజాన్ని ప్రతిబింబింపచేశాడు. గురజాడలో అద్భుతమైన భావుకత, సంగీతవైదుష్యం ఉన్నదని చెప్పటానికి ఆయన రచించిన నీలగిరి పాటలు నిలువెత్తు నిదర్శనాలు. గురజాడ నీలగిరి పాటల సౌందర్యాన్ని వివరించే ప్రయత్నమే ఈ వ్యాసం.

విజయనగర సంస్థానం మీద దాయాదులు తెచ్చిన దావాని నడిపించటానికి, సంస్థాన సంబంధమైన ఇతర విషయాల్ని పర్యవేక్షించటానికి శ్రీ అలక రాజేశ్వరీ మహారాణీ వారి కుమార్తె మహారాణీ అప్పలకొండయాంబ సహాయం చేస్తూ ఉండేది. అలక రాజేశ్వరీ మహారాణి వారు మరణించిన తర్వాత భారమంతా అప్పలకొండయాంబమీద పడింది. గురజాడ అప్పారావుగారు మహారాణీ అప్పలకొండయాంబ ఆంతరంగిక కార్యదర్శిగా

ఉండేవారు. ప్రతిసంవత్సరం వేసవికాలంలో అప్పలకొండయాంబ ఉదకమండలం వెళుతూ ఉండేవారు. గురజాడ వారు కూడా ఆమెతోపాటు ఉదక మండలంలో ఉండేవారు.

ఉదకమండలంలోని నీలగిరి సౌందర్యాన్ని పరిశీలించిన గురజాడలో విశిష్ట భావాలు కలుగుతూ ఉండేవి. ఆయన భావనలకు అక్షర రూపాన్ని కలిగించి మహారాణీ వారికి వినిపించేవారు. ఆంగ్లకవి 'వర్డ్స్ వర్తు' రచనల్ని పరిశీలనాత్మకంగా చదివిన గురజాడ మీద ఆయన ప్రభావం ఎంతో ఉంది. ప్రకృతిని పరిశీలించి 'వర్డ్స్ వర్తు' గేయాలు రచించినట్లుగానే గురజాడ కూడ నీలగిరి సౌందర్యాన్ని పరికించి ఎన్నో గేయాలు రచించారు. ఈ గేయాల్ని గమనించినప్పుడు గురజాడ వారికి గల సంగీత పరిజ్ఞానం కూడా స్పష్టమవుతుంది. నీలగిరి పాటలుగా ప్రస్తుతం ఆరుమాత్రమే లభిస్తున్నాయి. గురజాడకు శబ్దార్థాల పట్ల గలిగిన శ్రద్ధను, ఆయనకు గల పరిశీలనాత్మక దృష్టిని నీలగిరి పాటలు ప్రతిబింబిస్తున్నాయి.

**నీలనగము :** నీలగిరి సౌందర్యాన్ని వర్ణిస్తూ అక్కడి దృశ్యాల్ని పాఠకుల కళ్ళ ఎదుట నిలబెడుతున్న గురజాడగేయం ఈ విధంగా సాగింది.

**'రాగము సురట, తాళము – ఆది.**

**పల్లవి :** సుందరతరమీనీలనగము – దీని
యందము హృదయానందకరము – దీని
చందము హృదయానందకరము

అనుపల్లవి : నందనవనమిదె – నాతిరోవింటివె
బృందారకముని–బృంద సేవితము

**చరణము :**

1 ఎచ్చట జూచిన – బచ్చిక పట్టులు
పొదపొదరొదలిడు – పొలుపగుపిట్టలు
వింతవాసనలు – వీచెడుచెట్టులు
కుదురురధ్యగల – కొలకుల గట్టులు

2 నిచ్చలనగముల – నీటగుతోటల
విచ్చలవిడిచను – నచ్చెపు మొగుళుల
నచ్చరగేరెడు – మచ్చెకంటులిట
మించుతీవలను – మించిచరింతురు

3 పాదఘట్టనకు – బర్వుచక్రములు
మంత్రమహిమనగు – జంత్రపురధములు
పందెము వారెడు – పలుజవనాశ్వము
లందముగానిట – గ్రందయి తోచును.




4. గట్టుల లోయల – గాజుచప్పరల
మట్టి గోలెముల – మడువుల నడవుల
నెల్లెడవిరియగ – వెల్లువులై విరు
లిక్షుధన్వుదొన – లక్షయమయ్యెను.

5. తప్పక భృత్యుల –నెప్పుడు బ్రోచెడి
యప్పల కొండయ – మంబాదేవిని
నొప్పగ బ్రోచుత – నప్పురదమనుడు
మెప్పగు వరముల – విప్పుగ గురియుచు

– అప్పారావుగారి ఈ పాట పల్లవి, అనుపల్లవితో పాటు ఐదు చరణాలుగా సాగింది. నీలగిరి అందాలను అద్భుతశబ్ద ప్రయోగాలతో అప్పారావు గారు వర్ణించారు. నీలగిరిని నందనవనంగా భావించటంలో దాని ఆధిక్యాన్ని ప్రదర్శింపజేశారు. అది నందనవనం కాబట్టి దేవమునుల చేత సేవించబడుతుందని చెప్పటం సముచితంగా ఉంది. నీలగిరిలోని పచ్చికబయళ్ళు, పొదరిళ్ళు, సవ్వడిచేసే పిట్టలు, వింతసౌరభాలను వెలిజిమ్మే చెట్లు, కుదురైన రాజమార్గంగల కొలనిగట్లు శోభాయమానంగా ఉన్నతీరును అప్పారావుగారు వర్ణించారు. ఇంకా నీటైన తోటలు, మెరుపు తీగెల్లాంటి స్త్రీలు, యంత్రరథాలు, పరుగెత్తే జవనాశ్వాలు అందాలను పంచుతుంటాయని గేయాన్ని రచించిన అప్పారావుగారు చివరి చరణంలో భృత్యులను రక్షించే మహారాణీ అప్పలకొండయ మంబాదేవిని పురదమనుడు రక్షించాలని కాంక్షించారు.

**ఊటిచోద్యమేమిచెపుదు :– రాగము – పంతువరాళి తాళము – రూపకము** గురజాడ రచించిన నీలగిరి పాటల్లో రెండవది. 'ఊటిచోద్యమేమి చెపుదు' ఈ పాటలో ఊటి అందాలను వర్ణించారు. ఊటిలోని మేడల్ని, రాత్రి సమయంలో పావకుడు ప్రతిఇంటిలో దయను చూపుతున్న తీరును ఇలా వర్ణించారు.

**పల్లవి :** ఊటిచోద్యమేమిచెపుదునువిదవింటివే
**అనుపల్లవి :** సాటియేది యూటికెందు
స్వర్గమైన దీని క్రిందు
**చరణములు :**

1. వాటమైనతటములందు దోటలెంతొ సొంపుమీద
గూటములను సౌధరాజికుదిరి మెరయగా
మాటుమణగి శివుని జటాజూటమునను గంగపగిది
కోట హృదయములందు జలము కొమరియమరియుండును (ఊటి)

2. పండువెన్నెలచటి పవలు పావకుండు రాత్రులందు
దండనుండి యింటనింట దయను బ్రోవగ

నెండదాడికోడి సీతుకొండ వట్టెనేయనగ
నిండుకొలువు హేమంతముండియిచట వెలసెను (ఊటి)

3. వెన్నుని సిగన మరియున్న వేల్పుతరుల విరుల మాడ్కి
సన్నసన్నవెండి మబ్బుచరియలంటగా
మిన్నుబాయ సంజకాడు మేళవించురంగులనగ
వన్నె వన్నెపూలగములు వనము గ్రమ్మిమెరయును (ఊటి)

గురజాడ తెలుగుపదాల ప్రయోగం ఈ పాటలో వీనుల విందుగా సాగింది. పద ప్రయోగంతో పాటు ఆలంకారిక ప్రతిభను కూడ గురజాడ ఈ పాటలో ప్రదర్శించారు. శివుని జటాజూటంలోని గంగలాగా కోట హృదయంలో జలం కొమరి ఉందని పోల్చటం సముచితంగా ఉంది. ఎండదాడికి భయపడి సీతువు కొండపట్టెనేమో అనటంలోని ఉత్ప్రేక్ష గురజాడ ఊహాశక్తిని ప్రదర్శిస్తున్నది. సన్నసన్న వెండిమబ్బులు వెన్నుని సిగలో అలంకరించబడిన కల్ప వృక్ష పుష్పాలను పోలి ఉన్నవని గురజాడ చెప్పిన తీరు బాగుంది. మొదటి రెండు గేయాల్లోనూ ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించిన గురజాడ మూడవ గేయంలో ఉమాపతి యర్చన గావిస్తూ తన ప్రతిభను ప్రదర్శించాడు.

**ఉమాపతియర్చన : రాగము – భైరవి తాళము – చాపు, మిశ్రజాతి**

**పల్లవి :** ఉదకమండలమున – నుమాపతియర్చన
కోటిగుణితమై – కోరిక లీడేర్చును.

**అనుపల్లవి :** వెల్లనౌమబ్బులు –విరిసి వెన్నెలగాయ
వెండికొండని సురలు – వేడ్కతోరాగ

**చరణములు :**

1. కర్పూరతరువులు – కంబములైతోప
మిన్నుపందిరిబోల – మించుదివ్వెలుగా
బచ్చుల హసియించు – పచ్చికపై విరు
లచ్చరలిడు ముగ్గు – టచ్చున వెలయగ

2. దేవదారుతరులు – దివ్యగంధములీన
యక్షగానముమీరి – పక్షులు పలుక
రసితమల్లదే శంఖ – రావమై చెలగంగ
దీవలేమలుపూలు – తిరముగ గురియగ

3. ఆశ్రితవరదు – దంబికా రమణుడు
బాలచంద్రమౌళి – భక్తికినెదమెచ్చి

రాజరాజపుత్రి – రాజ్ఞినప్పలకొండ

యాంబ బ్రోచుగాత – నధిక సౌఖ్యములిచ్చి

–గురజాడ ఈ పాటలో కూడా ఉదకమండల సౌందర్యాన్ని వర్ణించారు. మొదటి రెండు చరణాల్లో ప్రకృతి శోభను వర్ణించి మూడవ చరణంలో శివుడు అప్పలకొండయాంబను రక్షించి, అధిక సౌఖ్యాలను ప్రసాదించాలని కాంక్షించారు.

కర్పూరవృక్షాలు స్తంభాలుగా, ఆకాశమే పందిరిగా, మెరుపులే దీపాలుగా, అందమైన పచ్చికబయళ్ళు అప్సరసలు దిద్దిన రంగవల్లులుగా గురజాడ భావించిన తీరు ప్రశంసనీయంగా ఉంది.

గురజాడ నీలగిరి పాటల్లో మరొకటి చమత్కారయుతంగా సాగింది. 'నాటిమాట' పేరుతో ఈ పాట ఉంది.

**నాటిమాట :– రాగము – అఠాణా, తాళము – రూపకము**

**పల్లవి :** నాటిమాట మరచుట యే

నాటికైన మరవ వశమ

**అనుపల్లవి :** బోటి ప్రాణమీవంటి, ము

మ్మాటికినిను విడనంటి

**చరణములు**:

1. మాటమూటగట్టుకొని
   పాటిదప్పితనుట నా పొర
   పాటుగాక, మాటననే
   పాటిర నీ సాటి దొరకు

2. బ్రతుకునందు లేని స్థిరత
   వెతకనేల భాషయందు
   నతుకువేషభాషకోడు
   నతివలదే తప్పుగాక

3. సాటిలేదు నాకంటి వా
   మాట నిజము నేడుగంటి
   సాటికలదెనమ్మి భంగ
   పాటుపడిన పడతికెందు

4. మేటిపైన నీయెద మొగ
   మాటమెటులబాసె, నొక్క



మాటురా, నీ యోటుమాటె

కోటిధనములిచ్చికొందు

–చమత్కారపూరితమైన భాషణతో సాగిన ఈ పాటలో నాటిమాటను మరిచిపోవటం సాధ్యం కాదని స్త్రీ పురుషుల మధ్య సాగిన సంభాషణ ఉంది. 'నీవే ప్రాణమని, ముమ్మాటికీ నిను విడువనని పలికిన బోటితో మిత్రుడు పలికినప్పుడు మాట తప్పటం పొరపాటేనని బోటి ఒప్పుకొంది. గురజాడ ఈ గేయంలో భాషకు సంబంధించిన అద్భుతమైన భావాన్ని పొందుపరిచారు. బ్రతుకులో స్థిరత్వం లేదు కాబట్టి భాషలో స్థిరత్వాన్ని వెదకవలసిన అవసరం లేదన్నారు. అంటే భాష స్థిరంగా ఉండదని కాలాన్ని బట్టి మారుతుందని, మారాలని గురజాడ భావం. రెండవ చరణంలో తప్ప, పల్లవి, అనుపల్లవి, మిగిలిన చరణాల్లోని 'ట'కార ప్రాస వీనుల విందుగా ఉంది.

**లేవొకోమంత్రములు :** గురజాడ లేఖిని నుంచి వెలువడ్డ మరోపాట ఇది. లేమగా చెయ్యటానికి మంత్రాలు లేవా అని అడుగుతున్న తీరులో చమత్కారంగా సాగిన పాట ఇది. శంకరాభరణం రాగంలో, ఝుంపతాళంలో ఈ పాట సాగింది.

1. లేవొకో మంత్రములు – లేమగా – జేయనిను
   లావపుడు బయలుబడునొక్కొ
   కావనుచు నీలాటి – కాంతునకుజిక్కి నీ
   భావముల నలయికను బడుదొ.

2. మంచియును చెడ్డయును మానమును గనుక పటు
   వంచనను పరకాంతదగిలి
   యించుకయినను లోకమెంచునని భీతిలక
   కొంచెతన మూనుటది కొమరో

3. మగడవై పగతీర్చు పగతుడవుకాకనిది
   తగునటర తలపోయకుంట
   మిగిలినది లేదురిక మీద నిను నమ్మనా
   నగధరుని నమ్మెదను లేరా

– ఒక స్త్రీ పలుకుల్లో ఈ పాట సాగింది. తనకాంతుని లేమగా మార్చటానికి మంత్రాలు లేవా అని పలికిన కాంత పలుకులీ గేయంలో ఉన్నాయి. తన కాంతుని లేమగా మారిస్తే అప్పుడతని బలం బయటపడుతుందని పలికింది. పరకాంత పట్ల వ్యామోహాన్ని కలిగి ఉండటం తగదని హెచ్చరించంది. ప్రియుని నమ్ముకోవడం కంటే నగధరుని నమ్ముకోవటానికి కాంత నిశ్చయించుకోవటం ఈ పాటలోని కొసమెరుఋపు.

**చిత్తరువని చూడ : రాగము – శంకరాభరణము, తాళము — మిశ్రజాతిచాపు** గురజాడ రచించిన నీలిగిరి పాటల్లో ఇది చివరిది.

**పల్లవి :** చిత్తరువని చూడ జిత్తము గొంటిని
చిత్తజునపరంజి – చిలుక యెవ్వతెవే
**అనుపల్లవి :** వత్తువా నా మ్రోల – వలరాజువేడిన
మత్తకాశిని నీదు – మనమైననీగదె

**చరణములు :**

1. ఇచ్చిపుచ్చుకొంట – యిలలోని మర్యాద
 ముచ్చిలిమౌనము – మెచ్చుదురట, లే
 వచ్చి చూచినంత – వంచన జేయుదె
 పచ్చి దొంగతనము – పడతిరొ పరువె
2. మనసులేని తనువు – మరియేలనే నాకు
 చెనటిదీనిగూడ –చేకొన దగవె
 వానికి బదులొక్క వాక్కు నే వేడెద
 మానిని యీపాటి మన్నింపజెల్లునె.
3. విలువచాలదన్న విరివిల్తు పైనాన
 కలుగు జన్మముల – గానుకకొనవే
 ఎలమినానందేంద్రునేలిన వెన్నుడు
 పలుతెలుగుల మేలు – పడతినీకిచ్చునె'

–నాయికకు, అపరంజి చిలుకకు జరిగిన సంభాషణ ఈ పాటలో ఉంది. చిత్తరువని చూడాలని నాయిక మనసు పడిన నాయిక మన్మథుని బంగారు చిలుకా యెవ్వతెవే అని ప్రశ్నించి, వలరాజు కోరుకొంటే నా సమీపం లోనికి వస్తావా? కనీసం నీ మనసైనా ఇస్తావా? అని చిలక అడిగింది. 'ఇచ్చిపుచ్చుకోవటం ఈ లోకంలో మర్యాద; అనే ప్రబోధం బాగుంది. మనసులేని తనువు వల్ల ప్రయోజనం లేదన్న మాట కూడా సముచితంగా ఉంది. వెన్నుని దీవెనల్ని కూడా చిలుక నాయికకు అందించింది.

గురజాడ నీలగిరి పాటల్ని గమనించినప్పుడు ఇవి రాగ తాళబద్ధంగా రచించబడ్డాయి. కాబట్టి గురజాడకు సంగీత జ్ఞానం ఉన్నదని మనం అంగీకరించక తప్పదు. ప్రతిపాట పల్లవి, అనుపల్లవులతో సాగింది. అచ్చతెనుగు పదాలను ఎక్కువగా ఈ పాటల్లో ప్రయోగించి గురజాడ శ్రావ్యతను సంతరింపచేశారు. 1862వ సంవత్సరం సెప్టెంబరు 21వ తేదీన జన్మించిన గురజాడ 1915వ సంవత్సరం నవంబరు 30వ తేదీన మరణించినా ఆయన రచనల ద్వారా శాశ్వతంగా వెలుగొందుతున్నారని చెప్పటం సముచితం. •

# గురజాడ...
# వ్యక్తిత్వం - తత్త్వం



**విహారి**
**Ph: 98480 25600**

గురజాడని మార్గదర్శిగా అభివర్ణిస్తూ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 'దేశం ఎంతగా పతనమైపోవాలో అంతగా పతనమైనప్పుడు, మానవతా విలువలు ఎంతగా దిగజారి పోవాలో అంతగా దిగజారి పోయినప్పుడు, తెలుగు భాష ఎంతగా భ్రష్టుపట్టిపోవాలో అంతగా భ్రష్టుపట్టిపోయినప్పుడు పుట్టుకొచ్చాడీ మహానుభావుడు' అని ప్రశంసించారు.

గురజాడ వ్యక్తిత్వంలోని తేజోరేఖల్ని ముందుగా చెప్పుకుందాం.

గురజాడ పొద్దుచాలని కృషీవలుడు. ఒకేసారి వందపనులు చేసేవాడు. ఆటలు, చదువు, పరిశోధన, వాదనలు, పుస్తకపఠనం, వీణావాదన సాధన, ఈత, గుర్రపుస్వారీ, టెన్నిస్, బిలియర్డ్స్ – కొన్ని తన 'జీవుని వేదన'ని తృప్తిపరచటానికైతే, కొన్ని రాజసేవకు ఆవశ్యకాలు.

గురజాడ మేధ – సర్వమూ ఆకళించుకున్న శక్తి కలిగినది. దానిది పూర్ణప్రజ్ఞ. బహుముఖీనత్వం. కన్యాశుల్కంలో ఆయన వాడుకున్న ప్రాచీన జానపద వైభవాన్ని చూడండి. శతకవాఙ్మయమూ, తత్త్వాలూ, జనం నోట నానిన పాటలూ – అన్నీ ఆయనకు ఉపకరించాయి. (సారా కొట్టు సీనులో దుకాణదారు పాడే వేమనపద్యం. దాన్ని అతను పాడినతీరు – గుర్తుకొస్తుంది!)

గురజాడ జ్ఞానతృష్ణ ఎల్లలు లేనిదనిపిస్తుంది. కోర్టు కేసుల కోసం, న్యాయవాదులకి అవసరమైనప్పుడు సలహాలివ్వడం కోసం – తానుగా 'లా' చదవటం ఒక విశేషమైతే, ఆ చదువుతో ఆనాటి మద్రాస్ ప్రభుత్వ ఎకౌంటెంట్ జనరల్ ఏ.జి. శ్రీనివాసయ్యంగారినే ఆశ్చర్యచకితుణ్ణి చేయటం మరో విశేషం. అలాంటివే, యూనివర్శిటీ కాంపోజిషన్ కమిటీ పోరాటాలు. 'మినిట్ ఆఫ్ డిసెంట్' రచన, గురజాడ వ్యాసాలు చూస్తే, ఏ విషయాన్ని గురించి అయినా కూలంకషంగా పరిశోధించి నిర్ణయాలకి రావటం అనేది ఆయన పరిశోధనల జీవలక్షణం అనిపిస్తుంది. ఆయన వ్యాసాల్లో 'ఆంధ్రకవితాపిత – 1' 'ఆంధ్ర కవితాపిత 2–' ఉన్నై. విషయం – 'బెజవాడలో యుద్ధమల్లుని శాసనం రాజరాజనరేంద్రుని కన్నప్రాచీనమైనదీ అవునా, కాదా?' అనేది గురజాడ అవుననే అభిప్రాయాన్ని ప్రకటించారు. ఈ వ్యాసాల్లో ఆయన చూపిన ఆధారాలూ, చేసిన చర్చలోని విస్తృతమైన, నిశితమైన పూర్వాపరాల ఉటంకింపులూ గమనిస్తే – గురజాడ దీక్షకీ, చిత్తశుద్ధికీ, సూటితనానికీ

ఆశ్చర్యపోతాము. ఒకవైపు లిపిపరంగానూ, మరోవైపు శాసనం వేయించిన రాజుపరంగానూ, కాలంపరంగానూ సాగించిన చర్చా, విశ్లేషణా, తీర్పు – గురజాడ గవేషణాధిషణకి అద్దం పడతాయి. 'ఆధునిక ఆంధ్రవచనరచన' అనే వ్యాసమూ గురజాడకి గల సత్యాన్వేషణ నిబద్ధతకి దర్పణంగా నిలుస్తుంది. విజ్ఞాన చంద్రికా మండలి వారి ప్రచురణల గురించీ, అందునా ప్రత్యేకించి 'విజయనగర




సామ్రాజ్యము' అనే నవల గురించీ – నిష్కర్షగా, నిజాయితీగా లోపాల్ని చెప్పి నిగ్గుతేల్చారు.

**వ్యక్తిగా గురజాడ కష్టజీవి :** చిన్నతనం నుంచీ కూడా తన శక్తికి మించిన శ్రమకు అలవాటు పడినవాడు. అనేక బాధ్యతల్నీ, బరువుల్నీ నెత్తికెత్తుకునే తత్వం. అవన్నీ స్వీకృతాలూ, స్వీయకృత్యాలే! ఆయన దినచర్యని పరిశీలిస్తే ఎన్నో అబ్బురపరిచే అంశాలే గోచరిస్తాయి. ఒక్క సంగతి చూడండి. అతి విస్తృతమైన పుస్తకపఠనం, ఐదువందల పేజీల గ్రంథాన్నైనా – అతివేగంగా రెండుమూడు రోజుల్లో ఆకళింపు చేసుకోగల ధీధిషణలు. అవీ వయసుకు మించిన శక్తియుక్తులు. చదివిన విషయాన్ని కూలంకషంగా అర్థం చేసుకుని, సాధికారికతతో, ఉటంకింపులతో సహా ఆ విషయాన్ని మళ్ళీ స్పష్టీకరించే ప్రజ్ఞ ఆయనది. ఫిలాసఫీ చదివిన తాను 'వేదాంతులకే తత్వోపదేశం చేయగలరని' ఆయన చెప్పుకుంటూ వుండేవాడని – గురజాడ కుమారుడు రామదాసు గారు గుర్తు చేసుకున్నారు. అలాగే, ఆయనకి ఇంగ్లీషు, కన్నడం, బెంగాలీ, పారశీకం, గ్రీకు, లాటిన్ భాషల్లో అపారమైన అభినివేశం ఉంది. ఎఫ్.ఏ చదువుతూ వుండగానే ఇంగ్లీష్‌లో రాసిన 'సారంగధర' పద్యాలూ, వాటి వైశిష్ట్యం, సాహితీలోకానికి ఎఱుకే.

★★★

గురజాడ వ్యక్తిత్వమూ, సాహిత్యవ్యక్తిత్వమూ కలిసి మూడు రంగాల్ని తీవ్రంగా, గాఢంగా, విస్తృతంగా ప్రభావితం చేశాయి. అవి – సామాజిక, భాషా, సాహిత్యరంగాలు.

గురజాడ అచ్చమైన ప్రజాస్వామ్యవాది.

'నాది ప్రజల ఉద్యమము. దానిని ఎవరిని సంతోషపెట్టటానికైనా వదులుకోను' అని నిర్ద్వంద్వంగా ప్రకటించిన ధైర్యశాలి గురజాడ. అందుకే కిళాంబి రంగాచార్యులు గురజాడని 'ప్రజాసామాన్య రక్తధ్వజము నెత్తిన కవీంద్రుడాయన' అన్నాడు. సంస్కరణాభిలాషిగా, అభ్యుదయాకాంక్షిగా, నూతన ప్రక్రియా ప్రయోగశీలిగా,

దార్శనికుడుగా గురజాడ 'తెలుగు సారస్వతానికి సరిహద్దు!' 'చలనశీల సాహిత్య స్రష్ట'.

'..... ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం వుంటాయి. సామాజిక, చారిత్రక పరిణామ గమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలీ, ప్రతిభాశాలీ అయితే ఆ గమనాన్ని అతడు మరింత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవపంథాలలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను' అంటాడు శ్రీశ్రీ – గురజాడ ఆధిపత్యానికి కారణాలు' అన్న వ్యాసంలో.

గురజాడ మౌలిక తాత్త్వికతని విహంగవీక్షణం చేస్తే – తాను ప్రభావితంచేసిన మూడురంగాల్లోనూ 'ఆధునికత'ని ప్రవేశింపజేసినవాడు ఆయన.

సంఘసంస్కరణ అనేది గురజాడ తత్త్వంలో ప్రాథమిక లక్షణం. ఆ సంస్కరణలో మానవ జీవనంలోని అన్ని పార్శ్వాలూ ఇమిడి ఉన్నాయి.

ఆయన నిర్ద్వంద్వంగా ప్రకటించిన కొన్ని ఆచరణాత్మక వాంఛితాలు ఆనాటి ప్రజల్ని అమితంగా అబ్బురపరచాయి. ఒక్క 'దేశభక్తి' గేయాన్ని విశ్లేషించుకుంటేనే, ఆయనది ఎంత ఆధునికభావనో, ఆయన ఎంతటి విశ్వమానవ ప్రేమికుడో అర్థమవుతుంది.

'మంచిచెడ్డలు మనుజులందున యెంచి చూడగ రెండె కులములు / మంచియన్నది మాలయైతే మాలనే అగుదున్' అన్నాడు. 'మాలవాడు కనపడగానే భ్రాతృత్వం చాలాదూరం పలాయనం చేస్తుంది. మాలవాణ్ణి చూడగానే అమాంతం కౌగలించుకోని వాడికి దేశమాత పేరు ఎత్తడానికి అర్హత లేదని నా గట్టి నమ్మకం' అనగలిగిన ధీరుడు గురజాడ.

'ఎల్లలోకము వొక్క యిల్లై, వర్ణభేదములెల్ల కల్లై వేలనెరుగని ప్రేమ బంధము వేడుకలు కురియ' అనే విశాల దృష్టితో, అభ్యుదయకామనతో సాహిత్యకృషి చేసిన గురజాడ దేశాభిమాని మాత్రమే కాదు, విశ్వమానవ ప్రేమికుడు. 'అన్నదమ్ముల వలెను జాతులు మెలగవలెనోయ్' అని సార్వజనీనమైన శుభాకాంక్షలు గుండెనిండుగా కలిగిన సంఘ సంస్కరణాభిలాషి.

'పుట్టుక వల్ల గొప్ప రానేరాదు. గుణయోగ్యతల వలననే గొప్పవచ్చును' అని స్పష్టంచేశాడు. 'మలిన దేహుల మాలలనుచును / మలిన చిత్తుల కధిక కులముల / నెలవొసంగిన వర్ణధర్మము / అధర్మ ధర్మంబే' అనేది వర్ణవ్యవస్థ నిరసన.

మతాన్ని గురించి కూడా గురజాడది నిశ్చితమైన అభిప్రాయమే. 'అద్వైతం ఎండమావి మాత్రమే... ప్రపంచం యొక్క అచ్చమైన తత్వం స్వార్థత్యాగంలో, పరోపకారంలో వుంది. స్వార్థ త్యాగానికి దారితీయగల ప్రేరణకు ప్రేమను మించింది వుందా? మానవాళి పూసిన అత్యంత ఉజ్వలమైన పుష్పం ప్రేమ, వెర్రిప్రేమకాదు, వ్యామోహం కాదు, అందమైన ఆత్మల సౌందర్యాన్నీ, స్ఫటిక స్వచ్ఛతను మెచ్చుకోవడం, పరోపకారం, దయా, శాంతీ, నిశ్చలత్వమూ, – మనోహరమైన రూపురేఖల ద్వారా తొణికిసలాడే సౌందర్యం, మంచితనమే దైవం. మంచితనాన్ని ప్రేమించడం దైవ ప్రేమను వ్యక్తం చేసే సూటిదారి' అని సందేశించాడు గురజాడ.

**భాషా సాహిత్యాల విషయానికి వస్తే గురజాడ తత్త్వం 'పాత కొత్తల మేలుకలయిక' గా రూఢి అవుతుంది.**

గురజాడ తాత్విక చింతనలోని మూలసూత్రం కూడా ఆయన సాంస్కృతిక అన్వీక్షణని తెలుపుతుంది. 'మంచిని ప్రేమించడమే దైవమును ప్రేమించడము. దుర్గుణములను రోసి, ఆత్మసుగుణ సంపత్తిని పెంపొందించుకుంటున్న కొద్దీ, ఆ దివ్యత్వమును పొందుతుంది' అంటాడు.

'మన సామాజిక నీతిసూత్రాలు' అనే అంశాన్ని తన లేఖల్లో ప్రస్తావించాడు గురజాడ. 'అనుస్యూతంగా మనస్సు నంటిపెట్టుకున్న భావాల్ని పరిగ్రహించవలసిన అవసరాన్నీ, 'సెంటిమెంటులో వున్న సత్యమును' అన్వేషించవలసిన ఆవశ్యకతనీ – గుర్తుచేస్తాడు. నీతి, నైర్మల్య, పవిత్రతలనే భావాలకు గల నిజస్వరూపాన్నీ, నిజతత్వాన్ని – వింగడించి చూడమంటాడు. 'సమాజం నిర్ణయించిన కొన్ని శాసనాలు ఉన్నాయి. వాటిని గౌరవించడం మన విధి' అయితే, 'ఈ సాంఘిక శాసనాలు, ధర్మాలు లోపభూయిష్టంగా వున్నప్పుడు వాటిని మనం బాహాటంగా ఎదుర్కొని సంస్కరింపవలసి వుంటుంది....' ఇదీ సాంస్కృతిక దృక్పథం!

భాషా సాహిత్యాల విషయానికి వస్తే గురజాడ తత్త్వం 'పాత కొత్తల మేలుకలయిక' గా రూఢి అవుతుంది.

ఆధునిక సాహిత్య ప్రక్రియల రూపకల్పనలో, నిర్మాణంలో గురజాడ రచనా వైశాల్యం కన్నా కూడా, రచనలో లోతుని ఎక్కువ చూపాడు. ముందుతరాల్ని అందుకోమన్నాడు. తన ఆధునిక భావధారనీ, వాడుకభాష ఆశయాన్నీ, నూత్న శిల్పనైశిత్యాన్నీ, విస్తృతం చేసుకోమన్నాడు. స్రష్టగా అదీ గురజాడ! 'తన నాటి వరకూ ఉన్న పాత రచనల్లో యంత్రత్వం, కృతకత్వం, అశ్లీలతా, ఆడంబరత్వం మాత్రం విసర్జించి, మహాత్మ్యం స్వీకరించి, పాతకొత్తల మేలుకలయికలో ఆకర్షణ సహజరీతిని సాధించి, ముట్టినదంతా రసవంతం చేసిన సువర్ణయోగి గురజాడ అప్పారావు' అన్నారు ఆనాటి భమిడిపాటి కామేశ్వరరావుగారు.

సాహిత్య ప్రక్రియల్లో ముఖ్యమైన – కవిత్వం, కథానిక, నాటకం – ఈ మూడిటిలోనూ మొట్టమొదటిసారిగా, వస్తుగతంగా, శిల్పరూపగతంగా భాషాపరంగా ఆధునికతను అందించినవాడు గురజాడ. కవిత్వపరంగా – ముత్యాలసరాలు సృజన, కథానిక పరంగా ఐదు ఆణిముత్యాలు, నాటకంగా 'కన్యాశుల్కం' ఈ మూడు వైవిధ్యభరితమైన రచనల మీదా – పుట్టెడు వివరణ విశ్లేషణ, చర్చ, వాఙ్మయం మనముందు కొచ్చే వున్నై. ప్రయోగశీలిగా ఈ ప్రక్రియల ఆధునికతకు ఆయన ఆద్యుడు.

కవిత్వపరంగా – ప్రయోగశీలిగా –తెలుగు సాహితికి ఆయన అందించిన

> **నాటక రచన పరంగా 'కన్యాశుల్కం' గురించి ఏకంగా ఒక వాఙ్మయ భాండాగారమే ఉంది తెలుగువారికి! భాషా సాహిత్య, ప్రక్రియా, ప్రయోగ విషయంలో ప్రపంచ సాహిత్యంలోనే అది ఉత్తమోత్తమైనదని కీర్తిగన్నది కదా!**

'ముత్యాలసరాలు' జగమెరిగినవే. అభ్యుదయకామనతో పునఃసృష్టి చేసిన 'లవణరాజు కల', 'పూర్ణమ్మ', 'కన్యక' వంటివన్నీ ఆయన వదలివెళ్ళిన 'అడుగుజాడ'లే! కవిత్వశాఖల్లో – ఆత్మాశ్రయకవిత్వం, ప్రబోధకవిత్వం, సంస్కరణ కవిత్వం, ప్రణయకవిత్వం – మాత్రమే కాక, బాలగేయం కూడా – వెలయించి తన మార్గదర్శకత్వాన్ని మనముందు నిలిపాడు గురజాడ.

నాటక రచన పరంగా 'కన్యాశుల్కం' గురించి ఏకంగా ఒక వాఙ్మయ భాండాగారమే ఉంది తెలుగువారికి! భాషా సాహిత్య, ప్రక్రియా, ప్రయోగ విషయంలో ప్రపంచ సాహిత్యంలోనే అది ఉత్తమోత్తమైనదని కీర్తిగన్నది కదా!

గురజాడ బహుముఖీనమైన ప్రజ్ఞా, ప్రయోగదక్షతల్లో ఒక పాయ ఆధునిక కథానికా ప్రక్రియ. ఆయన నెరిపిన అనన్య సామాన్య మార్గనిర్దేశకత్వం ద్యోతకమవుతోంది దీనిలో. గురజాడ రాసిన కథానికలు ఐదు. దిద్దుబాటు, మీ పేరేమిటి? మెటిల్డా, పెద్దమసీదు, సంస్కర్త హృదయం. వీటిలో 'దిద్దుబాటు' ఆంధ్ర భారతి 1910 ఫిబ్రవరి సంచికలో ప్రచురితమైంది. ఇది తొలి తెలుగు కథానికగా 'ఒక గుర్తింపుకూ, గణనీయతకూ' పాత్రమైనది. కథావస్తువులోని క్లుప్తత, స్పష్టత, నాటకీయతా – ప్రారంభమైన తర్వాత ఒకటి రెండు గంటల వ్యవధిలోనే కథానిక ఆఖరైపోయిన తీరు... ఈ లక్షణల వల్ల 'దిద్దుబాటు' ఒక నమూనా కథానికగా నిలిచిపోతుంది. 'కథానిక పైన లక్షణ గ్రంథాన్ని రాయకపోయినా, మంచి కథకు ఉండవలసిన లక్షణాలేవో ఊహించుకోడానికి వీలుగా అప్పారావు పంతులు భావి కథకుల ముందుంచిపోయిన లక్ష్యం – దిద్దుబాటు!' అంటూ భాష విషయమూ ఆ తర్వాత స్పృశించారు మధురాంతకం రాజారాం. 'ఆధునిక తొలి తెలుగు కథానికగా ఈ కథ ఎన్నదగింది. అంతకు ముందు వివిధ రచయితలు రాసిన కథలలో ఎటువంటి శిల్పం లేదు' అన్నారు డా.భాస్కర స్వర్ణాంబ. 'చిన్నకథ అప్పారావు మానస పుత్రిక' అన్నారు కె.వి. రమణారెడ్డి.

'ఆధునిక స్త్రీలు మానవ చరిత్రను తిరిగి రచిస్తార'నే అభ్యుదయ కాంక్షని' వందేళ్ళ ముందే పేర్కొన్న గురజాడ దార్శనికత మహత్తరమైనది – నిజానికి 'దిద్దుబాటు' ఆయన ఆశాభావానికి అచ్చమైన వ్యాఖ్యానం. 'మెటిల్డా' కథలోనూ దయనీయమైన వివాహిత జీవితమే కథావస్తువు. మతమౌఢ్యం వెర్రితలలు వేయడాన్ని నిరసిస్తూ రాసిన కథలు 'మీ పేరేమిటి?', 'పెద్ద మసీదు'. ఈ కథల్ని దృష్టిలో ఉంచుకొని 'మత మౌఢ్యాన్ని తీవ్రంగా నిరాకరించే రచనలు గురజాడ కథల తర్వాత రాలేదనే చెప్పాలి' అన్నారు కె.కె.

రంగనాథాచార్యులు. కథానికాంశాల్లో సామాజిక వాస్తవికత ఆవశ్యకతని స్పష్టీకరిస్తూ గురజాడ రాసిన కథానికలూ, ఉగ్గడించిన అభిప్రాయాలూ – కథకులకు మార్గనిర్దేశం చేశాయి.

గురజాడ సాహిత్యంలో కాంతిమంతంగా కొట్టొచ్చినట్టు కనిపించే మౌలిక తత్త్వం – అభ్యుదయకామన, సంఘ సంస్కరణాభిలాష, వాడుక భాష ప్రయోగం, దాని వినియోగం. ప్రక్రియల పరంగా వస్తుశిల్ప నిర్మాణ విధానాల్లో వినూత్నత. తానే ఆద్యుడుగా వాటికొక స్థిరమైన రూపకల్పన చేసిపోయాడు. సమకాలీన సామాజిక స్పృహకి ఎత్తిన వైజయంతికగా వాటిని మలచాడు. 'కొత్త మిన్కుల తెలివిపటిమను మంచి చెడ్డల మార్చితిన్' అన్నాడు. 'జీవితాన్ని నూత్న దృక్పథంతో దర్శించి కథాకవితారూపాల్లో దాని తత్త్వాన్ని అన్వయించటానికి ప్రయత్నించాను' అని తన హృద్దర్శనాన్ని తానే ప్రకటించాడు. వాడుకభాషలో విద్యాబోధనకు పోరాటంలో ఆయనది ఎక్కటి పోరు. మడమతిప్పని ధైర్యస్థైర్యాలతో తన ఆశయాన్ని ప్రకటించాడు. 'సంకెళ్ళను ప్రేమించే వాళ్ళు గ్రాంథిక భాషను ఆరాధిస్తారు గాక! నాకు మాత్రం నా మాతృభాష జీవద్భాష. అది 'ఇటాలియన్ ఆఫ్ ద ఈస్ట్'. ఈ జీవద్భాషలో మన సుఖాన్నీ, దుఃఖాన్నీ వెల్లడించుకోవడానికి మనం సిగ్గుపడటం లేదు. కానీ, దీన్ని వ్రాయడానికి మాత్రం మనలో కొంతమంది బిడియపడుతున్నారు. వ్యావహారిక భాషలో వున్న సాహిత్యం రైతును మేల్కొలుపుతుంది. భారతదేశంలో వున్న ఆంగ్లేయుడి గుండె కుదుపుతుంది. దాని శక్తి అపారం. అవకాశాలు అనంతం' అని అనంతమైన విశ్వాసాన్నీ, చిత్తశుద్ధినీ ప్రకటించారు. తన ఆశయ కారణాన్ని పారదర్శకం చేశారు. వాడుక భాషాపరంగా ఆయన పోరాటపటిమకు 'మినిట్ ఆఫ్ డిసెంట్' ఒక్కటే చాలు. వెయ్యి నిదర్శనాలు పెట్టు అది!

'వాస్తవిక రచన మానవజీవితం' అనే అంశం మీద రాస్తూ 'కవితాకళకు నేను లొంగి వుండవలసిన వాడనే. అయినా నాకు మానవసమాజం పట్ల మహత్తర బాధ్యత వున్నది' అంటాడు. 'ఏమిటి బాధ్యత?' ఒక దోషాన్నీ, ఒక దుర్నడతనీ, అవినీతినీ ఆకర్షవంతం చేయకపోవడం. 'చేయలేదనే భావిస్తున్నాను' అన్నాడు. కళాసాహిత్య రూపాలు గాడితప్పితే, సాంస్కృతికంగా సమాజానికి మంచి జరగదని భావం. 'మానవ జీవితంతో నేను చెలగాటం ఆడ్డం లేనేలేదని యీ నాటకం (కన్యాశుల్కం) చదివితే నీకు తెలుస్తుంది' అని ఎంతో చిత్తశుద్ధితో అన్నాడు.

'మానవ స్వభావంలోనే పరస్పర వైరుధ్యం వుంది' అనే సార్వకాలీనమైన సత్యాన్ని చెబుతూ కనుకనే మధురవాణి పాత్రను చివరి అధ్యాయంలో సంస్కరించాను' అని చెప్పుకున్నాడు.

సంస్కృతి నిర్మాణం, ఆవిష్కరణ – మనుషుల వైయుక్తికమైన వైరుధ్యాల్లో ప్రతిఫలిస్తూ సామాజికవర్తనలో కొన్ని కొన్ని నమూనాలుగా రూపమెత్తుతుంది. ఆ వైరుధ్యాల్ని పట్టుకొని వాటి వాస్తవ స్థితిని యథాతథంగా చిత్రించటం రచయితకి ఒక బాధ్యత. దానితోపాటుగా ఆ వైరుద్యాల మూలకారణాల్ని విశ్లేషిస్తూ, సామాజికంగా వున్న అవాంఛనీయతని

వ్యాఖ్యానించటం మరొక కర్తవ్యం. ఈ రెండు కర్తవ్యాల నిర్వహణలో రచయిత సాంస్కృతిక ప్రాపంచిక దృక్పథం ద్యోతకమవుతుంది. ఆ రచయిత సూచించే సంఘ శ్రేయోభిలాషా బయటపడుతుంది.

మధురవాణి పాత్ర సంస్కరణలో తెలిసే అంశాలు ఇవే: 'సానిపిల్లలో వుండే మానవత్వాన్ని నువ్వు మరచిపోకు. ఆమె విచారం, కన్నీళ్ళు, సంతోషం, ఆనంద బాష్పాలూ, నీ నా సుఖదుఃఖాలవంటివే. మన అనుభూతులవలెనే అవీ గంభీరమైనవే! ఉదాత్తమైనవే!' అంటాడు.... 'ఇప్పుడున్న భావాలు పోయి, వీటి స్థానే కొత్తవి రావలసిన అవసరానికి, అగత్యానికి మానవపరిణామం దారితీస్తున్నది. కంటి ఎదుట శూన్యం. స్త్రీ పురుష లైంగిక సంబంధాలకు అనవసర ప్రాముఖ్యము నీయడంలో ఔచిత్యమేముంది? అర్థమేముంది?' అనీ ప్రశ్నిస్తాడు. ఈ సందర్భంలోనే గురజాడ వివాహ వ్యవస్థ మీద కొంత చర్చ చేశాడు. 'మానవజీవితంలో కానీ, లేదా సారస్వత కల్పనలలో కానీ, ఎందులోనైనా స్త్రీ పురుష శారీరకానుభవాలూ, ఆనందాలూ మితిమీరకుండా తదుచిత స్థానాల్లో వుండాలి' అని తన దృక్పథాన్ని చూపుతాడు. సంస్కృతి రాహిత్యానికి కారణమయ్యే స్థితిని నివారించటమే కవికృత్యం అని నమ్మినవాడు గురజాడ.

సాహితీకారునిగా తన కావ్యేతివృత్తాలు భారతీయమైనవి అని విశ్వసించాడు గురజాడ. అవన్నీ సమాజంలోని మనిషి గురించీ, సంఘజీవిగా మనిషి ఉనికి గురించీ, మనుగడ గురించీ రాసినవే. సంఘానికీ, వ్యక్తికీ మధ్యన వ్యుత్పన్నమవుతున్న (సం)ఘర్షణ గురించీ రాసినవే. అలా రాసేటప్పుడు – 'మంచి'ని సాధారణీకరించుకొని, ఆ 'మంచి'ని ప్రేరేపించటానికీ, ప్రోత్సహించటానికీ, నిలబెట్టటానికీ, స్థిరపరచటానికీ – తన కలాన్ని కరవాలంగానే ఝుళిపించాడు గురజాడ. వాడుక భాషావినియోగం నుంచీ, అనేక సాంఘిక సంస్కరణల ఆవశ్యకత వరకూ గురజాడ 'ప్రజల మనిషి'గా నిలిచాడు.

ఒక నిజమైన సాహితీకారుడు ఇలా వుండాలనే నిబద్ధతని చాటి, పాటించటమే గురజాడ సాంస్కృతిక దృక్పథం! అందుకే ఏకంగా 'సాహిత్యం జాతిపరంగా కావాలి. సంస్కృతి సమిష్టి సంపత్తి' అనే అన్నాడు. ఇది ఆధునికత మాత్రమే కాదు, ఒక జీవన తత్త్వం, ఒక దార్శనికత కూడా! అందుకే, ఆయన జాతి వైతాళికుడు, యుగకర్త! ●



# కన్యాశుల్కం నాటకంలో ఆనాటి దేశ రాజకీయాలు



డా. జి.వి. పూర్ణచందు

దేవుడికి వందనం అనే స్థితి నుంచి, దేశానికి వందనం అనే స్థాయికి భారతీయులను మళ్లించిన వాడు బంకించంద్ర చటర్జీ. దేశమంటే మట్టికాదనీ, మనుషులనీ అంటూ, తన దేశభక్తి గీతం ద్వారా స్వదేశీ భావనను రగిలించి తెలుగు జాతికి దిశానిర్దేశం చేసిన వాడు గురజాడ.

1905లో మొత్తం దేశాన్ని కదిలించి వేసిన వందేమాతరం ఉద్యమం లోంచే స్వదేశీ ఉద్యమం పుట్టింది. “జల్దుకొని కళలెల్ల నేర్చుకు/దేశి సరుకులు నించవోయి” అనే వాక్యాలు గురజాడ స్వదేశీ ఉద్యమానికి తార్కాణాలు.

“నాది ప్రజల ఉద్యమం. దానిని ఎవరిని సంతోష పెట్టడానికైనా వొదులుకోలేను” అని తన డైరీలో 1911 మార్చి, 27న గురజాడ రాసుకొన్న మాటలు ఆయనను నవయుగ నిర్మాతగా భాసిల్లచేశాయి.

“విద్యలనెరయ నించిన యాంగిలేయులు” (1912) అనీ, “కన్నుకానని వస్తుతత్త్వము కాంచనేర్చరు లింగిరీజులు; కల్ల నొల్లరు; వారి విద్యల కరచి సత్యము నెరసితిన్” అనీ ఆంగ్లేయులను మెచ్చినప్పటికీ, ఆంగ్లేయ సంస్కృతి పట్ల గురజాడ విముఖతే ప్రదర్శించారు.

“పాశ్చాత్య నాగరికత కొన్ని అంధవిశ్వాసాలను పోగొట్టుతున్న మాట యదార్థమే అయినప్పటికీ, అది ప్రబోధించే స్వాతంత్ర్యము సాంఘిక ప్రగతి శూన్యమైనది. ఇది సంపూర్ణ స్వాతంత్ర్యము కాదు, నామమాత్రమైనది.” ( గురజాడ డైరీ1901–, పుట215/సం: అవసరాల).

“శతాబ్దాల తరబడి రాజకీయ బానిసత్వం వలన మరుగు పడి ఉన్న ఉదాత్త జాతీయ మనః ప్రవృత్తిని విద్యావంతులైన హిందువులకు బహిర్గతం చేసి, వారిలో ప్రభావానికి లోనౌతున్న వ్యక్తులలో అట్టి వృత్తినే కలిగించటానికే ఇది దోహద పడును” (గోమఠం శ్రీనివాసాచార్యులు గారి హరిశ్చంద్ర నాటకం ఇంగ్లీషు అనువాదానికి గురజాడ పీఠిక)

స్వదేశీ ఉద్యమం గురించి చెప్పిన ఈ వాక్యాలు గురజాడ వారి నిబద్ధతను చాటుతాయి.

గురజాడ స్వహస్తంతో వ్రాసిన ‘దేశభక్తి’ గీతం చిత్తుప్రతిలో “నిన్నవచ్చా రింగిలీషులు/ మొన్నవచ్చిరి ముసల్మను; లటు/ మొన్న వచ్చిన వాడ వీవని/ మరచి, వేరులు

బెట్టుకోకోయి" అనే చరణం ఉంది. దీన్ని కొందరు గురజాడ ప్రదర్శించిన ఆంగ్లేయానుకూలతగా భావిస్తారు. నిజానికి ఇది అన్ని కులాల, మతాల వారికీ దేశమే దేవత అనే భావన బలపడుతున్న దశలో అందుకు ప్రతిబంధకంగా నిలిచే వారికి చేసిన హెచ్చరిక. హిందూ శబ్దాన్ని దేశీయులనే అర్థంలో గాక, మతస్థులనే అర్థంలో ప్రయోగించి, ఈ దేశంలో అన్యమతస్థులకు తావులేదని వాదించే వాళ్ళకి ఇది అంటించిన చురక.

గురజాడకు కాంగ్రెస్ రాజకీయాలతో సంబంధాలు బాగానే నడిచాయి. తన డైరీలో 1887 అక్టోబరు,27న విజయనగరం కాంగ్రెస్ సభలో తాను పాల్గొన్నట్టు రాసుకున్నారు. కానీ, కాంగ్రెస్‌లోని మితవాద ధోరణులపట్ల ఆయన తన విసుగుదలని కన్యాశుల్కంలో ఎన్నో పాత్రల ద్వారా ప్రదర్శిస్తారు.

"తమ్ముడూ! గిరీశంగారు గొప్పవారన్షా?" అని బుచ్చమ్మ అడిగితే, వెంకటేశం "గొప్పవారంటే అలా యిలాగా అనుకున్నావా యేమిటీ? సురేంద్రనాథ్ బెనర్జీ అంత గొప్పవారు" అంటాడు, "అతగాడెవరు?" అనడిగితే, వాడికి ఏం చెప్పాలో తెలియక బుర్రగోక్కుని, "అందరికంటే మరీ గొప్పవాడు" అనేస్తాడు. దేశాన్ని గిరీశంగారు "యెలా మరమ్మత్తు చేస్తున్నార్రా?" అనడుగుతుంది. దానికి వెంకటేశం చెప్పిన సమాధానం ఇది:

"నావంటి కుర్రాళ్లకు చదువు చెప్పడం, (నెమ్మళంగా) చుట్టనేర్పడం, గట్టిగా నాచ్చి కొశ్చన్ అనగా సానివాళ్ల నందరినీ దేశంలోంచి వెళ్లగొట్టడం ఒహటి. నేషనల్ కాంగ్రెస్ అనగా దివాన్గిరీ చెలాయించడం ఒహటి. ఇప్పుడు తెలిసిందా...?" అని సమాధానం చెప్తాడు వెంకటేశం. 'నేషనల్ కాంగ్రెస్ అనగా దివాన్గిరీ చెలాయించడం' అని ఈనాటకంలో ఒక బొడ్డూడని కుర్రాడే అన్నప్పటికీ, అది గిరీశం అభిప్రాయంగానే కన్పిస్తుంది. అందుకే మరో సీనులో, గిరీశమే అంటాడు: "ఒక సంవత్సరం గానీ నాకు దేవుడు దివాన్గిరీ యిస్తే, భీమునిపట్టణానికి పాల సముద్రం, విశాఖపట్టణానికి మంచినీళ్ళ సముద్రం, కళింగపట్టణానికి చెరకు సముద్రం తెస్తాను" అని, ఇక్కడ దివాన్గిరీ అంటే కాంగ్రెస్ పదవి. "పొలిటికల్ మహాస్త్రం అంటే, "ఒకడు చెప్పిందల్లా బాగుందనడవే! సమ్మోహనాస్త్రం అంటే అదే కదా...!", "ఒపీనియన్లు అప్పుడప్పుడు చేంజి చేస్తూంటే గానీ పొలిటీషియన్ కానేరడు" లాంటి సంభాషణల్లో కనిపించే నాటి పొలిటీషియన్ నాటి నేషనల్ కాంగ్రెస్ వాడే! దేశంలో రాజకీయ సంస్థ ఆనాడు అదొక్కటే కాబట్టి!

"మొన్న బంగాళీవాడు (బహుశా బిపిన్ చంద్రపాల్ కావచ్చు) ఈ ఊర్లో లెక్చరిచినప్పుడు ఒక్కడికైనా నోరు పెగిలిందీ...?"

"పెళ్ళి ఆపడానికి బ్రహ్మ శక్యం కాదు. డిమాస్థనీసు, సురేంద్రనాథ్ బెనర్జీ వచ్చి చెప్పినా మీ తండ్రి వినడు"

"మొన్న మనం వచ్చిన బండి వాడికి నాషనల్ కాంగ్రెసు విషయమై రెండు ఘంటలు లెక్చరు ఇచ్చేసరికి ఆ గాడిద కొడుకు, వాళ్ల ఊరు హెడ్ కానిస్టేబిల్ని కాంగ్రెసు వారు

యెప్పుడు బదిలీ చేస్తారని అడిగాడు. విలేజెస్‌లో లెక్చర్లు యంత మాత్రం కార్యం లేదు...”

“(దేవుణ్ణి ఉద్దేశించి) యిలాంటి చిక్కులు పెట్టావంటే, హెవెన్‌లో చిన్న నేషనల్ కాంగ్రెస్ లేవదీస్తాను”

“అన్ని మతాలూ పరిశీలించి వాటి యస్సెన్స్ నిగ్గుతీసి ఒక కొత్తమతాన్ని ఏర్పాటు చేశాను. అదే అమెరికా వెళ్ళి ప్రజ్వలింప చేస్తాను” లాంటివెన్నో ఆనాటి రాజకీయపక్షుల మీద వ్యంగ్యాలు కన్యాశుల్కంలో కనిపిస్తాయి.

“దేశాభిమానం నాకు కద్దని/వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్/పూని యేదైనాను ఒక మేల్/కూర్చి జనులకు చూపవోయ్” దేశభక్తి గీతంలోని ఈ చరణంలో వొట్టి గొప్పలు చెప్పుకోవద్దంటూ పెట్టిన వాత ఎవరిని ఉద్దేశించో తెలియాలి.

నేషనల్ కాంగ్రెసుకు ఆ తొలినాళ్లలోనే అంతగా వాతలు పెట్టటానికి బలమైన కారణాలే ఉన్నాయి. 1905లో లార్డ్ కర్జన్ బెంగాల్ రాష్ట్ర విభజనకు నిరసనగా బెంగాలీలు విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమం ప్రారంభించారు. ఆ సమయంలో వందేమాతరం గీతం బెంగాలంతా ప్రతిధ్వనించింది. అది వందేమాతరం ఉద్యమంగా ప్రసిద్ధి పొంది దేశం అంతా వ్యాపించింది.

1906 కలకత్తా కాంగ్రెస్ ‘స్వరాజ్యం, స్వదేశీ, జాతీయ విద్య’ ఈ మూడు అంశాలు లక్ష్యాలుగా కొన్ని తీర్మానాలను ఆమోదించింది. బ్రిటీష్ అనుకూలత ద్వారా దేశానికి మంచి సాధించుకోవాలనే ధోరణిలో నేషనల్ కాంగ్రెసును నడుపుకొస్తున్న సర్ ఫిరోజ్ షా మెహతా, సురేంద్రనాథ్ బెనర్జీ, గోఖలే, చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ లాంటి సీనియర్ కాంగ్రెస్ నాయకులు ‘బోయ్‌కాట్’ లాంటి పదజాలం పట్ల వ్యతిరేకత కనపరచారు. లాలాలజపతి రాయ్, లోకమాన్య తిలక్, బిపిన్ చంద్రపాలు ప్రభృతుల నాయకత్వంలో కొందరు అతివాదులు ఈ మార్గాన్ని వ్యతిరేకించి, బ్రిటీష్ వారి పైన పోరాటానికి సిద్ధపడ్డారు. ఈ ముగ్గురినీ లాల్ బాల్ పాల్ త్రయంగా పేర్కొంటారు. వీళ్లని అతివాదులనీ, చేంజర్స్ అనీ పిలవసాగారు.

ఆ మరుసటి సంవత్సరం 1907లో సూరత్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభలలో అతివాదులకూ, మితవాదులకూ తీవ్రమైన విభేదాలు చోటు చేసుకున్నాయి. మితవాదులు రాస్ విహారీ ఘోష్‌ను కాంగ్రెస్ అధ్యక్షుడిగా సూచించగా, అతివాదుల పక్షాన లాలాలజపతి రాయ్‌ని పోటీకి నిలబెడుతున్నట్టు వేదిక మీదనుంచి తిలక్ ప్రతిపాదించాడు. ఆయన అలా ప్రసంగిస్తూ ఉండగా జనం లోంచి ఒక బూటు వచ్చి వేదికపైన ఉన్న ఫిరోజ్ షా మెహతా చెంపకు తగిలి, పక్కనేఉన్న సురేంద్రనాథ్ బెనర్జీ మీద పడింది.

బూటుని మెహతా, బెనర్జీల వర్గం వాళ్ళు తిలక్ మీదకు విసిరితే అది గురి తప్పి సురేంద్రనాథ్ బెనర్జీ మీద పడిందో...లేక తిలక్ వర్గీయులే మెహతా బెనర్జీల మీదకు విసిరారో ఎవరికీ తెలియదు. బూటు వచ్చి తగిలింది. నువ్వంటే నువ్వని కారణాన్ని

ఎదుటివారిమీదకు నెట్టుకుంటూ సభలో గందరగోళం సృష్టించారంతా!

దీనికి, తాను ప్రత్యక్ష సాక్షినంటూ, టంగుటూరి ప్రకాశంగారు 'నా జీవిత యాత్ర' గ్రంథంలో కొన్ని విషయాలు ఉటంకించారు. ఈ సంఘటనకు ఒక నేపథ్యాన్ని ఆయన ఇలా విశ్లేషించారు.

"నాగాపురం నుంచి వచ్చిన ప్రతినిధులు లాఠీ కర్రలతో 'తిలక్ మహరాజుకీ జై' అనుకొంటూ వేదిక మీదకు ఉరికారు. తరువాత గలాటా పెరిగి ఉభయ పక్షాలవాళ్ళూ కుర్చీలూ, బెంచీలు కూడా చేత బట్టి విజృంభించారు. అనేకమందికి గాయాలు తగిలి రక్తం స్రవించింది" అదీ సంఘటన. సరిగ్గా నేటి పరిస్థితికి నాటి పరిస్థితి నకలుగానే ఉంది.

"ఆ కాలంలో కాంగ్రెస్‌కి ఫిరోజిషా మెహతా నియంతవంటి వాడే! కాంగ్రెస్ సంఘాలు అనిగానీ, ప్రతినిధుల్ని ఎన్నుకోవడం గానీ, ప్రతినిధులు ప్రెసిడెంటును ఎన్నుకోవటం గాని ఏమీ లేవు. మెహతా ఎవరి మీద కటాక్ష వీక్షణం చేస్తే వాళ్ళే కాంగ్రేస్ అధ్యక్షులు. తీవ్రవాదులైన తిలక్ లాలాజీలు ఆయన ఆగ్రహానికి గురయిన ముఖ్యులు " అనేది ప్రకాశంగారి అభిప్రాయం.

ఇలాంటి పరిస్థితుల్లో, ఆనాడు కాంగ్రెస్ పెద్దలను మంచి చేసుకుని విజిటింగ్ కార్డు పదవి అయినా పొందగలిగితే, ప్రభుత్వాదరణ దొరికేదని దీన్ని బట్టి తెలుస్తోంది. గురజాడ లాంటి ఆలోచనాపరుడు ఈ సంస్కృతిని ఆమోదించగలడా? అందుకే, దేశభక్తి గురించి ఒట్టి గొప్పలు చెప్పుకోవద్దని మితవాద కాంగ్రెసుకే చురక వేశాడు.

1907 లో బిపిన్ చంద్రపాల్ ఆంధ్ర రాష్ట్ర పర్యటన సమయంలో విశాఖపట్టణంలో ఆయనకు అంతగా ఆదరణ రాలేదు. కాకినాడలో ఒక మోస్తరుగా విజయవంతం అయ్యింది. తరువాత రాజమండ్రిలో జరిగిన సభ అద్భుతాలను ఆవిష్కరించింది. తెలుగువారిలో స్వాతంత్ర్య దీప్తిని నింపిన ఒక గొప్ప సభగా చరిత్రలో నిలిచిపోయింది. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాన్ని తెలుగులోకి అనువదిస్తూ, "భరత ఖండంబు పాడియావు" అనే పద్యాన్ని చిలకమర్తివారు ఈ సభలోనే ఆశువుగా చెప్పారు.

ఆ తరువాత బిపిన్ చంద్రపాల్ బెజవాడ, మచిలీపట్టణాల్లో కూడా ప్రసంగించారు. తెలుగునాట స్వాతంత్ర్య కాంక్ష కలవారందరినీ ఏకం చేసి, తన నాయకత్వంలోకి తెచ్చుకున్నారు. వందేమాతరం ఉద్యమం తరువాత దేశంలో అతివాదులు తెలుగు నేల మీద సాధించిన తొలి విజయం ఇది. అతివాదానికి గురజాడ అనుకూలమా.. ప్రతికూలమా అనేది సున్నితమైన విషయం.

1897 నుంచీ 1912 వరకూ సంస్థాన వారసత్వ దావా విషయంలో అప్పారావు గారు తలమునకలుగా ఉన్న సమయం అది. ఆ కారణంగా ప్రత్యక్ష రాజకీయాలతో సంబంధాలు పెట్టుకోలేకపోయినప్పటికీ, కన్యాశుల్కం నాటకంలో జాతీయ, అంతర్జాతీయ విషయాలు కూడా ప్రస్తావిస్తూ మితవాదుల ఆలోచనా ధోరణుల్ని ఎండగట్టారు.

హవల్దార్ పాత్ర – సారా కొట్టు సీను: “కుంపిణీ నమ్మక్ తిన్న తరువాత ప్రాణం ఉన్నంత కాలం కుంపిణీ బావుటాకి కొలువు చెయ్యాలి. రేపు రుషియాతో యుద్ధం వొస్తే పించను ఫిరకా యావత్తూ బుజాన్ని తుపాకి వెయ్యమా?”

“రుస్సావోడి వోడ నీట్లో ములిగి నడస్తాది గదా, నువ్వు తుపాకుతో యవణ్ణి కొడతావు?” అని మునసబు రెట్టించి అడుగుతాడు. దానికి హవల్దారు, “మొన్నగాక మొన్న యింగిరీజ్ రుషియా దేశానికి దండెత్తిపోయి, రుషియాని తన్ని తగలాడా లేదా? అప్పుడేవైందో, యిప్పుడూ అదే అవుతుంది. మా రాణి చల్లగా ఉండాలి…!”

“సీమరాణి ఆ కాళీమాయి అవుతారం కాదా?” అనడిగితే, “కాళీ గీళీ జాంతానై–ఆ రాముడి అవతారం”.

నేషనల్ కాంగ్రెస్ మితవాదుల సగటు ఆలోచనాధోరణిని ఈ సంభాషణలు తేటతెల్లం చేస్తున్నాయి. మనుషులు చేసిన దేవుళ్ళారా…! మీ పేరేమిటి? కథలో కనిపించే శైవ వైష్ణవ భేదాలు కూడా ఈ సంభాషణలో ధ్వనిస్తాయి.

కన్యాశుల్కం నాటకంలో సార్వజనీనత, సార్వకాలీనతలు కొట్టొచ్చినట్టు కనిపించటానికి గురజాడ ప్రదర్శించిన ఈ రాజకీయ చైతన్యమే కారణం. బ్రిటీష్‌వారితో మంచిగా వ్యవహరిస్తూ, ఎదురు తిరక్కుండా నమ్రతగా ఉంటూ, దేశానికి స్వాతంత్ర్యాన్ని బ్రతిమాలో బామాలో తెచ్చుకోవాలనే మితవాదుల ఆలోచనని ఏ మాత్రం అంగీకరించలేదనటానికి ఈ నాటకంలో ఇలాంటి సంభాషణలు అనేకం సాక్ష్యం. ●



**కొండల నడుమను కోనొకటున్నది !**
**కోనకి నడుమా కొలనొకటుంది !**
**కొలని గట్టునా కోవెల లోపల**
**వెలసెనుబంగరు దుర్గమ్మ.**

హాస్య-వ్యంగ్య ప్రకాశిక

# పొగడ్తల పురాణం



డా|| దామెర వేంకట సూర్యారావు
Ph: 98851 88431

వీపు దురద పుట్టినప్పుడు ఎవరైనా గోకుతుంటే ఎంతో హాయిగా ఉంటుంది. అలాగే కొంతమందికి ఎవరైనా పొగుడుతుంటే చాలా ఆనందంగా ఉంటుంది. “కీర్తి కండూతి’ అన్నమాట ఉండనే ఉంది. తన గురించి అందరూ గొప్పగా చెప్పుకోవాలనే ఉబలాటం చాలామందికి ఉంటుంది. పొగడ్త, ప్రశంస, కీర్తించడం, స్తుతించడం, శ్లాఘించడం ఇవన్నీ స్థూలదృష్టికి ఒకటే అయినా సందర్భాన్ని బట్టి, స్థాయిని బట్టి పేర్లు మారుతుంటాయి.

పొగిడితే బుట్టలో పడనివాడెవడు? కన్యాశుల్కం నాటకంలో అందరిమీదా మండిపడే అగ్నిహోత్రావధాన్లు “తమరేనా నులక అగ్ని హోత్రావధాన్లుగారు? యీ పట్టిని జటలో తమంత వారు లేరని రాజమహేంద్ర వరంలో మావాళ్లనుకునేవారు. మా మేనమామ రామావధాన్లు యీ దేశబ్భోగట్టావొచ్చినప్పుడల్లా తమర్ని యెన్నిక చేస్తుంటారండి” అని గిరీశం అనగానే చప్పున చల్లారిపోయాడు. మనుషులకే కాదు, దేవతలకూ పొగడ్తలు కావాలి. విష్ణువు అలంకారప్రియుడు, శివుడు అభిషేక ప్రియుడు, సూర్యుడు నమస్కార ప్రియుడు అంటారు గాని ఆడా మగా తేడాలేకుండా దేవుళ్లందరూ స్తోత్ర ప్రియులే. అందుకే, అష్టోత్తరాలు శతనామాలు, సహస్రనామాలు – అపారమైన స్తోత్రవాఙ్మయం.

దేశభక్తి కవులు మాతృభూమిని పొగుడుతారు. మంచిదే. “పొగడరా నీ తల్లిభూమి భారతిని” అన్న వాక్కు ఎప్పుడూ అనుసరణీయమే. దేవతాస్తోత్రాల్లో భక్తి, శరణాగతి, పారమార్థిక చింతన, పశ్చాత్తాపం మొదలయినవన్నీ ఉంటాయి. దేశాన్ని ప్రస్తుతించడంలో జాతి సంస్కృతి, చరిత్రల పట్ల గౌరవం పుట్టిన నేలపై ప్రేమ ఉంటాయి. ఎటొచ్చీ మనుషుల్ని పొగడ్డంలోనే వస్తుంది తంటా.

పూర్వం రాజుల కొలువుల్లో “వంది మాగధులు” ఉండేవారు. “వంది” అంటే స్తుతించేవాడని అర్థం. కవులు, పండితులు వచ్చి రాజుల్ని కీర్తిస్తే మణులు, మాన్యాలు, అగ్రహారాలు లభించేవి.

ఒక్కోసారి స్తుతించేవారికి ఇబ్బందికర పరిస్థితులూ ఎదురయ్యేవి. ఒకసారి తిరుమలరాయలు అనే సామంతరాజును ఒక కవి దర్శించాడు. రాజుకు కవులచేత పొగడించుకోవాలని కోరికైతే ఉందిగాని, అందుకు తగిన అర్హతలేవీ లేవు. పైగా

ఒంటికంటివాడు. తనను వర్ణించమన్నాడు కవిని. కవి రాజును ఎగాదిగాచూసి ఇలా పద్యం చెప్పాడు.

"అన్నాతి గూడ హరుడవు
అన్నాతిని గూడ కున్ననసుర గురుండౌ
అన్నా! తిరుమల రాయా!
కన్నొక్కటి లేక యున్న కౌరవపతివే"

ఓ! తిరుమల రాయా! నువ్వు భార్యతో ఉంటే ముక్కంటివి. ఒంటరిగా ఉంటే శుక్రాచార్యుడివి. ఆ ఒక్క కన్నూ లేకపోతే ధృతరాష్ట్రుడివి" అని భావం. ఒంటికన్నువాడనే హేళన అర్థం కాని రాజు తనను గొప్ప వారితో పోల్చినందుకు ఆనందించి కవిని సత్కరించాడు. ఒక్కోసారి ఒకర్ని పొగిడితే ఇంకొకరికి కోపంవస్తుంది. సద్యఃస్ఫూర్తితో అలాంటి క్లిష్టపరిస్థితుల్ని అధిగమించిన కవులూ ఉన్నారు. శ్రీనాథుడు కొండవీటి పెదకోమటి రెడ్డి ఆస్థాన విద్యాధికారి. సర్వజ్ఞుడనే బిరుదుంది. అతడికి ప్రబలవిరోధి అయిన రాచకొండ సింగభూపాలుడికి అదే బిరుదుంది. శ్రీనాథుడు ఒకసారి సంగభూపాలుడి కొలువుకు వెళ్లాడు. ఆ రాజును ప్రశంసించాడు.

"సర్వజ్ఞ నామధేయము
శర్వునకే, రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును, తక్కొరు
సర్వజ్ఞండనుట కుక్క సామజమనుటే"

అని ప్రశంసించేసరికి సింగభూపాలుడు ఉబ్బితబ్బిబ్బై ఘనసన్మానం చేసి పంపించాడట. పద్యభావం ఏమిటంటే – సర్వజ్ఞుడనే పేరు శివుడికి, సింగభూపాలుడికి భూమ్మీద చెల్లుతుంది. ఇంకెవరినైనా సర్వజ్ఞుడంటే అది కుక్కను ఏనుగనటమే. శ్రీనాథుడు కొండవీడు వెళ్లాక అప్పటికే ఈ వైనం విన్న వేమారెడ్డి ఆగ్రహించాడు. శ్రీనాథుడు నవ్వుతూ "మహారాజా! సింగభూపాలుణ్ని నేను పొగడలేదు. తిట్టిన పద్యం అది. ఆ రాజుకు అర్థంకాలేదు. సర్వజ్ఞ నామధేయము శర్వునకే – రావుసింగ జనపాలునకేయుర్విం జెల్లును?" అని 'కే' ను విడదీసి చదివి సర్వజ్ఞుడు శివుడేగాని సింగభూపాలుడికి ఏ భూమ్మీద చెల్లుతుంది? ఇతరుల్ని సర్వజ్ఞడనటం కుక్కను ఏనుగనటమే! అని అర్థం చెప్పేసరికి వేమారెడ్డి మెచ్చుకుంటూ శ్రీనాథుణ్ని సత్కరించాడు. ఇలాంటి ఆపద్ధర్మస్తుతులూ, ప్రశంసలూ సాహిత్యలోకంలో చాలా కనిపిస్తాయి.

ఏ కాలంలోనైనా ప్రశంసలు అనివార్యంగా ఉంటాయి. కింది ఉద్యోగులు పై అధికారిని పొగుడుతారు. పనులు కావలసిన వారు నేతల్ని స్తుతిస్తారు. రచయితలు తమ పుస్తకాలు

ముద్రించుకోవటానికి దాతల్ని ప్రశంసిస్తారు. ఎవరినీ పొగడటం తప్పుకాదు. ఆపని అవతలివాడి యోగ్యతను బట్టి చేయాలి. కొందరికి స్తోత్రపాఠాలు ఉగ్గుతో పెట్టినవిద్య. "ఇచ్చట సన్మాన పత్రములు రాయబడును" అని ఇంటి ముందర బోర్డు వేలాడగట్టేవాళ్లు ఈ కోవకు చెందినవారు. కొందరు విపరీతంగా పొగిడేస్తుంటారు. "పొగడ్తలు అగడ్తలు దాటా'యంటారు ఇటువంటి సందర్భాల్లోనే. కొందరు ఇష్టం లేకపోయినా ముఖస్తుతిగా ప్రశంసిస్తారు. హృదయపూర్వక అభినందనే మంచి ప్రశంస. కొందరు నోటితో నవ్వుతూ నొసటితో వెక్కిరిస్తారు. ఇవాళ విపరీతంగా పొగడిననోళ్లే రేపు తెగడ్డానికి సంకోచించవు.



"నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నేనెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరు
నెత్తురు క్రక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరె"

అన్నాడు శ్రీశ్రీ. ఇవాళ బ్రహ్మరథం పట్టినవాడు రేపు కిందకు తోసేస్తాడు. కాకాపట్టి బాకా ఊదినవాడే తన పని అయిపోయాక ధోకా ఇవ్వడానికి వెనుదియ్యడు.

కొన్ని సభల్లో, సన్మానాల్లో "నువ్వు నన్ను పొగుడు, నేను నిన్ను పొగుడతా"నన్న చందానా ఉంటాయి ప్రసంగాలు. కొందరైతే ఇతరులు తమను పొగిడే అవకాశం ఇవ్వరు. వారి స్వంతడబ్బా వాళ్లే వాయించుకుంటారు. ఎవరికైనా ప్రశంసలు ప్రేరణ కలిగించాలి. మరింత ఉత్సాహంగా పనిచేస్తూ విజయం సాధించేందుకు ఉత్ప్రేరకంగా పనిచేయాలి. పొగడ్తలు ఆత్మవిశ్వాసాన్ని కలిగించేలా ఉండాలి గాని అహంకారాన్ని పెంచేలా ఉండకూడదు. లోకంలో ఒకసామెత ఉంది.

"హనుమంతుడికి తన బలం తనకు తెలియదని. సర్వశక్తిమంతుడు హనుమ. అయినా సముద్రం దాటేస్తానని ముందుకు రాలేకపోయాడు. ఆతడికి బాహ్యప్రేరణ అవసరమైంది. ఒక మూల కూర్చుని విషాదంలో మునిగి పోయినవాడికి జాంబవంతుడు ప్రేరణనిచ్చాడు. అతడిశక్తిని, బలాన్ని గుర్తు చేశాడు.

ప్రశంసల్ని చిరునవ్వుతో స్వీకరించాలి. విమర్శించినపుడు మౌనంగాఉండి సరిదిద్దుకోవాలి.

ప్రశంసల్ని, విమర్శల్ని సమబుద్ధితో స్వీకరించడం స్థితప్రజ్ఞ. అది సాధించగలిగినప్పుడు మనం బలమైన వ్యక్తిత్వం గలవాళ్లమవుతాం. ●

## పద్య ప్రకాశిక

# శతక సౌరభం



-ఎన్. సీహెచ్. చక్రవర్తి

ఆధునిక తెలుగు సాహిత్యంలో మహాకవి గా పేరుపొందిన ఉద్దండ కవి గురజాడ అప్పారావు గారు. వారి సాహిత్యం, అది ఏ ప్రక్రియ అయినా, సమాజ చైతన్యం కోసమే సాగింది. పేరు ప్రతిష్టలకోసం కాక తమ కాలంనాటి సమాజ రుగ్మతలకు ఒక సాహిత్య ఔషధాన్ని తమ కలం ద్వారా తయారుచేసి అందించాలన్న తపననుండి ఆవిర్భవించినవి గురజాడ రచనలు. నాటి చరిత్రను కళ్ళముందు కట్టడమే కాక నేటికీ కొన్ని రచనల సందేశం అన్వయిస్తూనే ఉంది. అదే నిజకవిత్వానికి గీటురాయి. కవి తన సాహిత్యం ద్వారా మాత్రమే శాశ్వతత్వాన్ని పొందుతాడు. తెలుగు సాహిత్యాన్ని అభ్యుదయ దృక్పథంతో అధ్యయనం చేస్తే గురజాడకు ముందూ గురజాడకు తరువాత అన్నట్లుగా కొత్తపాతల మేలుకలయికగా నిలచిన సామాజిక కవి గురజాడ. వారు పూర్వం ప్రారంభించి వదిలిన ప్రకాశిక పత్రికను ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణగారు పునరుద్ధరించి గురజాడ ఆశయాలకు అనుగుణంగా నడుపుదామని పూనుకోవడం బహుధా ప్రశంసనీయం. వారి ఆశయాలకు అనుగుణంగా ఉత్తమ అభిరుచులతో ఉన్నత లక్ష్యాలతో పత్రిక నడవాలని ఆకాంక్షిస్తున్నాను.

జానపద సాహిత్యంతో సాధారణంగా ఏ భాషాసాహిత్యమైనా ఆరంభం అవుతుంది. సాహిత్యం క్రమవికాసం పొందుతున్న కొద్దీ ఎన్నో మార్పుచేర్పులకు లోను అవుతూఉంటుంది. శిష్టప్రామాణిక కవిత్వం మన తెలుగులో అందుబాటులోకి వచ్చి పదకొండు వందల సంవత్సరాలు మాత్రమే. ఆదికవి నన్నయ నుండీ క్రమవికాసశీలిగా తెలుగు సాహిత్యం మరే ఇతర భాషలూ సంతరించుకోలేనన్ని ప్రక్రియారూపాలను తన సొంతం చేసుకుంది. ఆ క్రమం లోనే తెలుగు సాహిత్య మకుటంలో ఒక వజ్రంలాగా శతక సాహిత్యం ప్రకాశిస్తూ ఉన్నది. భాషాసాహిత్య సంపదను ఎంతగానో పెంచిపోషించి పరిపుష్టం చేసింది.

శతకం అంటే వంద పద్యాలతో ఉన్నది అని. సాధారణంగా కవులు సంప్రదాయంగా 108 లేదా 101 వ్రాస్తూ ఉంటారు. సున్న చివర ఉంటే మనవారికి నచ్చదు. చరిత్రకు అందినంతవరకు తెలుగులో మొదటి శతకం శివకవియుగం నాటి మల్లికార్జున పణ్డితారాధ్యుని శివతత్త్వసారం. ఇందులో 489 పద్యాలు. మనం ఇదమిత్థంగా చెప్పుకునే శతక లక్షణాలకు కొంత భిన్నమైన పోకడలతో ఉన్నది. అదే మొదటి శతకం అనుకుంటే తరువాత తరువాత తెలుగులో శతక సాహిత్యం విస్తారంగా వెలువడింది.

ప్రతిశతకానికి ఒక మకుటం ఉంటుంది. ప్రతిపద్యం దేనికదే ఒక స్వతంత్ర భావాన్ని



కలిగి ఉంటుంది. దీన్నే ముక్తకం అంటారు. అంటే శతకంలో ప్రత్యేకంగా ఒక కథ, వస్త్వైక్యం వంటివి ఉండవు. సాధారణంగా శృంగార నీతి వైరాగ్య భక్తి వ్యంగ్య ప్రధానాలుగా ఉంటాయి శతకాలు. ఈ అంశాలే ప్రధానమైనా సమాజానికి ఒక చక్కటి సందేశాన్ని ఇస్తాయి. అలాగే పద్య నిర్మాణంలోనూ వ్యక్తీకరణలోనూ కవిత్వలక్షణాలను ప్రోదిచేసుకుని ఉంటాయి.

పోతన నారాయణ శతకం, తాళ్ళపాక తిరుమలాచార్యుల శతకం, దాశరథి శతకం, భర్తృహరి మూలానికి అనువాదమైన ఏనుగు లక్ష్మణకవి శతకం, భాస్కర శతకం, నరసింహశతకం ఇలా ఎన్నెన్నో శతకాలు ప్రసిద్ధం కాగా వీటిలో భాష కొంత ప్రౌఢంగా ఉన్న సందర్భాలు ఉన్నాయి. ఆధునికులకూ తేలిక పదాలతో అన్వయక్లిష్టాలు కాకుండా ఉన్నవి వేమనశతకం, సుమతీశతకం, కుమారీ కుమారా శతకాలు సుబోధకంగా ఉన్నాయి. వీటి ప్రభావముతోనే ఈ కాలంలో అనేకులు వర్ధిష్ణువులు ఆటవెలది అనే ఛందస్సును ఎంచుకుని శతకాలపేరుతో వ్రాస్తున్నారు. శతకాలలో ఉన్న వెసులుబాటును వారు అందిపుచ్చుకునే ప్రయత్నం చేస్తున్నారు. కానీ కొందరైతే పూర్వపు శతకాల్లో ఉన్న కవిత్వమర్మాలూ వ్యక్తీకరణలోని అందాలూ పద్యనిర్మాణ దక్షతలూ అలంకారాదుల తాపడాలూ అలవరచుకుంటున్నట్టు కనిపించదు. పైగా చెప్పిన విషయాలనే మళ్ళీ మళ్ళీ చెప్తూ అమూల్యమైన శతక సాహిత్య సౌరభాలను పలుచన చేస్తున్నట్లు తోస్తుంది.

సరే ప్రస్తుతానికి వద్దాం. తెలుగు సాహిత్యంలో శతకాలు ఎలా సాహిత్య విలువలను సంతరించుకొన్నాయో స్పృశించుకుని ముగిద్దాం.

వేమన శతకంలోని  
ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు  
చూడ చూడ రుచుల జాడవేరు  
పురుషులందు పుణ్యపురుషులు వేరయా

అన్న పద్యం ఒక్కటి తీసుకుంటే ఇందులో ఇందులో రుచి అన్న పదానికి కాంతి తినే రుచి అనే శ్లేష, కప్పురం అంటే పచ్చకర్పూరం (హారతికర్పూరం తినం రుచిచూడం కదా!) అనీ గ్రహిస్తే ఈ చిన్న పద్యంలో ఎంత అందం ఉన్నదో సరసహృదయులు ఆనందిస్తారు. పుణ్యపురుషుల పచ్చకర్పూరపు పోలిక ఎంతో రంజింపచేస్తుంది.

**శతకం అంటే వంద పద్యాలతో ఉన్నది అని. సాధారణంగా కవులు సంప్రదాయంగా 108 లేదా 101 వ్రాస్తూ ఉంటారు. సున్న చివర ఉంటే మనవారికి నచ్చదు. చరిత్రకు అందినంతవరకు తెలుగులో మొదటి శతకం శివకవియుగం నాటి మల్లికార్జున పణ్డితారాధ్యుని శివతత్త్వసారం. ఇందులో 489 పద్యాలు. మనం ఇదమిత్థంగా చెప్పుకునే శతక లక్షణాలకు కొంత భిన్నమైన పోకడలతో ఉన్నది. అదే మొదటి శతకం అనుకుంటే తరువాత తరువాత తెలుగులో శతక సాహిత్యం విస్తారంగా వెలువడింది.**

సుమతి శతకం లోని

**అడిగిన జీతంబియ్యని**
**మిడిమేలపు దొరనుగొల్చి మిడుకుటకంటెన్**
**వడిగలయెద్దుల గట్టుక**
**మడిదున్నుక బ్రతకవచ్చు మహిలో సుమతీ!**

అనే పద్యంలో ఆ కాలంలోనే ఆత్మాభిమానాన్ని చంపుకుని ప్రభుత్వ ఉద్యోగాలకు ఎగబడవద్దనే సందేశము, పోతన జీవితాన్ని గుర్తుచేస్తూ వ్యవసాయంలో ఉన్న ఆత్మగౌరవ నినాదమూ ప్రబోధిస్తూ ఈ నాటికీ ఏనాటికీ, వ్యక్తిత్వ వికాసానికి పనికివచ్చే అమూల్య సందేశం ఇమిడిఉండడం మనను పులకింపచేస్తుంది.

**ఎట్టుగ బాటుబడ్డ నొకయించుక ప్రాప్తములేక వస్తువుల్**
**బట్టు బడంగ నేరవు నిబద్ధిసురావళి గూడి రాక్షసుల్**
**గట్టు బెకల్చిపాల్కడలికవ్వముచే మథియించిరెంతయున్**
**వెట్టియకాక యేమనుభవించిరి వారమృతంబు భాస్కరా!**

అనే భాస్కరశతక పద్యం ఎంత కష్టపడ్డా ప్రాప్తానికి ఒకింత దైవం అనుకూలించాలి అంటూనే దైవబలం ఉన్నా ముందు మనం బాగా కష్టపడాలి అనే గొప్ప ప్రబోధం చేస్తుంది. దీన్ని గురించి ఎంతైనా విస్తరించుకోవచ్చు. ఇవే శతకాలు సాహిత్యం ద్వారా సమాజానికి చేసిన సేవ.

ఈ విధంగా చెప్పుకుంటూ పోతే చాలా విస్తారం అయిపోతుంది. కేవలం తెలుగు శతక సాహిత్య రేఖామాత్ర పరిచయమే వ్యాస లక్ష్యం. తెలుగు శతకాల్లోని పద్యాలు తెలుగు భాషా సౌందర్యాన్ని ఇనుమడింపచేసాయి. కవిత్వాన్నీ పండించాయి. తెలుగువారి అభ్యుదయాన్ని కాంక్షించాయి. అజరామరమైన సందేశాలను ప్రబోధించి మానవజీవితాన్ని సక్రమమార్గంలో పెట్టేందుకు అనన్య కృషి చేసాయి.

ఆ శతక కర్తలైన మహనీయులందరిని సంస్మరించుకుందాం. తెలుగు శతక సాహిత్య వైభవాన్ని కాపాడుకుందాం. ●

### వనితా ప్రకాశిక

# మహిళా సాధికారతను సాధించగల్గుతున్నామా?



డా. సి. భవాని దేవి
9866847000

భారతదేశంలో దాదాపు సగం జనాభాగా ఉన్న 65 కోట్లమంది స్త్రీలు పలురంగాలలో ముందడుగు వేస్తున్నా సంపూర్ణ సాధికారతను సాధించలేకపోతున్నారనేది నూటికి నూరుపాళ్ళు నిజం. 15 ఏళ్ళ క్రితం ఒక జాతీయ మహిళావిధానం రూపొందించటం జరిగింది. అయినా స్త్రీలకు న్యాయం సుదూరంగానే ఉంటున్నది. పార్లమెంటులో 33 శాతం స్త్రీలకు రిజర్వేషన్లు ఉండాలని ప్రవేశపెట్టిన బిల్లులు ఇప్పటివరకు ఏ పరిస్థితిలో ఉన్నాయో మనకి తెలుసు. ఎన్నికల్లో మహిళలకు రాజకీయపార్టీలు టికెట్లు ఇచ్చి గెలిపిస్తున్నా, వాళ్ళు గెలిచాక, పదవులు చేపట్టాక పెత్తనం భర్తదో, కుమారుడిదో, మరిదిదో కావటం విచారకరం. దీనికి మహిళల ఆత్మన్యూనత, పురుషులపై ఆధారపడటం కూడా కొంత కారణంగా చెప్పవచ్చు. స్త్రీలు బాగా చదువుకున్నా, తమ పేరిట ఆస్తిపాస్తులున్నా, పురుషుల అధీనంలో పనిచేయటం, స్వంత వ్యక్తిత్వాన్ని అణచివేసుకోవటం అనేక రంగాలలో చూస్తున్నాం. ఉద్యోగినులుగా ఆర్థిక స్వాతంత్ర్యంగల స్త్రీలు కూడా తమ ఉద్యోగ విధులలో భర్తల ప్రమేయాన్ని, వారి అవినీతిని నిరోధించలేక పోవటం గమనార్హం. రచయితలు, గాయకులు, మొదలైన ఇతర సృజనాత్మక రంగాలలో, నిష్ణాతులయిన వాళ్ళ సృజనరంగంలో ఎదుగుదలను పురుషులే శాసించటం, అదుపాజ్ఞలలో ఉంచటం, మనం ఎందరో కళాకారిణుల జీవితాలను చూసి, చదివి తెలుసుకుంటున్నాం.

స్త్రీ పురుషులు ఇద్దరూ పరస్పర పూరకాలు. ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనే భావం ఉండటంవల్లే స్త్రీ సాధికారత నత్తనడక నడుస్తున్నది. ఇటీవల బాపుగారు దర్శకత్వం వహించిన ఓ సినిమాలో ఆమె అతనికన్నా "తక్కువ సమానం", అతడు ఆమెకన్నా "ఎక్కువ సమానం" అనే డైలాగ్ వినిపించారు. సమానం అంటూనే ఎక్కువ తక్కువలు శాసించే సాంప్రదాయిక మూఢ భావనల గురించి ఎన్నో శతాబ్దాలనుంచి పోరాటం జరుగుతూనే ఉంది. మన దేశంలోని సనాతన మతఛాందసంలోంచి పుట్టిన అనేక మూఢవిశ్వాసాల గురించి ఆనాడు స్త్రీలకంటే పురుషులే ఎక్కువ కృషి చేశారనిపిస్తుంది.

సతి, ఆడశిశు హత్యలు, వితంతువుల అధోగతి మానవత్వాన్ని మంటగలిపాయి. ఆధునిక పాశ్చాత్యవిజ్ఞానం, సాహిత్యం, తత్వశాస్త్రాలను ప్రవేశపెట్టి ఆధునీకరణ ద్వారా భారతీయులలోని వెనుకబాటుతనాన్ని రూపుమాపటంలో రచయితల పాత్ర



గణనీయమైంది. ముఖ్యంగా గురజాడవారి రచనల్లో స్త్రీపట్ల మానవీయ అవగాహనతో చేసిన పాత్ర చిత్రణలు కల కాలం తెలుగుసాహిత్యంలో మణిదీపాలుగా నిలిచి పోయాయి. నేటికీ శ్రామిక రంగంలో స్త్రీలకీ, పురుషులకీ వేతనాల వ్యత్యాసం గమనిస్తే ఆమెను ఎప్పుడూ రెండో తరగతి పౌరురాలిగా పరిగణించటం చూడగలం. 'మహిళలు ఉద్యోగాలు చేయటం మా దయవల్లనే' అనుకునే పురుష పుంగవులున్నారు. అది ఒక అదనపు భారంగా ఆమె 'సూపర్ ఉమెన్' గా మారటానికి తనదైన అభిరుచులు, ఆరోగ్యాన్ని ఎంత త్యాగం చేస్తుందో ఎవరికీ పట్టదు.

స్త్రీల సాధికారతకు మన సమాజంలో కొన్నిమార్పులు జరగాలి. ఆడపని, మగపని అనే విభజన మానేయాలి. అన్ని పన్లు అందరూ పంచుకొని చేయగలగాలి. స్త్రీకి గానీ పురుషుడికి గానీ వాళ్ళ శరీరంపై వారికున్న సంపూర్ణ హక్కులు అనుభవించేటట్లు చట్టాలతో బాటు అమలుతీరు ఉండాలి. స్త్రీ ఒక వ్యక్తి. ఆమెకి మెదడు, మనస్సు ఉంటుంది. ఆమె ఒక ఆస్తి, వస్తువు కాదు. స్త్రీ పట్ల అత్యాచారాలు చేసేవారిని సమాజం వెలివేయాలి. చట్టం శిక్షించాలి. మగపిల్లలకి తల్లిని, అక్కచెల్లెళ్ళను, ఇతర స్త్రీలను గౌరవించే సంస్కారం ఇవ్వాలి.

స్త్రీని 'అబల' అంటుంటారు. మన పురాణాలన్నిటిలో స్త్రీని శక్తి స్వరూపిణిగా అభివర్ణించారు. ఆమెను పూజిస్తూనే స్త్రీలపట్ల అమానుష అణచివేత ప్రదర్శించే మగ పురుగులను ఏరివేయాలి. అమ్మ లేకపోతే అబ్బాయి లేడు కదా!

స్త్రీలు తమపై జరిగే అణచివేతను ప్రతిఘటించి, ఉన్నత విద్యావంతులై తమ సాధికారతను ఇంటినుంచే ఆరంభించాలి. ఆమె సంపాదనపై అతని ఆధిపత్యాన్ని అంగీకరించరాదు. కోట్లు సంపాదించే నటీమణులు, గాయనీమణులు భర్తవల్లనే నిర్జీవులు కావటం ఎంత విషాదం! ఆమె బాల్యంనుంచే ఆత్మరక్షణ విద్యలు నేర్వాలి. స్త్రీకి సంప్రదాయ మూఢవిశ్వాసాల వల్ల ఏర్పడిన పాత దురాచారాలు చాలావరకు తొలగిపోయినా సరికొత్త సమస్యలు రూపం మార్చుకొని ఆమెను చుట్టుముట్టి ఆత్మహత్యలకు ప్రేరేపిస్తున్నాయి.

భారతీయ మహిళ తన పూర్వ ప్రాభవజ్ఞానంతో ఆధునిక శాస్త్రీయ దృక్పథంతో వ్యక్తిగా నిలబడాలి. మహిళలు ఎదిగితేనే దేశాభివృద్ధి సుసాధ్యం. మహిళల పేరుతో మగవారికి ఇచ్చే పథకాల దోపిడీని నివారించాలి. ముఖ్యంగా స్త్రీలు తమ శక్తిని తాము గుర్తించి ధైర్యస్థైర్యాలతో నిలిచి సాధికారతను నిరూపించుకుంటూ తర్వాతి తరాలకు మార్గదర్శనం చేయాలి. అప్పుడే ఆధునిక మహిళగా చరిత్రను తిరగరాయగలదు. ●

# వనితా ప్రకాశిక ప్రశ్నావళి

**నిర్వహణ: డా. సి. భవానీదేవి**

**రాజకీయాలలో మహిళలు పదవులు నిర్వహిస్తున్నారు. కానీ నిజమైన అధికారం... పురుషులే చెలాయిస్తున్నారు? ఈ ధోరణిలో మార్పు తీసుకురావటానికి మహిళల కర్తవ్యం ఏమిటి? (నాగలక్ష్మి, గుడివాడ)**

**జవాబు :** ఈ పరిస్థితి ఉన్నది. దీనికి కారణం పితృస్వామ్య వ్యవస్థ. స్త్రీని ఎన్నికల్లో నిలబెట్టి, గెలిపించి, అధికారం పురుషులే చెలాయించటానికి కారణం స్త్రీలే. వాళ్ళు తమ శక్తియుక్తుల్ని అంచనా వేసుకుని, సాధికారతతోనే ఏ రంగంలోనైనా అడుగుపెట్టాలి. తన జీవన సూత్రాన్ని మరొకరి చేతిలో ఉంచటం అవమానకరమైన బానిసత్వం. దీనిని గ్రహించి మెలకువతో వ్యవహరించాలి.

**ఈ రోజుల్లో కూడా భర్త మరణించాక పూలు, బొట్టు, గాజులు వంటివి తీయడం ఎంతవరకు సమంజసం? (ప్రమీల, విజయవాడ)**

**జవాబు :** సంప్రదాయం వికృతమైన వ్యవస్థలో స్త్రీలను అణచివేసి వంటింటికి పరిమితం చేసిన దురాచారం ఇది. మెల్లగా స్త్రీలు తెలుసుకుంటారు. పూలు, బొట్టు, గాజులు స్త్రీ అభిరుచి, హక్కులు. వాటికీ భర్తకీ ఎటువంటి సంబంధం లేదు.

**మహిళలకు ఏ విధమైన వికాసాన్ని కలిగించకపోగా వారిని ఎదగనీయని టి.వి సీరియల్స్ ని నిత్యం చూస్తూ వారి రేటింగ్ పెంచుకుంటూ ఎంకరేజ్ చేస్తూ ఉన్నారు. స్త్రీలకు అవేర్‌నెస్ కలిగించటం ఎలా? తోటి స్త్రీలుగా మనం ఏం చేయగలం? (గౌరీలక్ష్మీ, హైదరాబాదు)**

**జవాబు :** స్త్రీలను కుట్రదారులుగా విలన్లుగా చిత్రీకరించే సీరియల్స్ లో స్త్రీలు నటిస్తున్నారు. డైలాగులు రాస్తున్నారు. డ్రగ్స్ లాంటి ఈ సీరియల్స్ ని ఎక్కువగా చూస్తున్నది స్త్రీలే! కాబట్టి ఆలోచనాత్మకంగా వ్యవహరించి ప్రతిఘటించాలి. ఇలాంటి పాత్రల్లో నటించటం, డైలాగ్స్ విషపూరితంగా రాయటం మానేయాలి. చూడటం మానేయాలి. మార్పు ఒక్కరాత్రిలో రాదు. క్రమంగా వస్తుంది.

**ఎమోషనల్ సపోర్టు, షేరింగ్ కోసం మంచి స్నేహితుల్ని ఏర్పరచుకోవాలి అంటే తరచూ టీమ్ మెంబర్స్ మారిపోయే మా సాఫ్ట్ వేర్ బిజీ ఎంప్లాయిస్‌కి సాధ్యం కాదు. మేమేం చేయాలి? (కాంతిరేఖ, చెన్నై)**

**జవాబు :** ముందు స్నేహం అనే పదానికి అర్థం తెలియాలి. సపోర్టు, షేరింగులకు మించిన మానసికబంధం. ఇది కుల, మత, ఆర్థిక వ్యత్యాసాలకు అతీతమైనది. కొలీగ్స్ అంతా స్నేహితులు కాలేరు. ఎంతదూరం ఉన్నా ఒకరినొకరు స్నేహించుకునే అవ్యాజ మమకారం ఉన్న స్నేహితులు దొరకటం ఆధునిక కాలంలో అరుదైన విషయం. మనమే రంగంలో ఉన్నాం అనేదానికన్నా మానసిక సారూప్యతే స్నేహానికి మూలం. అనుకోకుండా ఏర్పడే బంధం అది.

సాంకేతిక ప్రకాశిక

# గురజాడ... కథా నిర్మాణంలో సైన్స్ పార్శ్వం



డా. నాగసూరి వేణుగోపాల్
9440732392

"ఏయే భాగాలలో అనంగీకారమో, ఒక భోగం పడుచును, మైక్రోస్కోపు ముందు వుంచి ఎనలైజ్ చేసి చూస్తే తప్ప అమీతుమీ తేల్చుకోరాదు. ప్రయోగం, పరిశోధన, రుజువు సాధ్యపడనిదే ఏదీ సిద్ధాంతంగా చెప్పకూడదు..." ఇది గురజాడ అప్పారావు ఆంగ్ల కథానిక 'స్టూపింగ్ టు రైజ్'లో అన్నమాట. 'సంస్కర్త హృదయం' కథ యిదే! చాలా సరళమైన అంశాన్ని చాలా చమత్కారంగానే చెప్పడం కాదు. విజ్ఞాన విషయాల సైద్ధాంతిక భూమికకు సంబంధించిన మౌలిక అంశాలను యిట్టే పేర్కొన్నారు. జటిలమైన విషయాలను జటిలంగానే చెప్పవలసిన పనిలేదు – అనే విషయం కూడా సుతారంగా చెప్పాడు గురజాడ. ఎటొచ్చి మనం గుర్తించాలి!

గురజాడ ఐదే ఐదు – కాదంటే నాలుగున్నర – కథలు మాత్రమే రాశాడు. కానీ కథకుడిగా ఆయన వ్యూహం సమగ్రమైందీ, పరిపుష్టమైందీ – అనిపిస్తుంది. కథావస్తువు పూర్తిగా బాధితుల పక్షం. దిద్దుబాటు (కమలిని), మెటిల్డా, సంస్కర్త హృదయం – కథలు స్త్రీ సమస్యలకు సంబంధించి, స్త్రీ పక్షం వహించేవి. ఇపుడు స్త్రీ చైతన్యవాదమని వినబడుతుంది కానీ – ఆయన రెండు కథలకు కథానాయికల పేర్లు పెట్టడం గమనార్హం. మీ పేరేమిటి? పెద్ద మసీదు – కథలు మత సంబంధమైన అంశాలను స్పృశించినవి. మొత్తం కథలు అధిక సంఖ్యాకులను బలంగా ఖండిస్తూ వ్రాసినవే! ఈ విషయంలో రచయిత ధైర్యం గురించి చెప్పుకోవాలి. దూరంగా వున్నవారిని అందరూ విమర్శించగలరు. కానీ చాలా దగ్గరగా, బలంగా వున్న శత్రువులను ఖండించడం – హాస్యంగా, వ్యంగ్యంగా ఎత్తి పొడవడం చిన్న విషయం కాదు.



అవసరం బట్టి ఆయుధం ఎన్నుకున్నట్టు, సందర్భం బట్టి తగిన ప్రక్రియలలో తాను చెప్పాలనుకున్న విషయాలు కళాత్మకంగా చెప్పడం ఆయన గొప్పతనం. ఇందులోని అంతస్సూత్రాన్ని గుర్తించకుండా ప్రక్రియాపరమైన రాగద్వేషాలు పెంచుకోవడం తర్వాతి తర్వాతి తరాల్లో కనబడటం విచిత్రం.

కథారచనకు సంబంధించి నిడివి గురించి కూడా మనం ఆలోచించాలి. ఈ ఐదు కథలు 5 పేజీలు, 15, 6, 3, 21 – ఉండటం ఆసక్తి కల్గిస్తుంది. కథ ప్రయోజనం బట్టి రచయిత నిడివిని నిర్ణయించుకోవాలి మరి! దిద్దుబాటు, మెటిల్డా, పెద్ద మసీదు కథలు యిపుడు మనం చదివే కథల నిడివిలో వున్నాయి. ఇవి దాదాపు 11 దశాబ్దాల క్రితం రాశాడని గుర్తుంచుకోవాలి. మనం శతాబ్దం వెనుక వున్నామా లేదా గురజాడ శతాబ్దం ముందు వున్నారా – అని అనిపించక మానదు. యాభై పేజీల్లో ఐదు కథలు యివ్వడం రచయిత విజయమే!

అవసరం అయితే లేదా మరింత సార్వత్రికమనిపిస్తే కథని మార్చుకోవడంలో తప్పులేదు. విజ్ఞానశాస్త్రం చెప్పే అంశం కూడా యిదే! కొత్త పరిజ్ఞానం తోడయినపుడు ప్రయోగాత్మకంగా రుజువు అయినపుడు మార్చుకోవడం శాస్త్రీయ పద్ధతి. 'కన్యాశుల్కం' మాత్రమే కాదు 'దిద్దుబాటు' కూడా మార్పుకు లోనైంది. భాషాపరమైన సార్వత్రికతకు ద్వారాలు తీసింది. 'దిద్దుబాటు' కు ముందే రచయిత కన్యాశుల్కం ద్వారా మార్పు ప్రయోజనం గమనించారు. ఇది ఆయన శాస్త్రదృష్టి; వీరేశలింగం పంతులు సంస్కరణ అభిలాష వున్నా – చెప్పేటపుడు వళ్ళు తెలియకుండా వాదించకపోవడం గురజాడ గొప్పదనం. గురజాడను చిరంజీవిని చేసింది. అదే. ఆయన శిల్ప వైశిష్ట్యం, హాస్యం, వ్యంగ్యం, వెటకారం రంగరించి చెప్పడంతో గుర్తుండటమే కాదు, దెబ్బ గట్టిగా తగులుతుంది. మొరటుగా చెప్పకుండా సుతారంగా సూచించడం ఎక్కువ ప్రభావవంతమైంది. ఆసక్తిగా నడపడం ఎంత ముఖ్యమో, అంతే స్థాయిలో ప్రారంభం, ముగింపులు వుండటం తెలివైన వ్యూహం. 'దిద్దుబాటు' కథానిక – 'తలుపు తలుపు' అంటూ మొదలవుతుంది. "తలుపు తెరవబడలేదు. ఒక నిమిషమతడూరుకొనెను. గదిలోని గడియారము టింగుమని ఒంటిగంట కొట్టినది" – అని కథ సాగుతుంది. ఆసక్తిని కొనసాగించడమే కాక, సమయాన్ని సూచిస్తారు. తర్వాత అతని మనోగతంలోకి వెళతాడు. తర్వాత దీపం కూడా లేదని సూచిస్తూ కథ నడుపుతాడు – కథానాయిక కమలిని ఉత్తరం లభిస్తుంది. అప్పటికి గొప్ప విషయమే! అంతేకాదు 'ఆడారు చదువు నేరిస్తే ఏటౌతాది?' అని పాత్రోచితంగా ఆ ప్రాంతపు భాషను ప్రవేశపెట్టాడు.

ముగింపు కూడా కథకి అంతే ముఖ్యం. చదువరి మీద ప్రభావం కల్గించే విషయంలో ముగింపు చాలా ముఖ్యమైంది. "ఆయన కళ్ళు నీళ్ళతో గిర్రున తిరిగాయి" – అని 'సంస్కర్త హృదయం' ముగిస్తే – "అంతలో మంచం కింది నుంచి అమృతం వొలికే కలకల నవ్వు, మనోహరైన నూపురముల రొద వినవయ్యెను" – అని 'దిద్దుబాటు' ముగుస్తుంది. మిగతా

మూడు కథలు సంభాషణతో ముగియడం విశేషం. మరీ ముఖ్యంగా 'పెద్ద మసీదు' (మతము : విమతము) అయితే "అయ్యో! నువ్వా! మావా!" అని ముగియడం అద్భుతమైన కొసమెరుపు. ఈ మూడు పదాల జవాబు మొత్తం కథలోని కథను ఎరుకపరుస్తుంది. ఈ కథ అర్థాంతరంగా ఆగిపోయిందని అంటారు. ఒక్క నార్ల మాత్రమే యిది సంపూర్తి అయిన కథ అన్నారు.

కథ నడపటం కూడా సందర్భం బట్టి మారడం గమనార్హం. మీ పేరేమిటి, సంస్కర్త హృదయం – వర్ణనాత్మకం కాగా, దిద్దుబాటు, పెద్ద మసీదు, మెటిల్డా – సంభాషణాత్మకంగా సాగుతాయి!! "నా కళ్ళకు కట్టినట్టు ఆ వొంచిన మొఖం, బిందువులుగా స్రవించిన కన్నీరు, ఆచుకొన్న నిట్టూర్పుల చేత కంపించిన రొమ్ము" – ఏ మహాకవి రచనలోనూ లేదనగలను. "అగాధమైన కరుణ రసం, ఆ సరిలేని సొగసున్ను... " – యిలా మెటిల్డా గురించి వర్ణన. అలాగే మరోచోట "మీ పేరేమిటి"లో క్రీస్తును, శ్రీమహావిష్ణు యొక్క పదకొండవ అవతారంగా చెయ్యడానికి సాధ్యం కాక వొడబడి వూరుకున్నాం... " అంటారు రచయిత. పైన ఎంత భావుకత వుందో యిక్కడ అంత వ్యంగ్యం వుంది. అలాగే 'సంస్కర్త హృదయం'లో – సమాజంలో భోగం పడుచులు "సేఫ్టీ వాల్వ్ స్" వంటివారు. అనడంలో చమత్కారంతో నాణేనికి రెండోవైపు వంటి దృష్టి కూడా వుంది. "లేబరేటరీలో దుర్వాసన కొట్టే సల్ఫ్యూరిక్ యాసిడ్, హైడ్రోజన్ కంటే అగరు, అత్తరుల వాసనలు సరికొత్త మార్పులని అంగీకరించాడు..." అని 'సంస్కర్త హృదయం'లో అనడం హాస్య చతురతే!

అంతకు మించి "దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుళ్ళారా? మీ పేరేమిటి?" అనే కథ శీర్షికలో శాస్త్ర దృష్టి పుష్కలంగా వుంది. ఇంత సమగ్రమైన, ప్రతిభావంతమైన వ్యూహం ఎలా సాధ్యపడింది – అనే ప్రశ్నకు జవాబు కావాలంటే ఆయన ఆలోచన, పాండిత్యపు నేపథ్యం పరిశీలించాలి. ఆయన బి.ఎ.లో తత్వశాస్త్రం, సంస్కృతం నేర్చుకున్నారు. గిడుగు రామమూర్తి పంతులు బాల్య స్నేహితుడే కాదు, బి.ఎ.దాకా కలసి చదువుకున్నారు. మొదట ఇంగ్లీషులో కవిత్వ రచన. అలా తొలి దశలో రాసినవి ప్రచురింపబడటమే కాదు, అభినందనలతో పునర్ముద్రింపబడ్డాయి పెద్ద పత్రికలలో! మొదట హైస్కూలులో ఉపాధ్యాయుడు, తర్వాత డిప్యూటీ కలెక్టరాఫీసులో హెడ్ క్లర్క్, తర్వాత లెక్చరర్ ఉద్యోగం, ఇంగ్లీషు వ్యాకరణం, సంస్కృత సారస్వతం, అనువాదం, గ్రీకు, రోమన్ చరిత్రలు – ఆయన బోధించేవాడు. అదే సమయంలో సంస్థాన శాసన పరిశోధక పదవి. తర్వాత సంపాదకుడు కావాలని ఆశతో 'ప్రకాశిక' సంపాదకునిగా డిక్లరేషన్ తీసుకున్నాడు. కావ్యాలు, చరిత్రలు పరిశోధించి, పరిష్కరించడం, గజపతుల దావాలు నడపటం, రీవారాణి అంతరంగిక కార్యదర్శి ఉద్యోగం, మద్రాసు విశ్వవిద్యాలయంలో ఫెల్లో పదవి. ఇదీ ఆయన నేపథ్యం.

గురజాడ కథలు ఒకటికి మూడుసార్లు చదివితే, మనం ఆయన బాణి పట్టుకుని ముందుకెళ్ళింది స్వల్పమే – అనే అభిప్రాయం తప్పక కలుగుతుంది. ●

మమత-సమత-మానవత
www.gurajada.org

# ప్రకాశిక

ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakashika.org

సంపుటి 1 | సంచిక 1 అక్టోబర్ - డిసెంబర్, 2020

పునః ప్రారంభ సంచిక

## గట్టి మేల్ తలపెట్టవోయ్

కీ.శే. గురజాడ వేంకట అప్పారావు

మమత

సమత

మానవత

దార్శనికత

నూతన ఆవిష్కరణలు



దేశభక్తి

ఆధునిక ఆలోచనలు

విశాల దృక్పథం

ప్రాపంచిక దృక్పథం

అభ్యుదయ భావాలు

సమాజ శ్రేయస్సు

సంప్రదాయ నిరతి

editor@prakasika.org